# శ్రీ శంకర జీవితం

ప్రవచనం

బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ



ఎమెస్కో

# శ్రీ శంకర జీవితం

ప్రవచనం

బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ

ఎమెస్కో

పూజ్య గురుదేవులు తమ అమృత ప్రవచనాలను అక్షర రూపంలో కూర్చడానికి మమ్మల్ని అనుమతించారు. వారి ఈ అనుగ్రహాన్ని మా పూర్వజన్మ సుకృతంగా భావిస్తూ పూజ్యగురు దంపతుల చరణాలకు శతసహస్ర పాదాభివందనాలు అర్పిస్తున్నాము.

గురుచరణ దాసులు

**శ్రీమతి అదవి కనకదుర్గ, వేంకట సీతారామారావు**

# శ్రీ శంకర జీవితం

శంకరభగవత్పాదులు కారణజన్ములు. మనందరిలా జన్మించిన వారు కారు. మనం దేనికోసం జన్మిస్తామంటే గత జన్మలలో చేసిన పాప పుణ్యాల ఫలితాలను అనుభవించటం కోసమని ప్రాకృతమైన శరీరంలో ప్రవేశించి ఆ కర్మ ఫలితాన్ని సుఖంగా, దుఃఖంగా అనుభవిస్తుంటాం. శంకరుల జీవితం అటువంటి జీవితం కాదు. వారు సాక్షాత్తుగా సదాశివుడే. కైలాసవాసియైన శంకరుడికి, కాలడియందు జన్మించిన శంకరునకు అభేదం. ఇద్దరూ ఒక్కటే. స్వామి అనేకమైన అవతారాలను స్వీకరిస్తాడు. పరబ్రహ్మ 'పరిత్రాణాయ సాధూనాం. వినాశాయచ దుష్కృతాం ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.' అన్నారు. ఒక్కొక్కనాడు లోకంలో రాక్షసులతాకిడి ఎక్కువగా ఉంటుంది. ధర్మము ఇబ్బంది పడుతుంది. మళ్ళీ ధర్మసంస్థాపన చేసి రాక్షస సంహారం చేయటం కోసమని ఈశ్వరుడే అవతారాలను స్వీకరించి కరచరణాదులతో కదిలివచ్చి రాక్షస సంహారం చేస్తుంటాడు. ఒక్కొక్కనాడు లోకంలో భక్తి జ్ఞాన వైరాగ్యాల ప్రబోధాలు చెయ్యడం కోసం కూడా భగవానులు అవతారం స్వీకరిస్తాడు. అలా శంకరభగవానులు స్వీకరించిన మహోత్కృష్టమైన అవతారాలలో ఆదిశంకరాచార్యుల వారి అవతారం ఒకటి.

శంకరులు మాధవ మాసంలో జన్మించారు. చైత్ర మాసాన్ని మధుమాసం అని పిలుస్తారు. వైశాఖ మాసాన్ని మాధవ మాసం అని పిలుస్తారు. వైశాఖ మాసంలో శంకరభగవత్పాదులు జన్మించారు. వైశాఖ మాసానికి మాసముల రీత్యా ఒక ప్రత్యేకమైన ప్రశస్తి ఉంది. ఇది పృథ్వీ సంబంధమైన నెల. ఈ

సమయంలో రెండు వస్తాయి. ఒకటి మల్లెపూవు. రెండు మామిడిపండు. మామిడి పండు అపారమైన మాధుర్యానికి గుర్తు. మల్లెపువ్వు అపారమైన సువాసనకు గుర్తు. శంకరభగవత్పాదులు కూడా వైశాఖ మాసమునందే అవతారాన్ని స్వీకరించారు. వైశాఖ మాసంలో జన్మించిన శంకరభగవత్పాదుల వారి మాటలు కానీ, స్తోత్రాలు కానీ వారు చేసిన ప్రకరణాలు కానీ, వాఖ్యానాలు కానీ అవి మధురాతి మధురాలు. వాక్కునకు మాధుర్యం లేకపోతే అది ఆస్వాదించబడదు. అది ఎంత గొప్ప విషయమైనా కానివ్వండి. అది చెప్పే వాడి మాటయందు కాఠిన్యం ఉందనుకోండి. ఆ చెప్పే మాట పది మంది వినటానికి ఇష్టపడరు. ఆ మాట సరళంగా వినే వారి హృదయాన్ని రంజింపచేసేటటువంటి కోమలత్వంతో, మాధుర్యంతో, ప్రతిపాదింపబడాలి. వాక్కు మాధుర్యాన్ని కలిగి ఉండి. అటువంటి వాక్కును ప్రతిపాదించటంలో శంకరులకు శంకరులే సాటి. అటువంటి శంకరులు. సువాసనతో కూడిన వాసంతికా పుష్పం అంటే మల్లెపువ్వు పుట్టే మాసంలోనే వారు కూడా జన్మించారు. మల్లెపువ్వులు ఈ మాసంలో విశేషంగా వస్తాయి. మల్లెపువ్వు అసురసంధ్యా కాలంలో బాగా విచ్చుకుంటుంది. సాధారణంగా పద్మం సూర్యకిరణాలు తగలగానే ఉదయం వేళ విచ్చుకుంటుంది. మల్లె పువ్వు ఉదయం వేళ విచ్చుకోదు. బాగా అసురసంధ్యవేళలో అంటే ఉత్తర సంధ్యయందు ీకటి పడుతూండగా బాగా విచ్చుకుని విశేషమైన సువాసననిస్తుంది. దానికి ంధ్యాకాలం అని పేరు.

సంధ్య అంటే రెండు సంకల్పాల మధ్యలో ఉన్న అసలు ఏ సంకల్పమూ లేని చైతన్య స్వరూపమైన స్థితి. అంటే మీకు ఇంకొక విధంగా చెప్పాలంటే మనం నిద్రలేచింది మొదలు మనసులో నిప్పుల్లోంచి రవ్వలు పైకి వచ్చినట్టు అనేకమైన అలోచనలు వచ్చేస్తుంటాయి. ఆ ఆలోచనలకు ఇంక ఎడతెరిపి ఉండదు. అవి అలా పుట్టేస్తుంటాయి. అందుకే మనస్సనగా సంకల్ప వికల్ప సంఘాతం అంటారు. అసలు మన యథార్థ స్థితి ఎక్కడ ఉన్నది? అంటే

రెండు సంకల్పాలకు మధ్యలో ఏ సంకల్పం లేకుండా ఉన్న కొద్దిపాటి సమయమేదున్నదో అది ఏ సంకల్పంలేని సమయం. ఆ సమయం మన నిజస్వరూపం. అది ఆత్మ. అటువంటి ఆత్మ స్వరూపం సంధ్యా సమయంచేత ప్రతిపాదించ బడుతోంది. అందుకే 'సంధ్యారంభ విజృంభితం శ్రుతిశిరస్థానాం తరాధిష్ఠితం' అంటారు. శ్రుతి శిరస్సు అంటే వేదముల చిట్టచివర ఏర్పడినవి ఉపనిషత్తులు.

ఉపనిషత్తులు జ్ఞానభాగాలు. జ్ఞానాత్ కేవల కైవల్యం. జ్ఞానం చేత మాత్రమే మోక్షమొస్తుంది. అందుచేత అటువంటి జ్ఞానకాండలో ఉన్న అద్వైత సిద్ధాంతాన్ని ప్రచారంచేసి ఆత్మ తత్త్వాన్ని ఆవిష్కరించారు. 'మోక్షం ఎప్పుడో ఎక్కడో నువ్వు ఏదో చేస్తే వచ్చేది కాదు. నువ్వు సహజంగా మోక్ష స్వరూపుడవు. నువ్వు బంధమునందున్నవాడివి కావు. ఇప్పుడే ఇక్కడే మోక్షాన్ని పొంది ఉన్నావు. అది నువ్వు తెలుసుకోలేదంతే. తెలుసుకుంటే మోక్షం పొందినవాడివే' అంటారు శంకరులు. శంకరుల తర్కం సామాన్యమైన వాదం కాదు. వారు ప్రచండ ఝంఝామారుతం.

శంకరభగవత్పాదులు రాకముందు దేశంలో అనేకమైన వాదాలున్నాయి. రకరకాల వాదాలతో వేదంలోంచి ఎవరికితోచిన సిద్ధాంతాలను వాళ్ళు ప్రతిపాదన చేసారు. శంకరులు అడుగుపెట్టారు. మనకి ఒక గమ్మత్తు ఉంది. కేరళరాష్ట్రానికి, కాశీపట్టణానికి ఈ రెండిటికీ భారతదేశంలో భౌగోళికంగా ఒక ప్రత్యేకస్థానం ఉంది. ఒకసారి పరిశీలన చేసి చూడండి. కేరళ రాష్ట్రంలో అంటే శంకరాచార్యుల శాపానికి ముందు మాట నేను చెప్తున్నది. శంకరాచార్యులవారు శాపమిచ్చారు కేరళ రాష్ట్రానికి. ఒకటి, ఈ రాష్ట్రం ఇంత గొప్పదయినా రాబోవు కాలమునందు ఇక్కడ భారతదేశంలో తర్క ప్రచారం చేయు పీఠం ఉండకుందుగాక అని శపించారు. అందుకే కేరళలో శంకరాచార్యుల వారు పుట్టినా పీఠంలేదు. కర్ణాటకలో పీఠం ఉంది. రెండు, ఇంటి వెనకాల సమాధులు కూడా వెలయు గాక. ఇళ్ళ వెనకాతల సమాధులు

కట్టుకునే వాళ్ళ సంఖ్య అక్కడ ఎక్కువ. మూడు, సనాతన ధర్మమై వేదంచేత ప్రతిపాదించబడిన సిద్ధాంతాన్ని తిరస్కరించి జీవించేవారి సంఖ్య ఎక్కువగా ఉన్న ప్రాంతంగా కేరళ భావింపబడుగాక. కేరళ అందుకే అలా అయిపోయింది. ఇదీ ఈనాటి కేరళ పరిస్థితి గురించి నేను మాట్లాడటంలేదు. నేను మాట్లాడుతున్న కేరళ రాష్ట్రం శంకరభగవత్పాదులు జన్మించినప్పటి కేరళ రాష్ట్రం. ఇప్పటికీ ఆ వాసనలు కేరళ రాష్ట్రంలో కొన్ని ఉన్నాయి. ఏవి అంటే కేరళయందు రెండెక్కువ. ఒకటి కొబ్బరికాయలు. రెండు అరటి పండ్లు. కొబ్బరికాయలు, అరటిపండ్లు ఉంటే ఎందుకండీ? మీరు గుళ్ళో కెళుతున్నారని ఏమిటి గుర్తు? కొబ్బరికాయ, అరటిపళ్ళు చేతిలో ఉంటాయి. తోటకూర, గోంగూర పట్టుకున్నారంటే మీకు తెచ్చుకుంటున్నారు. కొబ్బరికాయ, అరటిపళ్ళు చేతిలో పట్టుకున్నారంటే దేవాలయానికి వెళుతున్నారు.

నంబూద్రి బ్రాహ్మణులు విశేషమైన జ్ఞాన సంపన్నులు. అపారమైన సదాచార సంపన్నులు. అటువంటి నంబూద్రి బ్రాహ్మణులకి ఆవాసస్థానం కేరళ. అందునా కొబ్బరి బోండాం. పూర్ణకుంభం. కొబ్బరికాయ మన జీవితాన్ని చెప్తుంది. అరటిపండు దూర్వాసో మహర్షి వరప్రసాదం. కదళి ఆయన భార్య పేరు. ఆయన తన భార్యను శపించాడు. శపిస్తే ఆవిడ మరణించింది. శరీరం విడిచిపెట్టి బూడిదయ్యింది. మామగారొచ్చి దెబ్బలాడాడు. అదేమిటి అలా కాల్చేసావు నీశాప దృష్టిచేత. నీకు పిల్లనిచ్చినప్పుడే మాట ఇచ్చాను. ఎందుకిలా సావు అని. అంటే అప్పుడు వరమిచ్చాడు. నా భార్య కదళి కాల్చబడినా ఉత్తర జన్మలలో కదళీ వృక్షంగా జన్మిస్తుంది. ఇక విత్తనం వేయక్కరలా ఒకసారి కదళీ వృక్షం పెడితే చెట్టు పడిపోతున్నప్పుడు మళ్ళీ ఇంకొక పిల్ల పుట్టేస్తుంది. ఇంకొక చెట్టు పుట్టేస్తుంది. కదళీ ఎక్కడయినా సరే. దేవతల ఆరాధనలో ఉపయోగపడుతుంది. అరటిపండు లేని పూజ ఉండదు అని. అందుకే కదళికి అంత విశేషమైన ప్రఖ్యాతి. ఆ కదళీ ఫలం, నారికేళం. ఈ రెండూ కేరళలో ఎక్కువ. రెండవ పట్టణం దేని ప్రస్తావనచేసాను నేను. కాశీ, కాశీకి ఉన్న

గొప్పతనం ఏమిటో తెలుసా. సరే విశ్వేశ్వరుని గురించి, గంగానది గురించి మీరు కాసేపు పక్కన పెట్టండి. ఆ రెండిటి గురించి తెలియని వారు ప్రపంచంలో ఉండరు. కాశీపట్టణ వైభవాన్ని వేరొక కోణంలో నేను దాన్ని ఆవిష్కరించే ప్రయత్నం చేస్తున్నాను.

పూర్వకాలంలోనే కాదు ఇప్పుడు కూడా మీరు చూడండి ఏమండి నేను కాశీ వెళ్ళొచ్చాను అన్నాడనుకోండి. చాలా సంతోషిస్తాం. రెండు ఎంత చదువుకున్నా మహాపండితుడవ్వనివ్వండి కాశీలో చదువుకున్నానండీ సంస్కృతపీఠంలో అన్నాడనుకోండి అదో ప్రత్యేకత. పూర్వం ఎక్కడెక్కడో చదువుకోనివ్వండి ఎంత చదువుకోనివ్వండి సంస్కృతంలో ఒక స్థితి వచ్చిన తరువాత వారణాసి పట్టణానికి వెళ్ళేవారు. పూర్వకాలం తాళపత్ర గ్రంథాలే. ఓ! ఎన్ని పుస్తకాలు కావాలంటే అన్ని పుస్తకాలు చేతుల్లో ఉండేవి కావు. వాళ్ళు వ్రాసిన పుస్తకాలే వాళ్ళ దగ్గర ఉండేవి కావు. జిహ్వాగ్రంపై ఉండేది శారద. నాలుక మీద పెట్టుకునేవారు. పాండితీ ప్రకర్ష అంటే పుస్తకాలు పట్టుకుని తిరిగిన రోజులు కావవి. ఆ రోజులలో బ్రాహ్మణుడు అంటే, శారదా కటాక్షం అంటే నోరు విప్పితే నాలుక మీద శారద నర్తన చేయవలసిందే అలా ఉండేవారు. అందుచేత కాశీ పట్టణం చేరుకుని అక్కడ బ్రాహ్మణులు సంవాదం చేసేవారు. ఎలా? రోజులు రోజులు మాట్లాడేవారు. ఎక్కడనుంచి? జిహ్వాగ్రము మీదనుంచి సరస్వతీ దేవి పలికేది. ఒక్కొక్కరికి పట్టాలు ఇచ్చేవారు. వీడు సామాన్యుడు కాదు. మహా పండితుడు. దాన్ని బట్టి పిల్లనిచ్చేవారు. వీడు ఎంత గొప్ప పండితుడో తెలుసా? కాశీ పట్టణంలో విద్వాంసులు వీడిని సత్కరించారు, పట్టా ఇచ్చారు అని చెప్పేవారు. కాశీపట్టణం భారతదేశంలో సరస్వతీ కటాక్షాన్ని పొందిన వారికి ధ్రువీకరణ పత్రాలిచ్చిన మహోత్కృష్టమైన ప్రదేశం.

శంకర భగవత్పాదులకి ఆశ్చర్యకరంగా ఈ రెండు పట్టణాలతో గొప్ప సంబంధం ఉంది. ఎలా? వారు పుట్టింది కేరళ రాష్ట్రంలో. వారు మొట్టమొదట

కాశీ పట్టణాన్ని చేరుకునే తన విద్యావ్యాప్తిని ప్రారంభం చేసారు. తాను ఈశ్వరాంశ సంభూతుడైతే తనకి పరమేశ్వర దర్శనం ఎక్కడ? కాశీ పట్టణంలో. అయితే మీరొక్కవిషయం జాగ్రత్తగా గమనించాలి. సాధారణంగా అంటారు కాశీ పట్టణంలో శంకరాచార్యులవారు వెళుతుంటే కుక్కల్ని వెంటబెట్టుకుని ఒక చండాలుడు వచ్చాడు. శంకరుల శిష్యులు తొలగు తొలగు అన్నారు. శంకరులు వస్తున్నారు స్నానానికి నువ్వు ఎదురొస్తావా? పక్కకెళ్ళు పక్కకెళ్ళు అన్నారు. ఆరోజులలో శంకరాచార్యులవారు ప్రతిపాదించిన అద్వైత సిద్ధాంతం ఎంత ప్రచారం పొందిందంటే ఒక చండాలుడికి కూడా అర్థమైపోయిందది. అందుకని ఆయన అన్నాడు ఏమయ్యా నువ్వే చెప్తావు కదా అంతటా పరివ్యాప్తమైనది ఒక్క ఆత్మ తప్ప వేరొకటి లేదని నన్ను తప్పుకోమంటావా? ఆత్మని తప్పుకోమంటావా? దేన్ని తప్పుకోమంటావు? అనడిగితే శంకరులు గుర్తుపట్టారు. వచ్చినవాడు శంకరుడే అని వినమ్రులై శిరస్సు వంచి నమస్కరించి స్తోత్రం చేసారు. అందుకని కాశీ పట్టణానికి శంకరాచార్యుల వారు చిన్న చిన్న శ్లోకాలు కొన్నిచ్చారు.

ఒక్కసారి శంకరభగవత్పాదులు గంగానదిలో స్నానం చేయడానికి వెళుతున్నారు. గంగ పొంగిపోయి ఉవ్వెత్తున అలలతో పైకి లేచిందట. ఒకనాడు తన శిరస్సున పట్టి భవాంగ పతితం తోయం పవిత్రమితి వపుషః అని ఎవరి శరీరాంగాలను తాకటం చేత నాకు ఈ పవిత్రత వచ్చిందో వాడు ఇవాళ వేరొక అంశలో వచ్చి నాలో స్నానం చేస్తున్నాడు. ఏమి అద్భుత ఘట్టం అని గంగ ముందుకొచ్చిందట. అదీ శంకరుల వైభవం అంటే. శంకరుల లాంటి గురువు ఉండరు ప్రపంచంలో. వారికి వారే సాటి. అటువంటి జగద్గురువులు. సరే వారి జన్మకు సంబంధించిన విషయాన్ని ప్రస్తావన చేస్తూ కేరళ రాష్ట్ర వైభవాన్ని ఆవిష్కరిస్తాను.

ఆ కేరళ రాష్ట్రంలో కాలడి అనబడే ఒక గ్రామం ఉంది. అందులో ఒకానొకప్పుడు ఒక మహానుభావుడు జన్మించాడు. ఆయన సద్బ్రాహ్మణుడు.

త్రికాల సంధ్యావందనం చేస్తూ ఉండేవాడు. సర్వ వేద వేదాంగాలు చదువుకున్నాడు. శాస్త్రం పురాణేతిహాసాలు చదువుకున్నాడు. ఉపకారం చేస్తూండేవాడు. ఒక బ్రాహ్మణుడు ఎలా జీవించాలో అటువంటి జీవనం చేస్తున్న వ్యక్తి. అటువంటి మహానుభావుడికి ఒక కుమారుడు జన్మించాడు. ఆయనపేరు శివ గురువు. ఎందుకు పెట్టుకున్నాడు ఆ పేరు. అంటే శంకరుడు జ్ఞానాన్ని ఇచ్చే వాడు కనుక. నాకు పుట్టిన ఈ కుమారుడు గురు స్వరూపాన్ని పొంది జనులలో ఉన్న అజ్ఞానాన్ని తొలగింపచేసేవాడు కావాలన్న కోరికచేత ఆయన తన కుమారుడికి శివగురువు అని పేరు పెట్టుకున్నాడు. ఆ పిల్లవాడు పెరిగి పెద్దవాడయ్యాడు. ఆయన కూడా త్రికాల సంధ్యావందనం చేసేవాడు. చక్కగా వేదం చదువుకున్నాడు. శాస్త్రపురాణేతిహాసాలు చదువుకున్నాడు. చక్కని ప్రవర్తన కలవాడు. శివగురువు గురువుల దగ్గర చాలాకాలం విద్యాభ్యాసం చేసాడు. గురువులు సంతోషించారు. నాయనా! శివ గురూ! ఇంతకాలం మా దగ్గర శుశ్రూష చేసి విద్యాభ్యాసం చేసావు. గురువుల దగ్గర ఆ రోజులలో విద్యాభ్యాసం చేయడమంటే ప్రిస్క్రైబ్డ్ సిలబస్ ఉండేది కాదు. గురువులకి శుశ్రూష చేయాలి. గురువు ఒకనాడు నాయనా వెళ్ళి భిక్ష తీసుకురండంటాడు. నాలుగు ఇళ్ళ ముందుకు వెళ్ళి భిక్ష పట్టుకురావాలి. గురువు పడుకుంటాడు. ఆయన కాళ్ళు వత్తుతారు. గురుపత్ని పిలిచి నాయనా కడవతో నీళ్ళు పట్టుకురా అంటుంది. నీళ్ళు పట్టుకురావాలి. గురువు సంతోషించి నాలుగు మాటలు చెప్తాడు. గురువనే వాడు మేఘం లాంటివాడు. ఎక్కడైనా ఏదైనా చాలా గొప్ప పని జరుగుతోందనుకోండి. గుర్తేమిటో తెలుసాండీ? వర్షం ముందొచ్చి పడుతుంది.

ఇక్కడ శంకరాచార్యుల వారి దేవాలయ నిర్మాణం జరిగింది. ప్రతిష్ఠ జరగాలి. శంకరాచార్యుల వారి ప్రతిష్ఠకి సంబంధించిన కార్యక్రమం ఇంకొక్క అరగంటలో ప్రారంభమవుతోంది. నీ ఇంట్లో శుభకార్యం జరిగితే మీరేం చేస్తారు ముందు? శుభ్రంగా ఇల్లు కడిగించి ముగ్గులేసుకుంటారు. అంతేకదా!

అయ్యయ్యో ఇంత దేవాలయం అంతా కడగాలి కదా అనుకుంటారేమో అనీ తృప్తి చెందిన దేవతలు వచ్చి వర్షరూపంలో కాకినాడ పట్టణాన్నే కడిగేసారు. కడిగేసి శంకరులొస్తున్నారని సిద్ధం చేసారు పట్టణాన్ని. అదే ఇప్పుడు పడుంటే ప్రతిబంధకం అయ్యుండేది. అది ఖచ్చితంగా ముందొచ్చి కడిగేసి సభికులందరూ రావటానికి వీలుగా ఉపశాంతి పడి ఊరుకుంది. ఇంతకన్నా శంకరాచార్యుల వారి వైభవానికి మీకేం కావాలి తార్కాణం. అందుచేత శంకరభగవత్పాదుల తండ్రిగారైన శివగురువు గురువుల శుశ్రూష చేసారు. విద్యనార్జించారు. గురువుగారూ! నేనింక ఇంటికెళ్లిపోనాండి అని అడిగేవారు కారు.

ఒక రోజున గురువుగారే పిలిచారు. పిలిచి నాయనా శివగురూ! నువ్వు నన్ను సేవించి అన్ని విద్యలూ నేర్చుకున్నావు. ఒక పరిణతిని పొందావు. ఇంక నువ్వు గృహస్థాశ్రమంలో ప్రవేశించాలి. పూర్వం మాట్లాడితే అంత అందంగా ఉండేది. ఒరేయ్ నీకు పిల్లని చూస్తానురా! నువ్వు పెళ్ళి చేసుకో అనేవారు కాదు. కొడుకుని కూర్చోపెట్టుకుని ఎందుకు వివాహం చేస్తున్నారో ..జంగా మీరు శంకర విజయాలలో గురువు తన శిష్యుడిని పంపించే ముందు ..ప్పిన మాటలు చదివితే ఆశ్చర్యపోతారు. ఆయన చెప్పారూ. నువ్వు నా దగ్గర ఇంత విద్య నేర్చుకున్నావు. నేర్చుకున్నందుకు నీ వల్ల సమాజానికి కొంత ప్రయోజనం కలగాలి. అది ఏరకంగా ఉండాలి. దేవఋణం, పితృ ఋణం, ఋషి ఋణం, మూడు ఋణాలు తీరాలి నీవల్ల. దేవతార్చనం చేసి దేవతలను ఆరాధించి ఇతరులతో కూడా ఈ మతం యొక్క వైభవాన్ని ప్రకాశింపచేసి దేవతారాధన చేయిస్తే ఆ ఋణం తీరుతుంది. బ్రాహ్మణుడవు కనుక వ్యాప్తి కూడా చేయాలి రెండు ఋషుల ఋణం తీర్చుకోవాలి. ఋషి ప్రోక్తమైన వాఙ్మయాన్ని ప్రచారం చేయాలి. మూడవది పితృఋణం తీర్చుకోవాలి. నిన్ను నీ తండ్రిగారు కన్నట్టే నువ్వు కూడా ఒక కుమారునికి జన్మనివ్వాలి. దానికోసమని నువ్వు గృహస్థాశ్రమంలో ప్రవేశించాలి. నువ్వు నాదగ్గర బ్రహ్మచారిగా శిష్యుడిగా ఉండిపోతే ఇదంతా ఎలా కుదురుతుంది.

నువ్వు విద్యాసముపార్జన యందు ఒక స్థాయిని పొందావు కనుక ఇంటికి చేరుకుని గృహస్థాశ్రమంలో ప్రవేశించవలసింది అని ఆజ్ఞాపించి పంపించారు. గురువుకి నమస్కారం చేసారు. ఇంటికొచ్చారు. కొడుకుని చూసి విద్యాధి రాజు పొంగిపోయారు. సంతోషించి తన కుమారుని విద్యా వైభవాన్ని ఒక్కసారి పరీక్షచేసారు. చాలా పొంగిపోయారు. నా కొడుకుకు ఒక ఉత్తమమైన ఇల్లాలు దొరకాలి అని, అమ్మాయి కోసం అన్వేషణ చేస్తున్నారు. సత్సంప్రదాయం ఏమంటే కొడుకుకి తగిన కోడలు కావాలనుకున్నవారు ఆడపిల్లవారిని పట్టుకుని అడుగుతారు. అది గమ్మత్తు. అది తక్కువ తనం కాదు. అది చాలా మంచి విషయం. దానికి చాలా గొప్ప సంస్కారం ఉంటే కాని అలా చేయలేరు. వాళ్ళే మా అబ్బాయి దగ్గరికి రావాలని కూర్చునే వారికి శాస్త్రం అంత బాగా తెలిసి ఉండకపోవచ్చు.

మఘపండితుడు అని బ్రాహ్మణుడు ఉండేవారు. వారి కుమార్తె ఆర్యాంబ. ఆ ఆర్యాంబ సుగుణాల రాశి. ఆ అమ్మాయిని శివగురువుకిచ్చి వివాహం చేయాలనే సంకల్పంతో శివగురువుగారి తండ్రిగారు మఘపండితుడి దగ్గరికి వెళ్ళి అడిగారు. అయ్యా మీ పిల్లని మా అబ్బాయికిచ్చి పెళ్ళి చేయవలసింది అని. మఘ పండితున్నాడు. తప్పకుండా మీ పిల్లవాడికి మా పిల్లనివ్వడంలో మాకేవిధమైన భిన్నాభిప్రాయం లేదు. కానీ ఒక్క షరతు. పెండ్లికుమారుడు మాయింటి కొచ్చి వివాహం చేసుకోవాలి, కన్యాదాత గారి ఇంటికొచ్చి అన్నారు. కానీ శివగురువు తండ్రిగారన్నారు మా అబ్బాయి మీ ఇంటికొచ్చి వివాహం చేసుకోవటంకాదు మీరే మా ఇంటికొచ్చి ఆతిథ్యం పుచ్చుకుని మా ఇంట్లో వివాహం చేసుకోవాలి అన్నారు. ఈ రోజుల్లో ఎన్నిపూటలు భోజనాలు పెట్టించుకుందామని అన్నం లేని వాడిలా వాడు చూస్తాడు. ఎన్ని పూటలు కోసేద్దామని వీడు చూస్తాడు. అంత వ్యాపార సరళి ఇప్పుడు. 'మాయింటికొచ్చి పెళ్ళి చేసుకో, మా యింటికొచ్చి పెళ్ళి చేసుకో' అని దెబ్బలాడుకున్నారు. ఇద్దరికీ కొంచెం పట్టుదలలు వచ్చాయి. వాళ్ళింటికొచ్చి వివాహం

చేసుకోమంటారు గానీ పిల్లను తీసుకుని రారని కోపగించి శివగురువు తండ్రి ఆ సంబంధాన్ని స్థిరీకరించకుండా ఆపారు. పిల్లవాడు మాయింటికొచ్చి వివాహం చేసుకోవాలి కన్యాదాత గారింటికి రాకుండా వాళ్ళింటికి రమ్మంటాడేమిటి? నాపిల్లకేం తక్కువ ఆర్యాంబ సుగుణాలరాశి సరే! వాళ్ళే దిగొస్తారని ఆయన కూర్చున్నాడు. ఇద్దరూ చక్కటి వ్యక్తులు. ఆర్యాంబ, శివగురువు చక్కటి దాంపత్యం. పోతన, 'తగునీచక్రి విదర్భరాజ సుతకున్' అంటాడు. కానీ మరి ఈ దాంపత్యం జరగాలంటే ఈ అవరోధం. అందుకని ఏం చేయాలి. మధ్యలో ఒకాయన బయల్దేరాడు. ఆడపిల్ల తండ్రి దగ్గరకి వెళ్ళాడు. 'ఏమయ్యా! చక్కటి సంబంధం పిల్లవాడు చూస్తే చదువుకున్నాడు. మంచి చదువు సద్బ్రాహ్మణుడు. తండ్రిగారు ఆచార సంప్రదాయాలున్నవాడు. గొప్ప వంశం, వాళ్ళు ఏమడిగారు నిన్ను ఇంటికొచ్చి పిల్లనడిగారు. వాళ్ళకున్న కోరికేమిటి? కాస్త వాళ్ళింటికెళ్ళి వివాహం చేసుకోమంటున్నారు. పైగా నీకే భోజనాలు పెడతామంటున్నారుగా? అందుకని వెళ్ళి వివాహం చేసుకో, ఒక్క మెట్టు దిగితే వచ్చిన నష్టం ఏమిటి' అన్నారు. సరే మఘపండితుడు ఒక మెట్టు దిగాడు. శివగురువు, ఆర్యాంబ ఇద్దరికీ వివాహం అయింది. వాళ్లిదరికి వివాహం జరిగితే ఆ వంశం వృద్ధి చెందుతుంది అని పెద్దలు నిశ్చయించారు కాబట్టి మఘపండితుడు ఒక మెట్టు దిగివచ్చాడు. ఆఖరికి శివగురువు ఆర్యాంబ ఇద్దరికీ వివాహం జరిగింది. రంగ రంగ వైభవంగా జరిగిపోయింది. అందరూ పరమసంతోషించారు.

కొంతకాలమైపోయింది. ఇప్పుడే మీరు జాగ్రత్తగా జ్ఞాపకం పెట్టుకోవలసిన అంశమొకటుంది, దేనికోసమని గృహస్థాశ్రమంలోకి ప్రవేశించాడు శివగురువు. తన గురువు చెప్పాడు. 'పితృఋణం తీర్చుకో. నువ్వు కూడా ఒక కుమారుణ్ణి కను' అని చెప్పాడు. ఎంతకాలమైనా వారిద్దరికీ సంతానం కలగలేదు. ఈ బాధ భర్త ఎవరితో పంచుకుంటాడు. భార్యతో పంచుకున్నాడు. 'మన ఇద్దరికీ వివాహమై ఇంతకాలమైంది. కనీసం పుత్రుడు పుత్రిక ఇద్దరిలో ఎవ్వరూ

జన్మించలేదు. పితృఋణం తీరలేదు. ఇది నా మనసుకి కొంచం వ్యగ్రతని కల్పిస్తున్నది' అన్నాడు. భక్తి తత్పరులైన వారి హృదయాలు ఎలా ఉంటాయో చూడండి. ఆర్యాంబ అంది ఎందుకండీ అంత బెంగ పెట్టుకుంటారు. ఉపమన్యువు వృత్తాంతాన్ని మీరు మరచిపోయారా అని అడిగింది. ఏమిటి ఉపమన్యువు వృత్తాంతం.

పూర్వకాలంలో ఉపమన్యువు అనే పిల్లవాడుండేవాడు. ఆయన తండ్రి లేడు. తల్లి పెంచి పెద్ద చేస్తోంది. ఆ పిల్లవాడు తోటి పిల్లలతో కలిసి ఆడుకుంటున్నాడు. ఆ తల్లిపాపం ఎక్కడో దాసీత్వం చేసి పెంచుతోంది ఆ పిల్లవాడిని. తోటి పిల్లలు పాలుతాగుతున్నారు ఇంటికెళ్ళి. ఉపమన్యువు చూసాడు. 'పరిగెత్తుకుంటూ తల్లి దగ్గరికి వెళ్ళాడు. అమ్మా, అమ్మా నాకు పాలు తాగాలనుందమ్మా!' అన్నాడు. అంటే తల్లి కన్నుల నీరు పెట్టుకుని అంది 'నాన్నా! మనకు పాలు ఎక్కడనుంచి వస్తాయిరా' అంది. పిల్లలు వినరుగదా! 'అమ్మా! నాకు కూడా పాలు కావలసిందే.' అన్నాడు. తన పేదరికాన్ని పిల్లవానికేమని చెప్పుకుంటుంది అమ్మ! ఏమీ చెప్పలేక 'నీకసలు పాలు తాగాలన్న కోరిక ఎందుకు పుట్టింది' అనడిగింది. 'వాళ్ళందరూ తాగుతున్నారమ్మా పాలు తెల్లగా ఉన్నా'యన్నాడు పిల్లాడు. వాడికి పాల రుచి తెలియదు. రంగు తెలుసంతే. అమ్మ ఇది గమనించింది. చాలు అని ఇంట్లోకి వెళ్ళి కాస్త బియ్యపు పిండి తీసి నీళ్ళలో వేసి కలిపింది. వాడవి పాలనుకుని పిండినీళ్ళు తాగేసాడు. తాగేసి వీథిలోకొచ్చి పెద్ద గంతులేస్తున్నాడు. ఆ ధనికులైన పిల్లలొచ్చి. ఎందుకు గెంతుతున్నావని అడిగారు. ఉపమన్యువు వారితో తానుకూడ పాలు తాగాను అన్నాడు. నీకెక్కడివి పాలు అన్నారు. అంటే తెల్లగా ఉన్నాయి మా అమ్మ ఇచ్చింది అన్నారు. ఏదీ గ్లాసు చూపించు అన్నారు. బియ్యప్పిండితో కూడిన నీళ్ళు తాగితే అందులో తునకలుండిపోతాయి కదా! వాళ్ళు చూసి అన్నారు. నువ్వు తాగినవి పాలు కావు. బియ్యపుపిండి నీళ్ళిచ్చింది మీ అమ్మ నీకు. 'నీవు దరిద్రుడవు. నీకు పాలెక్కడివి' అన్నారు. ఆ పిల్లవాడ

ఏడ్చాడు. అమ్మ దగ్గరకెళ్ళి అడిగాడు. అమ్మా ఎందుకు పాలకి బదులు పిండి నీరు ఇచ్చావు నాకు అన్నాడు. అంటే ఆవిడ అందీ పదిమాట్లు వచ్చి అమ్మా పాలు లేవా? పాలు లేవా? అని నిలదీస్తే నాకన్నుల నీరొస్తుంది. మనం దరిద్రులం. మనకెక్కడినుంచి వస్తాయి పాలు. నీ పరిస్థితి చూసి తోటి పిల్లలు వేళాకోళం చేస్తున్నారు. ఇంటికొస్తే నేను గుక్కెడు పాలివ్వలేని దరిద్రురాలను. నేను ఏమని చెప్పగలను? నీ తండ్రి ఉంటే నీ కోరిక తీరి ఉండేది. అంటే నా తండ్రి ఎవరు? అన్నాడు. 'లోకాల కంతటికీ తండ్రియైన శంకరుడు నీకు కూడా తండ్రి. నీ తండ్రి శంకరుణ్ణి పాలిమ్మని అడుగు. వెళ్ళి శంకరున్ని స్తోత్రం చేయి అన్నది తల్లి. ఆయన వెళ్ళి కూర్చుని పూనికతో శివా, శివా,శివా, శివా అంటూ కూర్చున్నాడు. ఈశ్వరుడికి కావలసింది యాంత్రికమైన పూజకాదు. నీ నిబద్ధత. పిల్లవాడు తన తండ్రి శంకరుడని నమ్మి 'శివా శివా శివా శివా' అంటూ ఉంటే శంకరుడు వచ్చాడు. ఏమికావాలి? నీకు అన్నాడు. ...కు పాలు కావాలి అన్నాడు. నీకు పాలేమిరా? నువ్వు పాలు తాగి వెళతావా? ...దు లోకంలో ఉన్న వాళ్ళందరూ సంతోషించాలి నువ్వు పూనికతో చేసిన ప్రయత్నానికి, అని క్షీరసముద్రాన్ని సృష్టించి ఉపమన్యువుకు ఇచ్చాడు. ఆ ఉపమన్యువు గాథ భారతాంతర్గతం. అందులో ఉంది ఉపమన్యువు వృత్తాంతం. ఈ ఉపమన్యువు వృత్తాంతాన్ని ఆర్యాంబ శివగురువుకు చెప్పింది. 'ఏమండి ఒక పిల్లవాడు శివా, శివా శివా అన్నంత మాత్రాన గ్లాసుడు పాలడిగితే పాల సముద్రాన్నే సృష్టించాడు శంకరుడు. ఆయన కరుణ అవధిలేనిది. ఆ శంకరుని సేవించవయ్యా' అన్నది. అక్కడే వృషాచలంలో వెలసిన శంకరుడున్నాడు. ఆయన పేరు వృషాచలేశ్వరుడు. మహానుభావుడు ఆ శివగురువు అప్పటినుంచి తపస్సు ప్రారంభించాడు. మొట్టమొదట్లో కాయలు పళ్ళు తినేవాడు. ఆ తర్వాత అవి కూడా తినటం మానేశాడు. తర్వాత పూర్ణానదీ జలాన్ని మాత్రమే తీసుకునేవాడు. తర్వాత జలాన్ని కూడా విడిచిపెట్టాడు. శరీరాన్ని శుష్కింపచేసి తపస్సు చేస్తున్నాడు. తనకు కొడుకు కావాలి. శంకరుని అనుగ్రహంతో కొడుకు పుట్టాలి అని.

ఒకనాటి రాత్రి నిద్రపోతుండగా సదాశివుడు ప్రత్యక్షమయ్యాడు. 'చంద్రోద్భాసిత శేఖరే స్మరహరే గంగాధరే శంకరే సర్పైర్భూషిత కంఠకర్ణ వివరే నేత్రోత్థవైశ్వానరే దంతత్వక్కృత సుందరాంబర ధరే త్రైలోక్యసారేహరే' అంటారు శంకరులు. ఎంత అందగాడో మహానుభావుడు. సౌందర్యమూర్తి అయి ప్రత్యక్షమయ్యాడు. 'నాయనా శివగురూ ఎందుకలా శరీరాన్ని శుష్కింపచేస్తున్నావు. ఏకోరికతో తపస్సు చేస్తున్నావు' అనిఅడిగాడు. ఆ మహానుభావుడికి తెలియదా. కానీ భక్తుణ్ణి అడుగుతారు అదొక మర్యాద. అడిగితే ఆయనన్నాడు. మహానుభావా వంశం నిలబడటానికి కుమారుడు లేడు. అందుచేత నాకొక కుమారుడు కావాలి. అందుచేత నిన్నుద్దేశించి తపస్సు చేసాను అన్నారు. అందుకే శంకరుడు ఒక గమ్మత్తైన ప్రశ్న వేసాడు. శివగురూ నువ్వు చేసిన తపస్సుకు మెచ్చుకున్నాను. నీకు వరమిస్తాను. ఎటువంటి వరం. 'సర్వజ్ఞమప్యేకం అతిసర్వ గుణోపపన్నం.' సర్వగుణాలకు ఆలవాలమై జ్ఞానానికి రాశీభూతమై పరంజ్యోతి స్వరూపంలా ప్రవర్తిస్తూ ఆసేతు హిమాచల పర్యంతం పర్యటించి తన వాగ్ధాటి చేత, మేధ చేత అజ్ఞాన తిమిరాలను తొలగగొట్టి ఈ భారతదేశ వైభవాలను ఖండఖండాంతరాలకు వ్యాపింపచేసి జగద్గురువై మీ వంశాన్ని దేశాన్ని ఉద్ధరించగలిగిన మహాపురుషుడు నీ కడుపున అల్పాయుర్దాయంతో పుట్టాలా? లేకపోతే నీకు పుత్రం దదాం యదబహు విపరీత కాంస్తే అనేక కుమారులు కావాలా? వాళ్ళు దీర్ఘాయుష్మంతులై ఉంటారు. కానీ దుష్ప్రర్తనతో ప్రవర్తిస్తారు. లోకకంటకులు అవుతారు. నీ వంశానికి పేరు తీసుకురారు. అటువంటి పిల్లలు దీర్ఘాయుష్మంతులైన వారు చాలామంది కావాలా? రెండింటిలో ఏది కావాలో కోరుకో అంటే శివగురువన్నాడు! అల్పాయుర్దాయం ఉన్నవాడైనా ఆ కుమారుడు జగత్తునంతటినీ ఉద్ధరించగలిగిన మహాతేజో విరాజితుడైనవాడు నాకు కుమారుడిగా కావాలన్నారు. ఆయన తథాస్తు అని అన్నాడు. శంకరుడు అంతర్ధానమైనాడు. లేచాడు మహానుభావుడు రోమహర్షణమైంది. అంటే అపారమైన పులకలు బయలుదేరాయి శరీరంలో.

ఓహో నాకు సదాశివుడి అనుగ్రహం కలిగింది. నేను శంకరుడి ర్శనాన్ని పొందాను. స్వామి నన్ను అనుగ్రహించాడు. నాకు కుమారుడు ఝ్మిస్తాడని భార్యని లేపాడు. లేపి ఆర్యాంబా నాకు శంకర దర్శనం అయింది. మనకు కుమారుడు జన్మించబోతున్నాడు. అల్పాయుర్దాయం కలిగినవాడు పుడతాడని ఆర్యాంబకు చెప్పలేదు. ఎందుకంటే తల్లిబాధ పడుతుందికదా. అందుచేత మనం బయలుదేరి వెళ్ళిపోదాం రమ్మని వారి స్వగ్రామానికి చేరుకున్నారు. కొంతకాలమైన తరువాత శివుని అనుగ్రహంచేత సంతానం కలగడం అంటే దాని వైభవాన్ని శంకరవిజయాలలో వర్ణిస్తారు. ఇంత తపస్సు చేసి వచ్చాడుగదా! అందుకని ఆయన ఇంటికి బ్రాహ్మణులను ఆహ్వానించారు. అందరికీ సమారాధన చేసారు. వాళ్ళందరూ వెళ్ళిపోయిన తర్వాత అందులో ఎన్న ఉచ్ఛిష్టాన్ని స్వీకరించారు. వదిలిపెట్టిన ప్రసాదాన్ని ఇది బ్రాహ్మణాను హం అని దాన్ని తాను స్వీకరిస్తే దానిలో ఉన్న శేషాన్ని ఆర్యాంబ భుజించింది.

కొద్దికాలంలోనే ఆర్యాంబ గర్భవతి అయ్యింది. కడుపులో పెరుగుతున్న వారెవ్వరు? సాక్షాత్తు శంకరులు. అటువంటి శంకర భగవానుడే ఆమె కడుపులో పెరుగుతున్నారు కనుక ఆమెయందు దివ్యమైన తేజస్సు గోచరించేది. అమ్మవారి అంగాంగాలయందూ కాంతులు ప్రసరిస్తున్నాయి. శివగురువు పరమసంతోషంగా ఉన్నాడు. నా వంశం వృద్ధిలోకి రాబోతోంది. కుమారుడు జన్మిస్తాడు. జన్మిస్తున్నవాడు వాడూ వీడూ కాదు. మహాజ్ఞానియైన వాడు జన్మించబోతున్నాడు. నా జన్మ తరించపోతోంది. ఎందుకని? కొడుకు పుట్టినపుడు కాదు తండ్రి సంతోషించేది. ఆ కొడుకు కీర్తి ప్రతిష్ఠలను లోకమంతా చెప్పుకున్ననాడు సంతోషిస్తాడు. అటువంటి కుమారుడు నాకు జన్మించబోతు న్నాడు. నా జన్మ సార్థకం పొందుతోంది అని పొంగిపోతుండగా పరమ పవిత్రమైన రోజు రానే వచ్చింది. వైశాఖ శుక్ల పంచమి. వైశాఖమాసంలో శుక్ల పక్షంలో పంచమి తిథినాడు అది కూడా ఎప్పుడట? ఆ జన్మించిన సమయం కూడా 'జాయాత్సతీ శివగురో నిజతుంగ సంస్థే అని సూర్యే కుజే

రవిసుతే గురౌతు కేంద్రే' అన్నారు. శంకర విజయంలో పార్వతీదేవి స్కందునికి అంటే కుమారస్వామికి జన్మనిస్తున్నప్పుడు ఎటువంటి ఆనందాన్ని, అనుభూతిని పొందిందో అటువంటి అనుభూతిని ఆర్యాంబ పొందిందిట. శంకరులు, ఆది శంకరులు జన్మిస్తున్నప్పుడు లోకంలో.

శంకరభగవత్పాదులు భూమిమీద జన్మించారు. జన్మించి జన్మించగానే వేద ప్రమాణాలు తిరస్కరించి వాదించే వారి చేతుల్లోంచి పుస్తకాలు జారి క్రింద పడిపోయినాయిట. అకాలంగా తీగలన్నీ పుష్పించాయిట. చెట్లన్నీ ఫలపుష్పభరితాలయినాయిట. శంకరులు జన్మించటానికి ముందు లోకమంతా వర్షం కురిసి చల్లబడిందిట. నేనబద్ధం చెప్పటంలేదు. కావాలంటే మీరు శంకర విజయం చూసుకోండి. ఇవ్వాళ ఎలా జరిగిందో వైశాఖ శుక్లపంచమి రోజు అలాగే జరిగింది. శంకర భగవత్పాదులు జన్మించిన రోజు లోకమంతా ఆనందంతో పులకలెత్తిందిట. మహానుభావుడు జగద్గురువై జన్మించాడు. ఎంత గొప్ప స్థితిలో జన్మించాడంటే సూర్యుడు మేషరాశిలో ఉన్నాడు. అంగారకుడు మకర రాశిలో ఉన్నాడు. శని తులారాశిలో ఉన్నాడు. ఇటువంటి ఉచ్చస్థితిలో ఉండగా అన్ని గ్రహాలు తేజోవంతాలై ఉండగా చల్లటి గాలి వీస్తుండగా బ్రాహ్మణుడు అగ్నికార్యం చేస్తుంటే ఒకే సమయంలో యజ్ఞవేదికలలో ఉన్న అగ్నిహోత్రాలన్నీ ప్రదక్షిణంగా తిరిగాయిట. పుట్టినవాడు సాక్షాత్తు శంకరుడు. ఆయన శిరస్సునందు త్రిశూల ముద్ర, లలాటమునందు చంద్రవంక ముద్ర చేతులయందు డమరుక ముద్ర. ధనుస్సు ముద్ర, ఒక చేతిలో గదా ముద్ర. పాదాలయందు చామర ముద్ర, వక్షస్థలంపై శేషుని ముద్ర ఇటువంటి ముద్రలతో తేజోరాజి విభూషణుడై మహానుభావుడు బాలశంకరుడు జన్మించాడు. లోకమంతా పొంగిపోయింది. ఆ పిల్లవాడిని చూసుకుని అసలు ఆర్యాంబ ఆనందానికి అవధులు లేవు, ఇక శివగురువైతే 'స్నానము చేయగ రామిని, ఆనందరసాబ్ధిమగ్నుండై' అంటారు పోతనగారు భాగవతంలో. అలా ఆనందసాగరంలో మునిగిపోయాట్ట శివగురువు. చాలు నాజన్మ ధన్యమై

పోయింది ఇలాంటి కొడుకు జన్మించినందుకని. కోటి సూర్యులు ఏకకాలము నందు ప్రకాశిస్తే ఎలా ఉంటుందో అలాంటి స్థితిలో జన్మించారు. ఆ పిల్లవాడికి వేరొక నామం ఎందుకు పెట్టాలి? శంకరోతి ఇతి శంకరః ఇతః పూర్వం వంశం లేక కుమారులు లేక క్షోభిల్లుతున్న నాకు వంశమునిచ్చి శంకరోతి-శు భాన్ని చేసిన శంకరులు ఎవరున్నారో వారే నా కడుపున జన్మించారు. అందుకని శంకరా అని ఈ పిల్లవానికి నామకరణం చేస్తాను అన్నారు. ఆయనకు చూడా కర్మ జరిగింది.

ఆ పిల్లవాడు దినదిన ప్రవర్ధమానం అవుతున్నాడు. మహానుభావుడు ఆయనకి మూడవ సంవత్సరం వయస్సు వచ్చేసరికి ఉపనయనం చేయాలనుకున్నాడు శివగురువు ఆపిల్లవాడి తేజస్సు చూసి. శంకరాచార్యుల వారి గొప్పతనం ఏమిటో తెలుసాండీ? అందరికీ ఇంకా తాతా మామా అన్న మాటలు వచ్చేటప్పటికి శంకరాచార్యుల వారు ఏకసంథాగ్రాహి అయి ఎక్కడైనా ఒక పురాణం చదివితే అందులో ఉన్న శ్లోకాలన్నీ మళ్ళీ చెప్పేసేవారు. ఇట్లాంటి పిల్లవాడికి ఉపనయనం చేస్తే వేదం చదువుకోవడానికి అర్హత వస్తుంది. ఉపనయనం చేస్తే కానీ వేదం చదువుకోకూడదు. అందుకని మూడవయేట ఈ పిల్లవాడికి ఉపనయనం చేయాలి. చేసిన తర్వాత వీడు చిన్న పిల్లవాడు ఇంత తేజస్సుతో పిలక పెట్టుకుని, చక్కగా పంచె కట్టుకుని, యజ్ఞోపవీతం మూడు పోగులతో వేసుకుని వెళ్ళి వేదం చదువుకొని ఇంట్లో కూర్చుని స్వరం తప్పకుండా మంత్రాలు చదువుతుంటే అదివింటే నా జన్మ ధన్యమవుతుంది. ఎప్పుడు ఉపనయనం చేసేద్దామా అని కాసుక్కూర్చున్నాట్ట శివగురువు. ఆ మూడో ఏడు రాకముందే శివగురువు మరణించాడు. దానితో పాపం శంకరాచార్యులవారి జీవితంలో తండ్రి ప్రేమ కొరవడింది.

తల్లి ఆర్యాంబ మాత్రం కళ్ళలో పెట్టుకుని పెంచుకుంది ఆ కొడుకుని. శంకరాచార్యులవారి తల్లి గురించి చదివితే కన్నుల వెంబట నీరు రాని

వారుండరు. నిజంగా తల్లి పట్ల కొడుకు ఎలా ప్రవర్తించాలో నేర్పారు శంకరాచార్యుల వారు. ఇంకొంచెంసేపట్లో ఒక ఘట్టం వస్తుంది. ఆ ఘట్టంలో దీని గురించి చెప్తాను. ఆ తల్లి కొడుకుని అంత ప్రేమతో అంత అపురూపంగా పెంచి పెద్ద చేసుకుంటోంది. ఆ పిల్లవాడికి మూడో సంవత్సరంలో తండ్రిగారు మరణించిన తర్వాత మరి ఉపనయనం చేయకూడదు కదా! నాలుగవ సం॥లో చేయరు. అందుకని అయిదో సంవత్సరంలో ఉపనయనం చేసారు. గురువుగారి దగ్గరికి పంపించారు విద్యాభ్యాసం కోసమని. ఆ గురువు గారు ఒక్కసారి కూర్చుని స్వరంతో చెప్పేవారంతే వేదం. వెంటనే చెప్పేయడమే. మళ్ళీ పుస్తకం చదువుకోవడం ఏమీ ఉండేవికావు.

మీకొక ఆశ్చర్యకరమైన విషయం చెప్తాను. ఒక వేదాన్ని స్వరంతో మంత్రమునందు ఏవిధమైన దోషం లేకుండా తడబాటుపడకుండా రాత్రింబవళ్ళు సమర్థుడైన గురువు శుశ్రూషచేసి నేర్చుకుని పరమస మర్థుడనిపించుకోవాలంటే ఒక్క వేదానికి 48 సంవత్సరాలు పడుతుందిట. నాలుగు వేదాలు, వేద వేదాంగాలు ఉపనిషత్తులు బ్రహ్మసూత్రాలు, భాష్యాలు, తర్కాలు, ప్రకరణాలు, 18 పురాణాలు కర్మసిద్ధాంతం మీద ఉన్నటువంటి వ్యాఖ్యానాలతో సహా ఎనిమిదో ఏటకి శంకరాచార్యుల వారికి ధారణలోకి వచ్చేసాయి. ఎక్కడినుంచి ఏది అడిగినా అలవోకగా వారి నోటినుండి వచ్చేస్తుంది గంగాప్రవాహంలా. ఎనిమిదో యేడు వచ్చేటప్పటికి శంకరుల స్థితి అది. అయిదవ యేట ఉపనయనం చేసుకుని వచ్చాడు. ఇంకా ఈ మూడేళ్ళలో ముప్ఫై మంత్రాలు చదివిన శిష్యులున్నారు నాదగ్గర. మూడు సంవత్సరాలలో వీడు సకల విద్యాపారంగతుడు. ఇవాళ వీడితో మాట్లాడగలిగినవాడు లేడు. తర్కం చూపిస్తే ఒక ఉదాహరణ చూపిస్తే, ఒక విషయం మీద వాదిస్తే ఎంత పెద్ద గ్రంథంలోనుంచి ఏ శ్లోకాన్ని గురించి అడిగినా ఆయనకు ఆయనే సాటి. ఏమి ధారణా శక్తి నా శిష్యుడిది అని పొంగిపోతుండేవారుట గురువులు. అంతస్థితిని పొందినా శంకరాచార్యుల వారి వినయం చూడండి. ఒక శిష్యుడిగా

ఉన్నప్పుడు గురువు పిలిచి ఒక మాట చెప్పారు. అయ్యా నువ్వు వెళ్ళి మధుకరం అంటే భిక్షాటన చెయ్యాలి. భవతి భిక్షాం దేహి అని నిలబడతారు. బ్రహ్మచారీ సన్యాసీ వీళ్ళిద్దరే భిక్ష అడుగుతారు. ఆ భిక్ష పెట్టడం చాలా అదృష్టం. అందునా బ్రహ్మచారి ఇంటికి వచ్చి అడిగితే లేదని ఎవరూ అనరు. బ్రహ్మచారికి భిక్ష పెట్టడం అంటే సామాన్యమైన విషయం కాదు, బ్రహ్మచారి ఏ భోగాన్ని ఏ సుఖాన్ని కోరుకోడు. ఒకప్పుడు బ్రహ్మచారి అంటే తలకాయ దువ్వుకోకూడదు, గడ్డం చేసుకోవటం లాంటి ప్రక్రియలు ఉండనే ఉండవు. ఒక స్త్రీ ముఖాన్ని చూడనే చూడరు. ఎప్పుడూ ఒక పంచె కట్టుకుని వేదాధ్యయనంచేస్తూ గురువు గారికి శుశ్రూష చేస్తూ జీవనం గడుపుతుండేవారు. రాజుగారి కొడుకు అవ్వనివ్వండి. గురువుగారు భిక్ష చేసి భిక్షకి పంపి తీసుకు వచ్చిన పదార్థాలను శిష్యులందరికీ పంచి పెడితే అదే తినాలంతే. అంతే తప్ప నేను రాజుగారి కొడుకునండీ నేను తిననండీ అని చెప్పటం కుదరదు. అందరిదీ ఒకే స్థితి. శంకరులను పిలిచి ఒక రోజున గురువుగారన్నారూ నాయనా శంకరా నువ్వు నాలుగు ఇళ్ళ ముందుకు వెళ్ళి భిక్షాన్నం తీసుకురా అన్నారు. శంకరులతో పాటు శంకరుల స్నేహితులు కూడా బయలు దేరారు.

ఇది శంకరాచార్యుల వారి జీవితంలో ఒక మధురాతి మధురమైన ఘట్టం. ఒక పేద బ్రాహ్మణ స్త్రీ ఇంటి ముందుకు వెళ్ళి భవతి భిక్షాం దేహి, అన్నారు. శంకరాచార్యుల వారి జీవితంలో గమ్మత్తు ఏమిటో తెలుసాండి. సాధారణంగా సరస్వతీ, లక్ష్మీ ఏకకాలంలో ఒకే చోట దర్శనమిచ్చి ఒకేచోట నడయాడటం ఉండదు. శంకరభగవత్పాదులు జన్మిస్తుంటే దేవతలందరికీ ఆజ్ఞ వెళ్లింది. ఆది శంకరులు జన్మిస్తున్నారు. మీరందరూ కూడా మీ మీ అంశలతో జన్మించండన్నారు. అంటే శ్రీ మహావిష్ణువు పద్మపాదాచార్యుల వారిగా వచ్చారు. బ్రహ్మగారు మండనమిశ్రుడిగా వచ్చారు. వాయుదేవుడు హస్తామలకాచార్యులవారిగా వచ్చారు. పూర్ణాంశ తోటకాచార్యులవారిగా వచ్చారు. అదే రుద్రాక్షలు కట్టుకున్న కిరీటంతో శంకరాచార్యులవారి

పక్కనున్నారు పైనున్నారే వారే హస్తామలకాచార్యుల వారు, తోటకాచార్యుల వారు, పద్మపాదాచార్యులవారు ఆ నలుగురు శిష్యులతో శంకరభగవత్పాదుల వారుంటారు. దానిని వర్ణిస్తారు. శ్రీ మహావిష్ణువు యొక్క నాలుగు భుజాలని, అసలు ఆ హస్తామలకాచార్యుల వారంటే ఎవరో, పద్మపాదాచార్యుల వారంటే ఎవరో వారి జీవితాలు విన్న తర్వాత మీరు తదేక దృష్టితో వాళ్ళ వంక అలా చూస్తూ ఉండిపోతారంతే. చిత్రమేమిటంటే సరస్వతీ దేవి కూడా భూమిమీద జన్మించింది.

ఒకనాడు ఋషులందరూ బ్రహ్మగారి సభకి వెళ్ళారు. అక్కడికి వెళ్ళి బ్రహ్మగారి దగ్గర కూర్చుని స్వరం తప్పకుండా వేదం చెప్తే బ్రహ్మగారు శహబాష్ అన్నారనుకోండి ఋషులకు అదొక గొప్ప తృప్తి. అందుకని ఋషులందరూ వేదం చెప్తున్నారు. చెప్తుంటే బ్రహ్మగారు సంతోషిస్తున్నారు. దూర్వాసో మహర్షి కూడా వెళ్ళారు. వెళ్ళి ఆయన కూడా వేదం చెపుతున్నారు. కానీ ఆ వేదం చెప్పేటప్పుడు ఆయన మనస్సు పరాకు పడింది. దానితో వేదం స్వరం తప్పి పోయింది. వేదానికి స్వరం ప్రాణం. ఉదాత్త, అనుదాత్త, స్వరితములని స్వరాలుంటాయి. స్వరాన్ని బట్టే పలకాలి. ఎలా బడితే అలా పలకకూడదు. సంగీతం రేడియోలో నేర్చుకున్నానండీ అన్నట్టు పోస్టల్ ట్యూషను, కరస్పాండెంటు కోర్సులో వేదం నేర్చుకోరు. వేదం గురు ముఖతః. అందుకని దానికి శ్రుతి అని పేరు. విని నేర్చుకోవాలంతే స్వరాన్ని. స్వరం తప్పింది దూర్వాసో మహర్షిది. గమనించుకుని దిద్దుకుంటాడనుకుంది సరస్వతీదేవి. ఆమె అక్షర స్వరూపిణి. ఆయన దిద్దుకోలేదు. అలాగే తప్పు స్వరంతో చెప్పేస్తున్నారు.

దూర్వాసోమహర్షి ఈశ్వరాంశ సంభూతుడు. ఇంతగొప్ప వాడు స్వరం గుర్తించుకోకుండా అలాగే చెప్పేస్తున్నాడు వేదం. ఎంత ఆశ్చర్యకరమైన విషయం. పైగా ఎక్కడ? చతుర్ముఖ బ్రహ్మగారిముందు, సరస్వతీ దేవి ముందు. ఇలా చెప్పొచ్చా? అని సరస్వతి దేవి ఫక్కున నవ్వింది. నవ్వేటప్పటికి దూర్వాసో

మహర్షి చూసాడు. ఎందుకు నవ్వావన్నాడు. నువ్వు స్వరం తప్పావంది ఆవిడ. స్వరం తప్పితే నేను ఋషిని. ఒక ఋషి వేదం చెప్తున్నపుడు పొరపాటున స్వరం తప్పి ఉండవచ్చు. అంతమాత్రం చేత చదువులకు అధిదేవత వయిన నువ్వు నవ్వుతావా నన్ను చూచి నిన్ను శపిస్తాను. భూమిమీద జన్మించు అన్నాడు. అంటే ఆవిడ హడలిపోయింది. ఇదెక్కడ మహాప్రభో స్వరం తప్పావని నవ్వాను. నవ్వితే భూమిమీద పుట్టమంటావా నన్ను. బ్రహ్మగారిని విడిచిపెట్టి భూమిమీద కెళ్ళిపోవాలా అంది ఆవిడ. ఆ చుట్టూ ఉన్న ఋషులందరూ లేచారు. అయ్యయ్యో ఇది చాలా గొప్ప ఆగడం. ఏమిటి దూర్వాసో మహర్షి ఏకంగా సరస్వతీ దేవిని భూమిమీద జన్మించమన్నారు. వారు ఈ శాపానికి ఉపశాంతినివ్వండి అన్నారు.

సరస్వతీ దేవి కూడా ప్రార్థన చేసింది. మహాప్రభో నేను భూలోకంలో ఎలా ఉంటాను? నేను చతుర్ముఖ బ్రహ్మ యొక్క రాణిని ఇక్కడుండాలి కదా అని. అంటే 'దేవ్యో పక్కృచ్ఛతతః ద్విజసిద్ధి సత్యం' అని ఒకానొకనాడు 'వాతాధిపో భూతదప్రసన్నో' అంత సరస్వతీ దేవీ కూడా భూమిమీద పడి ప్రార్థిస్తే కొంచెం మనస్సు కరిగిందట దూర్వాసోమహర్షికి. 'సందర్శనాభవితాస్య మత్యా' అన్నారు. 'రాబోవు కాలంలో శంకరుడు ఆదిశంకరాచార్యులుగా భూమిమీద జన్మించినప్పుడు నీకు శంకరాచార్యుల వారి దర్శనం అవుతుంది. ఏనాడు శంకరాచార్యుల వారి దర్శనం అవుతుందో ఆనాడు శాపంనుంచి నీకు విముక్తి. నీవు మళ్ళీ బ్రహ్మలోకాన్ని చేరుకుంటావు. అప్పటి వరకు భూమిమీద ఉండవలసిందే' అన్నారు. అంటే బ్రహ్మగారన్నారు ఆవిడ అక్కడికెళ్లిపోతే నేనొక్కడిని ఇక్కడ కూర్చుని ఏం చేయను? నా శక్తి స్వరూపం సరస్వతి భూమిమీదకి వెళ్ళిపోయింది. నేనూ వెళ్ళిపోతాను అని మండనమిశ్రుడిగా ఆయన వచ్చేసారు. గమ్మత్తు ఏమిటో తెలుసాండీ.

మండనమిశ్రుడు శంకరాచార్యుల వారి చేతిలో ఓడిపోయి సన్యసించాడు. సన్యసిస్తే ఇంక భార్యేం చేస్తుంది. ఆవిడకేం సంసారమునందు వ్యామోహం

లేదు. భర్త సన్యసిస్తే ఇంట్లో ఎందుకీవిడ అందుకని ఈవిడ సరస్వతీ దేవి రూపాన్ని దాల్చి వెళ్ళిపోతోంది ఆకాశంలో. శంకరాచార్యుల వారు చూసారు. ఎక్కడికి వెళ్ళిపోతావు. బ్రహ్మలోకానికి వెళ్ళడానికి అంగీకరించను. నిన్ను కట్టేస్తున్నాను. వెళ్ళకుండా వనదుర్గామంత్రాలు వేస్తున్నానన్నారు. ఎక్కడ ఉందో తెలుసాండీ వనదుర్గ. జ్ఞాపకం తెచ్చుకోండి. ఎక్కడుంది? అన్నవరం దేవస్థానంలో ఉంది వనదుర్గా అమ్మవారు. వనదుర్గా హెూమమని మీరా మంత్రాలు వింటే అదిరిపోతారసలు. అలా ఉంటాయి ఆ మంత్రాలు. ఆ వనదుర్గా మంత్రాలచేత కట్టేసారు అమ్మవారిని. కట్టేస్తే ఆవిడ అంది. 'ఇదేమిటీ? ఆయన శపించాడు. నువ్వు కట్టేసావు. మరేంచేయాలి నేను' అంది. 'లోకాన్ని ఉద్ధరించటానికి నేను ఒక సమయంలో ప్రస్థాన త్రయానికి భాష్యమిచ్చి భూమండలమంతా తిరిగి మళ్ళీ వస్తాను. భారతదేశమంతా తిరిగి వచ్చిన తరువాత దక్షిణ భారతదేశంలో మొట్టమొదటి పీఠం పెడతాను. ఆ పీఠంలో పీఠాధిదేవతగా శారదగా నువ్వు కూర్చోవాలి. ఎవరు నీ దర్శనం చేస్తారో వారికి సరస్వతీ కటాక్షం రావాలి. అప్పటి వరకు నీవు వెళ్లడానికి వీళ్ళేద'న్నారు. ఆవిడలా ఉండిపోయిందంతే. అదీ శంకరాచార్యుల గొప్పంటే. అప్పుడు శృంగేరీ పీఠంలో శారదా పీఠం అందుకే. అక్కడ శారదాదేవిని పెట్టారు శంకరభగవత్పాదులు.

శంకరులు తమ శిష్యులతో కలిసి నాలుగిళ్ళ ముందుకు భిక్షకు వెళు తున్నారు. వెళుతూ వెళుతూ ఒక దరిద్ర బ్రాహ్మణి ఇంటి ముందుకు వెళ్ళారు. పాపం ఆవిడకేమీ లేదు. ఎంత దారుణమైన స్థితి అంటే వంటి మీద కట్టుకోవడానికి సరియైన వస్త్రంలేదు. తినడానికి తిండిలేదు. ఒకరికి దానమివ్వడానికి ఇంట్లో కనీసం ఉప్పు కూడాలేదు. అంత దరిద్రంలో ఉన్నటువంటి స్త్రీ. ఆవిడ ఇంటి ముందుకు శంకరాచార్యులవారు వెళ్ళారు. వెళ్ళి ఆయింటి ముందు నిలబడ్డారు. 'భవతి భిక్షాం దేహి', అన్నారు. ఎవరు నిలబడ్డారు ఆవిడ ఇంటి ముందు. సాక్షాత్తు శంకరులే వచ్చి నిలబడ్డారు.

ఆవిడ వెళ్ళి దానం చేసేటప్పుడు ఎందరికో చేస్తారు. పుచ్చుకునే వాడు నిరపేక్షగా ఏ కోర్కెలేని వాడు. మహోత్కృష్టమైన ఒక బ్రాహ్మణుని చేతిలో పడిందనుకోండి అది. ఒక బ్రహ్మచారి చేతిలో పడిందనుకోండి దానివల్ల మీ జీవితం ధన్యమైపోతుంది. అన్ని వేళలా పుచ్చుకోవడానికి మీకటువంటి పాత్రత ఉన్నవాళ్ళు దొరకరు. శంకరులొచ్చారు ఎదురుగుండా. వచ్చి నిలబడి 'భవతీ భిక్షాందేహి' అన్నారు. భిక్షాపాత్ర పట్టుకుని మళ్ళీ వస్తాడా ఇలాంటి బ్రహ్మచారి? రాడు. ఈశ్వరానుగ్రహం నీ ఇంటి కొచ్చాడు ఇవాళ. భిక్ష పెట్టుదామంటే ఇంట్లో ఏమీ లేవు. బ్రహ్మచారి నిలబడ్డాడు. రెండు మాట్లు అడుగుతాడు. మూడు మాట్లు అడుగుతాడు. అంతకన్నా ఎక్కువసేపు నిలబడిపోతే గోమోదిత దోషం వస్తుంది. ఆవును కట్టి కొట్టిన దోషం వస్తుంది. ఎక్కువసేపు నిలబడితే వెళ్లిపోతోంది అవకాశం. ఏదైనా తీసుకొచ్చి వేద్దామని పాపం ఇళ్ళంతా పరిగెత్తింది. ఇల్లు మొత్తం మీద ఎక్కడా ఏదీ లేదు. ఆవిడ లుబ్ధురాలు కాదు. ఇద్దామంటే పాపం ఏమీ లేదు.

ఈ స్థితిలో ఆవిడ కన్నుల వెంబడి నీరు కారుస్తూ ఏడుస్తూ వచ్చి కనీసం ఈ మాట చెప్పేద్దామనుకుంది. నా కర్మయ్యా, నాయనా శంకరా నీవంటి వాడు ఇంటి ముందుకొచ్చి 'భవతి భిక్షాందేహి' అన్నాడు. నీ చేతిలో వేయటానికి నా దగ్గర ఏమీ లేదు. నేను ఏమి ఇవ్వను. ఇవ్వాలనిఉంది. కానీ ఇవ్వటానికి ఏమీ లేదు. నా కర్మ ఇలా ఉంది అంది ఆవిడ. అంటే శంకరులన్నారు. ఇదీ దయ అంటే. గురువుల గొప్పతనం ఎక్కడుంటుంది. గురువుల అనుగ్రహం, గురువుల ఆశీర్వచనం చాలు. వాళ్ళు ఏమీ చేయక్కరలేదు. వాళ్ళు మనసులో నీగురించి ఒక మంచి సంకల్పం చేసారా? వృద్ధిలోకి వస్తావు. గురువు మనసు ఖేదపడిందా? బాధపడ్డాడా? నన్నింతపని చేసాడని అనుకున్నాడా? రౌరవాది నరకాలకు వెళ్ళిపోతావు. గురువుతో అంత జాగ్రత్తగా ఉండాలి. 'బ్రహ్మస్థానే కృతం పాపం, విష్ణుస్థానే విముచ్యతి, విష్ణుస్థానే కృతం పాపం. శివస్థానే విముచ్యతి, శివస్థానే కృతం పాపం, గురుస్థానే విముచ్యతి,' ఇంక తర్వాత

లేదు. బ్రహ్మగారి దగ్గర తప్పు చేస్తే విష్ణువు దగ్గరకి వెళ్ళి ప్రార్థన చేస్తే పోతుంది. విష్ణువు దగ్గర తప్పు చేస్తే శివుడి దగ్గరికి వెళ్ళి ప్రార్థన చేస్తే పోతుంది. శివుడి దగ్గర తప్పు చేస్తే గురువు దగ్గరకి వెళ్ళి ప్రార్థన చేస్తే పోతుంది. గురువు దగ్గర అసలు చెప్పలేదింక. అంటే నువ్వు తప్పు చేయనేకూడదు. అటువంటి వాడు 'గుకారస్య అంధకారస్యో, రుకారస్య నిరోధికృత్, అంధకార వినాశిత్వా గురురిత్య భిధేయతే.' ఆ గురువుకు నీవు ఏమిస్తావు. ఆయనేమీ నీ దగ్గర పుచ్చుకోవడానికి తిరిగే మనిషికాదు. ఆయనయందు నువ్వు గౌరవంగా ప్రవర్తించాలి. ఆ ప్రవర్తనలో తేడా వస్తే మాత్రం వాడి మనస్సు ఖేదపడుతుంది. వాడి మనస్సు ఖేద పడితే మాత్రం ఈశ్వరుడు అంగీకరించడు. అంతే. అందుకని నేనేమి ఇవ్వగలనని ఏడ్చింది ఆవిడ.

గురువులు సంకల్పం చేస్తే చాలు. ఆయన చూసారు. అయ్యయ్యో ఎంత దరిద్రం అనుభవిస్తోందయ్యా? ఈ బ్రాహ్మణి. పాపం తినడానికి లేదు. నాకు దానమివ్వడానికి లేదు. ఇద్దామని ఉంది. ఇవ్వలేకపోతోంది. ఎవరివ్వాలి ఇప్పుడు? లక్ష్మీదేవి ఇవ్వాలి. ఆవిడి అనుగ్రహం కలగాలి. అప్పుడు చేసారు కనకధారా స్తోత్రం లక్ష్మీదేవిని ఉద్దేశించి. అమ్మా! కరుణించమ్మా! అన్నారు. ఆయనకా? బ్రాహ్మణికా? ఆయనకోసం కాదు. తనకోసం కోరుకున్నవాడు గురువు కాదు. లోకం కోసం శిష్యులకోసం అడిగినవాడు గురువు. గురువు మేఘంలాంటివాడు. తనకోసం పాకులాడితే గురువెందుకు అవుతాడు. నీళ్ళు తాను దాచుకుంటే మేఘం ఎందుకవుతుంది. వర్షిస్తే మేఘం అవుతుంది. తేలికపడి వెళ్ళిపోతే మేఘం అవుతుంది. కృతజ్ఞత అడగకపోతే మేఘం అవుతుంది. నువ్వు థాంక్స్ చెప్పలేదేం అని పట్టించుకోకుండా నవ్వుతూ వెళ్ళిపోతే మేఘం అవుతుంది.

ఏమండీ నాకది చేయ్యలేదండి, నాకిది చేయ్యలేదండి అన్నవాడు గురువా? వాడు గురువు కాలేదు. ఇది శాస్త్రం చెప్పింది. ఇది గురువుల స్థితి

ఏమిటో జగద్గురువులంటే ఎలా ఉంటారో శంకరాచార్యులవారు బాల్యంలో నిరూపించారు. తన గురించి స్తోత్రం చేయలేదు. మరి ఎవరిగురించి చేసారు? దరిద్ర బ్రాహ్మణి గురించి స్తోత్రం చేసారు.

మీరు చాలా జాగ్రత్తగా గుర్తు పెట్టుకోండి. లోకమంతటికీ శంకర భగవత్పాదులు ఐశ్వర్యానికి హేతువుగా ఇచ్చిన స్తోత్రం ఆ స్తోత్రం. దానిమీద శంకరుల ముద్ర ఉంది. వెనకాతల లక్ష్మీనారాయణుల ముద్ర ఉంది. ఎందుకని? **'అంగీకృతా ఖిల విభూతి రపాంగలీలా మాంగల్యదాస్తు మమ మంగళ దేవాతాయాః'** అన్నారు. నారాయణుని వంక ప్రసన్నమైన చూపులు చూస్తుంటే పులకరించిపోతున్న శ్రీ మహావిష్ణువు వారిని వర్ణించారు అందులో. ఆ ప్రసన్నత కలిగిన చూపులు మాయందు అనుగ్రహింపబడుగాక అని అడిగారు. ఆ స్తోత్రాన్ని భద్రంగా పెట్టుకోండి. మీ దేవతాపుస్తకాలలో దాన్ని జాగ్రత్తగా పెట్టుకోండి. మీ పూజా మందిరం పుస్తకాలలో పెట్టుకోండి. చదువుకోండి చక్కగాను. ఇప్పుడు ఈ శంకరాచార్యుల వారుచేసిన స్తోత్రాన్ని ఒక్కసారి మనందరం కలిసి చదువుదాం.

**వందే వందారు మందార**
**మిందిరానంద కందలమ్**
**అమందానంద సందోహ**
**బంధురం సింధురాననం॥**

ఇక్కడనుంచి అది గణపతి ప్రార్థన. ఇంక ఇక్కడినుంచి అమ్మవారి నుద్దేశించి శంకరభగవత్పాదులు స్తోత్రం చేస్తున్నారు. నిజంగా బాల శంకరులు ఎన్నేళ్ళండీ? ఎనిమిదేళ్ళు లక్ష్మీదేవినుద్దేశించి ఆయన చేసిన స్తోత్రం చూడండి. దానికి వచ్చిన ఫలితమేమిటో ఇదయిపోయాక చెప్తాను.

**అంగం హరేః పులకభూషణ మాశ్రయన్తీ ।**
**భృంగాంగనేవ ముకుళాభరణం తమాలమ్ ।**

**అంగీకృతాఖిల విభూతి రపాంగ లీలా**

**మాంగల్యదాఽస్తు మమ మంగళదేవతాయాః ॥**

మన పాపరాశి దగ్ధమైపోవటానికి ఈ శ్లోకం చాలదుటండీ.అందుకే రేపటినుంచి ప్రారంభంలో ఈ ప్రార్థనచేసి అప్పుడు చదువుదాం. అమ్మవారి దేవాలయం కదా! అమ్మవారు విని పొంగిపోతుంది శంకరాచార్య స్తోత్రం. నా పిల్లలు ఇంతమంది కలిసి చదువుతున్నారు. దేవాలయంలో ఒకమారు చదివితే పదివేల మార్లు చదివినట్టు. అలాంటిది ఈ ఐదారు రోజులు మనం చదివితే లక్షమార్లు కనకధారా స్తోత్రం చేసిన ఫలితం వచ్చేస్తుంది. ఎవరి కష్టాలు ఎందుకు తీరవు? అందుకని అందరం ప్రతిరోజూ ప్రారంభంలో ఈ స్తోత్రం చేస్తుందాం.

**ఇష్టా విశిష్ట మతయోఽపియయా దయార్ద్ర దృష్ట్యా**

ఏమి శ్లోకాలండీ శ్రీ సూక్తంలో **'దివ్యైర్గజేంద్రై మణిగణఖచితైః స్నాపితాహేమ కుంభైః నిత్యం సా పద్మహస్తా మమవసతు గృహే సర్వ మాంగల్యయుక్తా॥'** అని ఒక మంత్రం. శంకరులు దాన్ని ఎలా చెప్పారో చూడండి.**'దిగ్ఘస్తిభిః కనకకుంభ ముఖావసృష్ట సర్వాహినీ విమలచారు జలప్లుతాంగీమ్'**. ఈ భూమండలాన్నంతటినీ పాతాళలోకంలో సార్వభౌమం. భద్రం మొదలైన పేర్లు కలిగిన నాలుగు ఏనుగులు మోస్తుంటాయి. ఆ నాలుగు ఏనుగులుట తెల్లవారుజామున ఆకాశగంగలో నీళ్ళు బంగారు కలశాలతో పట్టాయిట. పట్టీ తెల్లని వస్త్రం కట్టుకుని పద్మాసనం వేసుకుని పద్మంలో కూర్చుందిట లక్ష్మీదేవి. అమ్మా ఆ నాలుగు ఏనుగులు **'కనకకుంభ ముఖావ సృష్ట'** ఆ బంగారు కలశాలతో ఆకాశ గంగ నీటిని నీ మీద పోస్తున్నాయి. **'స్వర్వాహినీ విమలచారు జల ప్లుతాంగీమ్'** ఆకాశగంగ నీటిచేత అభిషిక్తమై తడిసిన బట్టలతో సంతోషంగా పిల్లల వంక చూస్తూ కూర్చుని ఉన్నావు. **'ప్రాతర్నమామి జగతాం జననీమశేష'** అమ్మా పొద్దున్నే అటువంటి తల్లికి

నమస్కారం చేస్తున్నాను. **'లోకాధినాథ గృహిణీమ అమృతాబ్ధిపుత్రీమ్.'** నువ్వు ఎవరివి? లోకాధినాథుడైన మా శ్రీమన్నారాయణుడి ఇల్లాలివి. అమ్మా నువ్వు అమృతాబ్ధి పుత్రీం-క్షీరసాగరుని పుత్రికవి మాకు అమ్మవి. ఇలా చదివితే ఎందుకు లక్ష్మీ కటాక్షం రాదు. ఎందుకు కష్టాలు పోవు. శంకరులు ఈ జాతికి ఇచ్చిన అమృతపు గుళిక ఈ స్తోత్రం. ఇటువంటి స్తోత్రాలు ఉండి చదువుకోకపోతే మనదా తప్పు. జగద్గురువులదా తప్పు. ఈస్తోత్రాలు మనం చదువుకోవాలి ప్రతిరోజూ. కనీసం ప్రతిష్ఠ కార్యక్రమం అయిపోయే వరకు అమ్మవారి గుడికనుక ప్రతిరోజూ నా ప్రార్థనా శ్లోకాల తరువాత మనం ఈ ఉపన్యాసాలు అయిపోయేవరకు కనకధారా స్తోత్రాన్ని చేద్దాం. అమ్మవారి అనుగ్రహాన్ని మనందరం పొందుదాం.

**కమలే కమలాక్ష వల్లభే త్వం**

శంకరాచార్యులవారు ఒక దరిద్ర బ్రాహ్మణి ఇంటిముందు నిలబడి ఈ కనకధారా స్తోత్రాన్ని చేసారు. అమ్మవారిని ఉద్దేశించి చేస్తే అమ్మ ప్రసన్నురాలై శంకరాచార్యుల వారి ఎదురుకుండా ప్రత్యక్షమైపోయింది. ప్రత్యక్షమైపోయి 'శంకరా. ఏమి స్తోత్రం చేసావోయి? చాలా ప్రీతి పొందాను. ఏమి చేయమంటావు నన్ను' అని అడిగింది. అంటే శంకరులన్నారు. అమ్మా నాకేం అక్కరలేదమ్మా. చూసావా దరిద్ర బ్రాహ్మణి ఏంత బాధ పడుతోందో? ఏదైనా కొద్దిగా సానుకూల్యం వహించి ఆవిడకి సంపద కలిగేటట్టు అనుగ్రహించమ్మా అన్నాడు.

అమ్మ అంది శంకరా నువ్వు స్తోత్రం చేసావు పరమప్రీతిని పొందాను. నీకు సాక్షాత్కరించాను. ఆవిడకి ఏదైనా చేయాలని నాకు అనిపిస్తోంది నీ స్తోత్రం విని కానీ ఏదైనా చేద్దామంటే గత జన్మలలో ఆవిడ ఇలా పెట్టినది లేదు. పుణ్యంలేదు ఖాతాలో ఉన్నది పాపమే. కాబట్టి దరిద్రమే అనుభవిస్తోంది. ఇలా పెట్టినది లేనప్పుడు ఎకౌంటులో డబ్బులేనప్పుడు విత్‌డ్రాయల్ ఫారం

మీద డబ్బులు ఎలా ఇస్తాం. పుణ్యంలేదు ఏమి ఇవ్వనయ్యా శంకరా? ఇంత పుణ్యం చేసి చూపించమను ఇస్తాను. శంకరులన్నారు అమ్మా బ్రాహ్మణీ నీ ఖాతాలో పుణ్యం లేదమ్మా ఇల్లంతా వెతుకు అదిగో ఆ గూట్లో ఎండిపోయిన ఉసిరికాయ ఉంది. ఆ ఉసిరికాయ తెచ్చి నా చేతిలో పారేయి. ఇలా ఉంది శంకరాచార్యుల వారి చెయ్యి. అదేమన్నా మామూలు చెయ్యా శంకర భగవత్పాదుల చెయ్యిఅది. **'కారుణ్యామృతవర్షిణంఘనవిపత్...మిచ్ఛాకృతిన్'.** శంకరభగవత్పాదులు శివానందలహరి లోనే స్తోత్రం చేస్తారు. ఉసిరికాయ ఇలాపడిందంతే. పడిందెవరి చేతిలో మామూలువాడి చేతిలోకాదు. శంకర భగవత్పాదుల చేతిలో పడిందా ఉసిరికాయ. అపారమైన పుణ్యం.

శంకరా నువ్వు చేసిన స్తోత్రానికి ఈవిడ నీకు ఒక ఎండు ఉసిరికాయ ఇచ్చినందుకు. బంగారు ఉసిరికలు ఈవిడ ఇంటి ప్రాంగణమంతా వర్షిం చేస్తున్నానంది. అంతే బంగారు ఉసిరికలు వర్షించాయి వాళ్ళ ఇంట్లో. దరిద్ర బ్రాహ్మణి ఐశ్వర్యంతో తులతూగిపోయింది. అంతగొప్ప స్తోత్రం ఆ స్తోత్రం. సరే. ఆ స్తోత్రం భావమేమి? సంగ్రహంగా. అమ్మవారు ప్రసన్నమూర్తియై శ్రీ మహావిష్ణువు వంక చూస్తుండగా ఇద్దరూ పరమానందాన్ని పొందుతున్న టువంటి స్వరూపాన్ని స్తోత్రం చేసారు.

తరువాత ఒకనాడు తల్లి ఆర్యాంబ ఆ పక్కనే ఉన్నటువంటి పూర్ణానదికి స్నానానికి వెళ్ళింది. అప్పటికి తల్లిగారు పెద్దవారయిపోయారు. భర్త వెళ్ళిపోయారు. భర్త వెళ్ళిపోతే పూర్వ స్త్రీకి చాలా నియమాలుండేవి. శరీరమంతా కూడా వృద్ధురాలైపోయిన స్త్రీ ఎలా అయిపోతుందో అంతగా శుష్కించిపోయింది పాపం ఆవిడ శరీరం. వెళ్ళి పూర్ణానదిలో స్నానం చేసి ఇంటికొస్తున్నారు ఆవిడ. వస్తుంటే ఆ ఎండకి తాళలేకపోయారు. నడిచి రాలేక స్పృహతప్పి పడిపోయారు. అక్కడ ఉన్న పిల్లలు పరిగెత్తుకుంటూ వచ్చి శంకరాచార్యులవారికి చెప్పారు. అప్పటికి బాలశంకరులాయన. 'అయ్యా! శంకరా మీ అమ్మ పూర్ణానదిలో స్నానంచేసి వస్తూ వస్తూ ఎండకి తట్టుకోలేక శోషవచ్చి

పడిపోయింద'ని చెప్పారు. శంకరభగవత్పాదులు పరుగు పరుగున వెళ్ళి అమ్మను తీసుకువచ్చి పడుకోబెట్టి, పెద్ద తామరాకు కోసి చల్లటి నీటిలో ముంచి అమ్మ సేదతీరేదాకా విసిరారట. ఇంకా అమ్మ జన్మ భాగ్యమే భాగ్యం. విసిరితే ఆ చల్లటి గాలికి ఆమెకి స్పృహ వచ్చిందట. అమ్మ పాదాలు పట్టి 'అమ్మా నేను కొడుకునుండగా పూర్ణానది స్నానానికి అంతదూరం వెళ్లావా? నడవలేక మధ్యలో పడిపోయావా? నేను కొడుకునుండి నీకు చేయగల ఉపకారం ఏమిటమ్మా? రేపటినుంచి నువ్వు ఎండలో పూర్ణానది స్నానానికి వెళ్లక్కరలేదు. రేపటినుంచి మన కుటీరం ముందునుంచి పూర్ణానది ప్రవహిస్తుంది. నేను అలా చేస్తాను' అన్నాడు. అని గంగాస్తవంచేసాడు మహానుభావుడాయన చేయని స్తోత్రమేమున్నదండీ. అసుర సంధ్యవేళలో పూర్ణానది ఒడ్డున నిలబడి గంగాస్తవం చేసారు. 'నాయందు ఆనుకూల్యం వహించి మా అమ్మ స్నానం చేయటానికి వీలుగా మా కుటీరం ముందునుంచి పూర్ణానది ప్రవహించుగాక' అని సంకల్పం చేసారంతే. పూర్ణానది తన దిశను మార్చుకుని వాళ్ళ కుటీరం ముందునుంచి ప్రవహించింది. అక్కడకొచ్చేటప్పటికి చల్లని గాలులు తామరపూలమీదనుంచి కుటీరంలోకి వెళ్లాయి. అమ్మ వాటిని పీల్చి నాకొడుకే కొడుకని పొంగిపోయింది.

ప్రతిరోజూ హాయిగా రెండు మెట్లు దిగి పూర్ణానదిలో స్నానంచేసి శంకరా నాకు ఏ బాధా లేదురా హాయిగా ఉన్నానని పొంగిపోయేదిట అమ్మ. ఆయనే గంగాధరుడు ఆయన మాట వినదూ. అంత స్తోత్రం చేసి పూర్ణానదిని దారి మళ్ళించారు శంకరభగవత్పాదులు.

ఇలా కొంతకాలం. గడిచిన తరువాత ఒక రోజు చాలా వృద్ధులు అపారమైన తేజస్సంపన్నులు, ఒక్కొక్కరిని చూస్తే కోటి సూర్యులు ఒక్కసారి ప్రకాశిస్తున్నారా అన్నంత తపస్వులు ఆరుగురు వాళ్ళ కుటీరానికి విచ్చేసారు. వాళ్ళ తేజస్సు చూడగానే ఆర్యాంబ ఆశ్చర్యపోయింది. వారికి అతిథి మర్యాదలు చేసి నవర్యలుచేసి అయ్యా మీరెవరు అని ప్రశ్న వేసారు. ఆ వచ్చిన వాళ్ళు అన్నారు. అమ్మా. నేను గౌతమ మహర్షిని అన్నారు. గౌతమ

మహర్షి ఒకరింటికి రావడమంటే మీరాలోచించండి, ఎలా ఉంటుందో. రెండవ వారిని చూచి ఆర్యాంబ అడిగింది. అయ్యా! మీరెవరండీ అని అమ్మా నేను అగస్త్య మహర్షిని అన్నారు. మూడవ వారిని అయ్యా మీరెవరు అంది. నేను అత్రి మహర్షిని అన్నారు. అలా మహర్షులందరూ బయలుదేరి శంకరుల కుటీరానికి వచ్చారు. ఆర్యాంబ మధుపర్కం ఇచ్చింది. మధుపర్కమంటే తేనె ఇవ్వడం. తేనెని ఆ వచ్చిన ఋషులందరూ గ్రహించారు. వాళ్ళందరూ అరుగులమీద కూర్చున్నారు.

ఎటువంటి వాళ్ళు. అగస్త్యుడంటే సముద్రాన్ని ఆపోసన పట్టిన మహానుభావుడు. వింధ్యపర్వతాన్ని తల పైకెత్తకుండా చేసినవాడు. భూ భారాన్ని రెండువైపులా సమానంగా చెయ్యగలిగినవాడు. అటువంటి అగస్త్య మహర్షి, గౌతమ మహర్షి, అత్రి మహర్షి మొదలైన వారు ఓ పక్క అరుగుమీద కూర్చున్నారు. ఓపక్క అరుగుమీద బాలశంకరుడు కూర్చున్నాడు. అతనికి ఇంకా ఎనిమిదో ఏడు నడుస్తోంది. ఈ మహర్షులందరూ తన పిల్లవాడితో సంస్కృతంలో శాస్త్ర చర్చ చేస్తున్నారు. వాళ్ళందరూ ఎక్కడెక్కడి విషయాలో అడుగుతున్నారు. ఫలానా భాష్యంలో ఆ సూత్రానికి అర్థం ఏమిటి? ఫలానా బ్రహ్మసూత్రానికి వ్యాఖ్యానం అసలు ఖచ్చితంగా ఏమొస్తుంది అని అడుగుతుంటే ఆ తల్లి–పిచ్చితల్లి ఆర్యాంబ ఆశ్చర్యపోయి ముక్కున వేలేసుకుని చూస్తోంది. మా అబ్బాయికి ఎనిమిదేళ్ళా ఇంత మంది ఋషులు వచ్చి కూర్చుని ప్రశ్న వేస్తున్నారా? అలవోకగా తడుముకోకుండా మావాడు భాష్యాలు చెప్పేస్తున్నాడా? వాళ్ళందరూ సంతోషపడిపోయి ఆహాహా ఏమి చెప్పావయ్యా ఏమి చెప్పావయ్యా అని వాళ్ళందరూ తెలుసుకుంటున్నారా? ఎక్కడినుం చొచ్చింది నా కొడుక్కి ఈ జ్ఞానం అని తెల్లబోయి ఆవిడే వాళ్ళనడిగింది. ఇన్ని చెప్పిన వాడు సాక్షాత్తు శంకరుడని వచ్చినటువంటి ఋషులకు తెలుసు. కృష్ణ పరమాత్మ దేవకీదేవి గర్భంలో ఉండగా దేవతలందరూ వెళ్లి స్తోత్రం చేయలా? అలా బాల శంకరుడి దర్శనానికి ఋషులొచ్చారు. వాళ్ళతో శంకరుడు మాట్లాడాడు. కానీ నేను

శంకరుడిని అన్న భావనతో మాట్లాడలేదు. బాల శంకరుడు వాళ్ళందరికీ భూమిమీద పడి నమస్కారం చేసాట్ట.

బ్రహ్మచారి ఇంటికి పెద్దలొస్తే ఎలా ప్రవర్తించాలో శంకర విజయాలు చూస్తే మనకు అర్థమవుతుంది. భూమిమీద పడి ప్రవర చెప్పి కాళ్ళకి నమస్కారంచేసి వాళ్ళతో శాస్త్ర చర్చ చేస్తే నిజంగా ఆర్యాంబ జన్మే జన్మ. ఎంత సంతోషంగా ఉంటుంది. ఎనిమిదేళ్ళ కొడుకుతో అంతమంది ఋషులు చర్చ చేయటమా? ఆవిడ వెళ్ళి అడిగింది. అయ్యా నాకు చాలా ఆశ్చర్యంగా ఉందండి. నా కొడుకు వీడికి ఎనిమిదేళ్ళా? మీరుచూస్తే ఇంతగొప్ప ఋషులా? నాకొడుకుతో మీరందరూ శాస్త్ర చర్చా? వీడేమో సిద్ధాంతం చేసి చెప్పటమా? మీ అందరూ విని అబ్బాయి ఎంత గొప్ప విషయాలు చెప్తున్నాడని పరవశించిపోవడమా? నాకు ఇంత గొప్ప కుమారుడు ఎలా జన్మించాడు అని అడిగింది.

అప్పుడు అగస్త్య మహర్షి చెప్పారు. అమ్మా నీకు ఇటువంటి కుమారుడు ఎందుకు జన్మించాడో తెలుసా? నీ భర్త అయిన శివ గురువు కుమారులు లేకపోతే వృషాచలేశ్వరుని ఉద్దేశించి తపస్సుచేసాడు. ఆయన చేసిన ఈశ్వరారాధనికి కైలాస శంకరుడు కుమారుడిగా వచ్చాడు. కానీ నీభర్తకి వరమిచ్చినప్పుడు పరమశివుడు ఒకమాట చెప్పాడు ఏమని? 'భూర్యాధిరస్తు తదగుణా............ గుణోపపన్నం'. అల్పాయుర్దాయం కలిగిన కుమారుడే జన్మిస్తాడు. ఎందుకని? లోకమునకంతటికి జ్ఞానబోధ చేసే జగద్గురువు కనుక అటువంటి వాడికి తక్కువ ఆయుర్దాయమే ఇస్తానన్నారు స్వామి. ఒప్పుకున్నారు శివగురువు.

అందుకని నీ కుమారుడు స్వల్ప ఆయుర్దాయం ఉన్నవాడు అన్నారు. ఆ తల్లి అడిగింది అంటే నాకుమారుడు ఎన్నేళ్ళు జీవిస్తాడు అనడిగింది. అంటే అగస్త్య మహర్షి అన్నారు. ఎనిమిదేళ్ళు బతుకుతాడమ్మా అన్నాడు. ఆ

తల్లి గుండెలు కడుపులోకి జారిపోయాయి. ఎందుకని? అప్పుడు ఎనిమిదో ఏడు నడుస్తోంది శంకరాచార్యుల వారికి. ఎనిమిదేళ్ళా నాకొడుకు జీవించేది అని అడిగింది? కాదమ్మా ఎనిమిదికి ఎనిమిది కలుపుకో పదహారు సంవత్సరాలు జీవిస్తాడు. ఎనిమిది పక్కన ఎనిమిది వేసుకో పదహారని అనుకోకు. నేను చెప్పినట్టే జరుగుతుంది గుర్తుపెట్టుకో ఎనిమిదేళ్ళు ఒకలా బ్రతుకుతాడు. ప్రక్కన ఎనిమిది కలుస్తుంది ఇంకొకలా బ్రతుకుతాడు. ఇంకొక పదహారు కలుస్తుంది. ఇంకొకలా బ్రతుకుతాడు. కానీ ముప్ఫైరెండు దాటి ఉండడు. ముప్ఫై రెండుకి తిరిగి వెళ్ళిపోతాడు. అని చెప్తుంటే మిగిలిన ఋషులు గబగబ అడ్డొచ్చారు. అగస్త్య మహర్షి ఏమిటి అంత వివరంగా చెప్పేస్తున్నారు. చెప్పకండి. చెప్పకండి అన్నారు. ఎందుకని? అది శంకరుల అవతార రహస్యం. అందుకని అంత వివరంగా చెప్పకూడదు. తల్లికి చెపితే బెంగపెట్టుకుంటుంది. అందుకని చెప్పవద్దన్నారు. అంటే అగస్త్య మహాముని ఆపుచేసారు. అమ్మా మేము సెలవు పుచ్చుకుంంటున్నామని ఆ ఋషులు వెళ్ళిపోయారు.

పాపం ఆవిడ కంటికి మంటికి ఏకధారగా ఏడ్చింది. కట్టుకున్న భర్త కొడుకుకి ఉపనయనం చేయకుండానే వెళ్ళిపోయాడు. కడుపున పుట్టిన కుమారుడు మహాజ్ఞాని జన్మించాడని సంతోషించాను. కానీ నా దురదృష్టం వీడు అల్పాయుష్కుడు. వీడు ముప్ఫై రెండు సంవత్సరాలకు వెళ్ళిపోతాడు అంటున్నారు. అందుకని 'నాయనా శంకరా నేనొక కోరిక కోరుతాను. ఎవరయినా పితృఋణం ప్రధానంగా తీర్చుకోవాలి. నీ తండ్రి తపస్సు చేసి నిన్ను కన్నారు. నువ్వు కూడా ఎనిమిది సంవత్సరాల వరకు మాత్రమే అన్యమైన విషయాల మీద ధ్యాస ఉండదు. ఎనిమిది దాటితే వాడికి అన్య విషయాల మీద దృష్టి ఏర్పడుతుంది. నీకు ఎనిమిదవ సంవత్సరం నడుస్తోంది కనుక నీకు యోగ్యమైన వధూమణిని చూస్తాను. నువ్వు వివాహం చేసుకుని కుమారుడిని కను. అప్పుడు కనీసం వంశం ఇక్కడితో ఆగిపోకుండా ఉంటుంది. నీ పితృఋణం తీర్చుకున్నవాడివి అవుతావు.' అంటే శంకరులన్నారు 'అమ్మా!

ఏక్షణంలో ఈ శరీరం వెళ్ళిపోతుందో ఎవరికీ తెలియదు. నాకన్నీ తెలుసు నాకన్నీ తెలునంటాడు. ఇదెప్పుడెళ్ళిపోతుందో ఎవడికీ తెలియదు. వెళ్ళిపోతుందని తెలియనివాడు భ్రాంతిలో బ్రతుకుతున్నాడు. ముప్పైరెండుకి వెళ్ళిపోతుందని నాకు తెలుసు. ఎందుకమ్మా నేను స్త్రీని వివాహం చేసుకోవడం, ఎందుకు నాకా లంపటం. ఎన్ని జన్మలయ్యాయో. నన్ను వివాహం చేసుకోమంటున్నావు. కోడల్ని తీసుకురమ్మంటున్నావు. అమ్మా! నీకు ఇత పూర్వం జన్మలు లేవా? ఎంతమంది కొడుకులయ్యారో? ఎంతమంది కోడళ్ళయ్యారో? ఎందరు కూతుళ్ళో, ఎంతమంది అల్లుళ్ళో ఒక్కసారి ఊపిరి వెళ్ళిపోయిందా? ఎక్కడిక్కెడినుంచి కొడుకులు రానివ్వండి, కోడళ్ళు రానివ్వండి, కూతుళ్ళు రానివ్వండి అల్లుళ్ళు రానివ్వండి? ఎంత ఏడవనివ్వండి? ఎంత మొత్తుకోనివ్వండి ఆ జీవి అలా కన్నువిప్పి కూడా చూడదు. ఒక జడము ఒక రాయి ఎలా బిగుసుకుంటుందో ఇవతల వైపునుంచి ఎత్తితే అవతల వైపు కూడా కదులుతుందో అంత చిత్రంగా ఊపిరి వెళ్ళిపోయిన గంటకి పాదాలు పట్టుకుని పైకెత్తితే కట్టె లేచినట్టు లేస్తుంది. అలా బిగుసుకుపోయే స్వభావమున్న ఈ శరీరానికి మళ్ళీ వివాహమా? దీనికోభార్యా? దీనికి బిడ్డలా ఎవర్నుద్ధరించటానికమ్మా? ఎందుకొచ్చిన లంపటమమ్మా? నా మనసుకి సన్యాసం స్వీకరించి మళ్ళీ నేను జన్మ ఎత్తవలసిన అవసరం లేకుండా ఈ జన్మలోనే నేను తరించి నన్ను కన్నవాళ్ళను తరింపచేయాలని ఉంది. అందుచేత అమ్మా సన్యసించటానికి నాకు అనుమతి కటాక్షించు' అన్నారు.

ఎందుచేత అంటే తల్లిగారి అనుమతి లేకుండా సన్యసించడానికి వీలులేదు. శాస్త్రం కొన్ని కొన్ని పద్ధతులను పెట్టింది. సరే నేను ఇప్పుడు వాటి గురించి వివరంగా చెప్పదలచుకోలేదు. అందుచేత తల్లిగారి అనుమతి లేకుండా బాలశంకరుడు సన్యాసం స్వీకరించకూడదు. అంటే అమ్మగారన్నారూ నిన్ను సన్యాసం తీసుకోవటానికి అంగీకరించను. ఎందుచేత అంటే భర్తగారు వెళ్ళిపోయారు. నాకున్నది ఒకే ఒక్క కుమారుడవు. నువ్వు సన్యసించి వెళ్ళిపోతే

నేను ఏమి చెయ్యాలి. నిన్ను తల్చుకుంటూ ఏడుస్తూ కూర్చోవాలి. అందుకని నేను అలాంటి జీవితం జీవించలేను. అంత శంకరుడికి జన్మనిచ్చినా ఆశ్చర్యమేమిటంటే ఇంకా మమతానురాగాలు కుమారుని పట్ల మాత్రం పోలేదు. అంత మహాజ్ఞానిని కడుపులో మోసింది. కానీ ఆవిడకి మాత్రం అంత జ్ఞానం ఏర్పడలేదు. ఎంత ఆశ్చర్యకరంగా ఉంటుందో చూడండి. ప్రపంచం. నువ్వు వివాహం చేసుకోవలసిందే అంది అమ్మగారు. సరే ఆ ప్రస్తావన అంతటితో ఆగిపోయింది.

ఒకానొకనాడు బాలశంకరుడు తల్లితో కలిసి స్నానానికి వెళ్ళాడు. అమ్మగారు స్నానం చేసారు. అమ్మగారి చెయ్యిపట్టుకుని నీటిలో దింపి స్నానం చేయించి పైకి తీసుకువచ్చి ఒళ్ళు తుడిచి పొడిబట్ట ఇచ్చి కూర్చోబెట్టి అప్పుడు తాను స్నానానికి వెళ్ళేవారట శంకరాచార్యులవారు. ఎందుకో తెలుసాండి? బాలశంకరుడు ఒకమాట చెప్పాడు. తనకి చిన్నతనంలో విద్యాబుద్ధులు నేర్పిన ఉపాధ్యాయుడు అటువంటి ఉపాధ్యాయులు పదిమంది పాదాలు పట్టి అతి వినయంతో శుశ్రూష చేస్తే ఎంత పుణ్యం వస్తుందో అంత పుణ్యం గాయత్రీ మంత్రాన్ని ఉపదేశం చేసిన గురువు శుశ్రూష చేస్తే వస్తుంది. అలా గాయత్రీ మంత్రాన్ని ఉపదేశం చేసిన గురువు స్థాయిలో ఉన్న వారికి వందమందికి సేవచేసిన పుణ్యం తండ్రికి సేవచేస్తే వస్తుంది. వెయ్యిమంది తండ్రుల సేవ చేసిన పుణ్యం ఒక్క అమ్మకి సేవచేస్తే వస్తుంది. అందుకని మాతృదేవోభవ. ఇంతకన్నా గొప్పది ప్రపంచంలో లేదు. అందుకని నేను అమ్మ సేవ చేస్తానన్నారు శంకరాచార్యులవారు.

మనం శంకరాచార్యులవారి జీవితంనుండి నేర్చుకోవాలండి ఎలా బ్రతకాలో అసలు. శంకరుడు చక్కగా నీళ్ళలో దిగి సంతోషంగా ఈత కొడుతూ స్నానం చేస్తున్నాడు. స్నానంచేస్తూ ఒక పెద్ద కేక వేసారు. 'అమ్మా నన్ను పట్టుకుందమ్మా' అన్నాడు. ఏమిరా నాయనా? అంది అమ్మ ఒడ్డునుంచి. అమ్మా నన్ను మొసలి పట్టేసుకుంది. నా రెండు కాళ్ళు దాని నోటిలో ఉన్నాయి.

అది నన్ను క్రమ క్రమంగా మింగేస్తోంది. దాని నోటిలోంచి బయటకు రాలేన్ను అయిపోయింది నా జీవితం. ఎనిమిదేళ్ళు నాకు అయిపోయింది వెళ్ళి పోతున్నాను. అమ్మా నన్ను క్షమించు. నీకు ఏ సేవ చేయలేకపోయాను కానీ నిన్ను ఒక్క అనుమతి కోరుతున్నాను. నాకు వివాహం కాలేదు. నేను పిల్లల్ని కనలేదు. ఏ సంస్కారమూ పూర్తి కాకుండా నేను ఇలా కానీ వెళ్ళిపోయినట్టయితే దానికి ఒక పరిపూర్ణత ఉండదు. అందుకని ఆతురత సన్యాసం స్వీకరిస్తాను. అంటే మానసిక సన్యాసం. అంటే చేతిలో దండం పట్టుకున్నానా? కాషాయ వస్త్రాలు ఇచ్చారా? గురువులొచ్చి శాస్త్రోక్త సన్యాసం ఇచ్చారా? ఇవ్వలేదు. కానీ మానసికంగా సన్యసించేస్తాను. సన్యసిస్తే నేనూ ఉద్ధరింపబడతాను. నన్ను కన్నవాళ్లు పైతరాల వాళ్ళు ఉద్ధరింపబడతారు. అందుకని అమ్మా అనుమతివ్వు నేను సన్యసిస్తాను. సన్యసించడం పునర్జన్మ. పునర్జన్మ కనుక నాకు ఇక్కడితో జన్మ అయిపోయినట్టు కాబట్టి మొసలి నన్ను విడిచి పెట్టవచ్చు ఒకవేళ. విడిచిపెట్టిందా సన్యాసిగానైనా నీ కళ్లముందు తిరుగుతాను. నువ్వు అనుమతించలేదా? ఈ శరీరం మొసలిచేత తినివేయ బడుతోంది. అమ్మా నాకాళ్ళు కొరికేస్తోందమ్మా చాలా నొప్పెడుతోంది. అనుమతిస్తావా?' అని అరిచాడు. ఆ తల్లి ఒడ్డున ఉండిపోయింది. అలోచిస్తే కొడుకుని మొసలి తినేస్తుంది. ఆలోచించకపోతే ప్రమాదం వచ్చేస్తోంది కొడుక్కి. ఏం చెయ్యాలో అర్థంకాలేదు.

సన్యాసిగానయినా నా కొడుకు నా కళ్ళముందు తిరిగితే అంతే చాలు. అనుకుని, అనుమతిస్తున్నాను శంకరా అందావిడ. 'సన్యస్తోఽహం' అన్నారు. నేను సన్యసించాను అన్నారు. వదిలిపెట్టేసింది మొసలి. ఒడ్డెక్కేసారు. 'అమ్మా నువ్వు అనుమతించావు. నేను సన్యసించాను. ఇకనుంచి నాకు లోకమంతా తల్లులే. లోకమంతా తండ్రులే. అమ్మా నేను బయలుదేరుతున్నాను' అన్నాడు. ఆశ్చర్యపోయింది. ఎందుకలా జరగటం. అలా వదులుతుందండీ మొసలి. 'సన్యస్తోఽహం' అంటే మొసలి వదిలేస్తుందా? అక్కడే ఒక గమ్మత్తుంది.

ఒకానొకప్పుడు ఒక గంధర్వుడు దూర్వాసోమహర్షి వెడుతుండగా ఆయనపట్ల అమర్యాదగా ప్రవర్తించాడు. నువ్వు చాలాకాలం నదిలో మొసలిగా జీవించుమని దూర్వాసో మహర్షి ఆ గంధర్వుణ్ణి శపించాడు. అప్పుడు వాడు దూర్వాసో మహర్షి కాళ్ళమీద. పడి నాకు శాపానుగ్రహం ఇవ్వమని వేడుకున్నాడు.దూర్వాసో మహర్షి కటాక్షించారు. భూమిమీద శంకరుడు జన్మించి నదిలో స్నానంచేస్తున్న సమయంలో ఆయన పాదకమలాలను నీ నోట గ్రహిస్తావో ఆనాడు నువ్వు పాపాలనుండి వినిర్ముక్తుడివై స్వస్వరూపాన్ని పొంది గంధర్వుడవవుతావు. అప్పటినుంచి బాలశంకరుడి పాదగ్రహణం కోసం ఎదురుచూస్తోంది ఆ మొసలి. ఇప్పుడు ఏమయింది?

ఎనిమిదేళ్ళకే ఆయన మొట్టమొదటి జీవితం అయిపోయింది. ఇప్పుడు సన్యాసిగా బ్రతుకుతున్నాడు. అగస్త్య మహాముని చెప్పింది. ఎనిమిది ప్లస్ ఎనిమిది ప్లస్ పదహారు. ఇప్పుడేవారు, 'సన్యస్తోఽహం' అన్నారు కనుక సన్యసించారు. సన్యసించి నేను బయలుదేరుతాను అమ్మా అన్నాడు. అంటే అమ్మగారన్నారు 'నాయనా నువ్వు బయలుదేరుతానంటున్నావు. చాలా సంతోషం కానీ నువ్వు బయలుదేరి వెళ్ళిపోతే నేను ఎవరికోసం బతకను. భర్త వెళ్ళిపోయారు కొడుకు సన్యసించాడు. లోకాలు పట్టి వెళ్ళిపోయాడు. దేశాన్ని ఉద్ధరిస్తాడు. నేనేం చేయాలి? నేనిక్కడ ఎవరికోసం బ్రతకాలి అందుకని నేను కూడా ప్రాణాలు విడిచిపెట్టేస్తాను' అందావిడ. అమ్మా నువ్వలా అనకూడదు. తల్లి ప్రాణాలు విడిచిపెట్టేస్తే ఆ దోషం కట్టి నన్నిక్కడ కూర్చో పెడుతుంది. అందుకని నువ్వు ప్రాణాలతో ఉండాలి. నేను జ్ఞాతులకు నిన్ను అప్పచెప్పుతాను. జ్ఞాతులంటే ఆ వంశంలో పుట్టినవారు, దాయాదులు. వారికి నిన్ను అప్పచెప్పుతాను. వారు నిన్ను నేను ఎలా చూస్తానో అంత జాగ్రత్తగా చూస్తారు. నీ శరీరానికి ఎప్పుడైనా వ్యాధి వచ్చి నువ్వు మంచాన పడిపోతే వారు శుశ్రూష చేస్తారు. నీకు మరణకాలం ఆసన్నమయినప్పుడు నువ్వు శరీరాన్ని విడచి పెట్టి వెళ్ళిపోతుంటే నీ శిరస్సును వాళ్ళ ఒడిలో పెట్టుకుని

నీకు మరణబాధ తెలియకుండా చేస్తారు. శాస్త్రమందీ మరణబాధ అనేది సామాన్యమైంది కాదు. మరణబాధకి ఏది ఉపశమనం అంటే ఒక్క తనూభవునాత్మనిల్పి అంటారు. తన శరీరంలోనుంచి తన తేజస్సులోంచి వచ్చిన కొడుకు తొడమీద తల పెట్టుకున్ననాడు మాత్రం తండ్రి కొంత సంతోషంగా వెళ్ళిపోతాట్ట. నేను జ్ఞాతుల ఒడిలో తల పెట్టుకుని వెళ్ళిపోనా కొడుకుండగా? నాకలా ఇష్టంలేదంది.

అప్పుడు శంకరాచార్యులవారన్నారు 'అమ్మా నువ్వు నాకు తల్లివి. నేను ఎంత సన్యసించినా తల్లి తల్లే అందుకని నీకు ఒక వరమిస్తున్నాను. నీకు ఎప్పుడు నన్ను చూడాలని అనిపిస్తే అప్పుడు సంకల్పం చేయి. నేను ఎక్కడ ఉన్నా వచ్చి నీ ముందు ప్రత్యక్షమవుతాను నీ అంత్యకాలం సమీపించిందని నీకు అనిపించినప్పుడు నన్ను తలచుకో. నేను వచ్చి నీ ముందు నిలబడతాను' అన్నారు.అంటే తల్లిగారు ఒక వరమడిగారు. 'సరే శంకరా! నా శరీరం 'ఏడిచిపెట్టిన తరువాత నేను సన్యసించాను అందుకని నాకు తల్లి ఏమిటి? అని అంత్యేష్టి సంస్కారం చేయకుండా ఉండకూడదు. నువ్వు సాక్షాత్ కైలాసవాసియైన శంకరుడవు. నువ్వు నా కడుపున పుట్టావని ఋషులు చెప్పారు. ఇటువంటి కొడుకును కన్నందుకు ఒక తల్లి పొందవలసిన గొప్ప అనందమేమి? ఆ కొడుకుని చూసుకుంటూ ఉండాలి. అది దక్కలేదు. కనీసం నీ చేతులతో నాకు అంత్యేష్టి జరగాలి. నా పార్థివ శరీరాన్ని నువ్వు ముట్టుకుని పైకెత్తి నాకు అగ్ని సంస్కారం చేయాలి. అలా వరం ఇస్తే నువ్వు బయలుదేరి దేశాటనకు వెళ్ళిపోవచ్చు' అంది. శంకరులు నవ్వి అన్నారు. 'అమ్మా సన్యసించినంత మాత్రాన ఈ పని చేయకూడదు అని కదా నువ్వు అన్నావు. కానీ అమ్మకన్నా గొప్ప వస్తువు ప్రపంచంలో వేరొకటిలేదు. అందుకని నేను సన్యసించవచ్చుగాక నీ కోరిక జరిపింపబడి తీరుతుంది. అంత్యకాలంలో నీవు తలచుకున్నప్పుడు వచ్చి నీకు అంత్యేష్టి సంస్కారం నా చేతులతో చేస్తా'నని ప్రతిజ్ఞ చేసారు శంకరులు.

శంకరులు తల్లిపట్ల అంత మర్యాదగా ప్రవర్తించారు. ఈ జాతిలో పుట్టిన మనం అమ్మ పట్ల మర్యాదగా ప్రవర్తించకపోతే అమ్మ గురించి మాట్లాడడానికి మనకున్న అర్హతేమిటి? ఈ భరతదేశంలో శంకరాచార్యులుపుట్టిన గడ్డ మీద పుట్టామని చెప్పుకోవటానికి మనకేం అర్హత ఉంటుంది? మనకు లేదు. అందుచేత అమ్మ అమ్మే. శంకరభగవత్పాదులంతటి వారు అమ్మ పట్ల అంత గౌరవం ప్రదర్శించారు. అలాగే రమణమహర్షి మహానుభావుడు అంత మహాజ్ఞాని అద్వైతానందాన్ని అనుభవించినటువంటి వారు. అటువంటి రమణులు తల్లిగారు శరీరాన్ని విడిచిపెడుతుంటే ఉదయం నుంచి సాయంకాలం వరకు అమ్మగారు అలఘమ్మ గారి గుండెల మీద చెయ్యివేసి ఆవిడ కొన్ని వేల జన్మలలో అనుభవించవలసిన పాపపుణ్యాలను సూక్ష్మ శరీరంచేత అనుభవింపచేసి ఆవిడ ప్రాణోత్క్రమణమై మళ్ళీ పుట్టవలసిన అవసరం లేని శాశ్వత శివ సాయుజ్య సిద్ధిని ఆవిడకిప్పించారు. అమ్మగారు చనిపోయారన్నారు దగ్గరున్నవాళ్ళు. ఆయనన్నారు అమ్మ చనిపోలేదు. అమ్మ మోక్షాన్ని పొందింది అన్నారు. శంకరాచార్యుల వారు అమ్మకి మోక్షం ఇచ్చారు. అలఘమ్మ గారికి రమణమహర్షి ఏకంగా గుడి కట్టారు. అదే మాతృభూతేశ్వరాలయం ఇప్పటికీ అది అరుణాచలంలో ఉంది. తల్లిని సన్యాసులు కూడా అంత గౌరవించారు ఈ జాతిలో. తల్లి అనుమతితో శంకరులు సన్యసించి బయలుదేరారు. ఇక్కడ మనకొక అనుమానం వస్తుంది. శంకరాచార్యులవారు సన్యసించకపోతే ఏమి అయి ఉండేది? శంకరులు గృహస్థాశ్రమంలో ఉండి వేదంలో ఉండే జ్ఞానకాండను ఆవిష్కరించాలని అనుకుంటే ఏదైనా అడ్డొస్తుందా?

శంకర భగవత్పాదులు వాళ్ళ అమ్మగారికి అంత సేవ చేసి ఎందుకు సన్యాసం స్వీకరించినట్టు. అంటే దాని గురించి చంద్రశేఖర పరమాచార్య స్వాముల వారు ఒక అద్భుతమైన మాటచెప్పారు. శంకరులు సన్యసించకపోతే శంకరులకు అన్నం పెట్టే అదృష్టం బహుశః ఆర్యాంబకి, శివగురువుకి ఆయన భార్యకి ఆయన బిడ్డలకి, కోడలికి దక్కి ఉండేదేమో? శంకరులు సన్యసించబట్టి

భవతి భిక్షాందేహి అని వెళ్ళిన ప్రతి ఇంటి ముందు వారి చేతిలో కబళం వేసిన ప్రతి తల్లీ ఆయనకి తల్లే. ఆయన్ని చూసి శంకరా అని పిలిచి సంతోషించిన ప్రతివ్యక్తీ తండ్రియే. శంకరుల జీవితం గురించి చెప్పుకుని సంతోషించిన ప్రతివాడూ ఆయన శిష్యుడే. ఇప్పుడేమయింది? శంకరులు సన్యసించి జాతికి మహోపకారం చేసారు. ఇది శంకరాచార్యుల వారు సన్యసించడం వెనుకనున్న పరమరహస్యం అన్నారు చంద్రశేఖర పరమాచార్య స్వామి.

మహానుభావుడు లోకాన్ని చూడటానికి బయలుదేరారు. వెళుతుంటే ఒక గమ్మత్తు జరిగింది. కొంత దూరం నడిచి వెళ్ళారు. వెళ్ళేసరికి అశరీరవాణి వినబడింది. అది కృష్ణభగవానుని వాణి. కృష్ణుడు మాట్లాడ్డం ఏమిటి? శంకరా చార్యుల వారి స్తోత్రాలను మీరు చూసినట్టైతే. శంకరులకి ప్రత్యేకమైన ప్రేమ, ప్రత్యేకమైన పక్షపాతం ఇద్దరు దేవతలయందు కనబడుతుంది ఆయన స్తోత్రాలలో. మీరు జాగ్రత్తగా గమనిస్తే చంద్రుని గురించి మాట్లాడేటప్పుడు ఎప్పుడూ సాధారణంగా శంకరాచార్యుల వారు ఒకమాట వేస్తే ఇంక రెండోమారు వేయరు కాని హిమకరః అన్నమాట చాలా ఎక్కువ వేస్తారు చంద్రుడికి. రెండు శంకరభగవత్పాదులు మురరిపు అంటుంటారు. కృష్ణ భగవానుని గురించి చెప్పవలసి వస్తే 'అవిద్యానానాం ........... మురరి పువరాహస్యాభవతి' అంటారు. 'మురరిపువరాహస్యా భవతి' రాక్షసునికి శత్రువైన కృష్ణభగవానుని యందు ఆయనకి చాలాప్రీతి. చాలామంది అనుకుంటారు శంకరాచార్యులవారంటే శివభక్తుడూ. శంకరాచార్యుల వారు విష్ణుద్వేషి అనుకుంటారు. అంతకన్నా మహాపాపం ఇంకొకటిలేదు.

శంకరాచార్యులవారు స్తోత్రాలు అందరు దేవతలమీదా చేసారు. శంకరులకి శివకేశవ భేదాలు లేవు. అవి ఆయనకి అంటకడితే మహాపాపం. ఆయన విష్ణు సహస్రనామానికి భాష్యం ఇచ్చారు. మహానుభావుడు శ్రీకృష్ణపరమాత్ముడి మీద ఎన్ని స్తోత్రాలు చేసారో! శంకరులు చేసిన స్థాయిలో

స్తోత్రాలు చాలా తక్కువ ఉంటాయి. అంతగొప్ప స్తోత్రాలు చేసారు. అటువంటి పక్షపాతాలు శంకరాచార్యులవారికి తెలియవు. ఆయనేదో ఇలా భస్మం పెట్టుకున్నారని ఆయన శివభక్తుడనుకోకూడదు. అదొక వైదికమైన ప్రక్రియ. అందుకని భస్మధారణ చేసారాయన. సరే శంకరులు వెళుతుంటే కృష్ణ భగవానుల వాణి వినబడింది. 'శంకరా నువ్వు బయలుదేరి లోకయాత్రకి వెడుతున్నావు. కానీ నువ్వు మీ అమ్మకి ఉపకారం చెయ్యడంలో నాకొక అపకారం జరిగింది. నువ్వేం చేసావు. మీ అమ్మగారు స్నానానికి వెళ్ళలేకపోతున్నారని పూర్ణానది నీ ఇంటి ముందునుంచి వెళ్ళేటట్టు చేసావు. అలా వెళుతున్న నది ఏంచేసిందో తెలుసా? నా దేవాలయానికి ఉన్న అంతరాలయం పక్కనుంచి ప్రవహిస్తోందిప్పుడు. దానివల్ల మెల్లమెల్లగా మెల్లమెల్లగా ఆ దేవాలయం శిథిలమైపోయి నదిలో కలిసి పోతోంది. నువ్వు వెళ్ళిపోతే ఈ దేవాలయాన్ని పునరుద్ధరించగలిగినవాడు ఎవడు? అందుకని నన్ను నువ్వు భద్రమైన ప్రదేశంలో ఉంచి బయలుదేరు' అన్నాడు కృష్ణుడు. ఇదీ గమ్మత్తు. కృష్ అంటే క్షేత్రం. ణ అంటే ఆనందం. నిరతిశయ ఆనంద స్వరూపుడైన కృష్ణుడు మాట్లాడాడు శంకరులతోటి. చిత్రమేమంటే శిథిలమైపోయి కొంచెం పక్కకి ఒరుగుతోంది దేవాలయం. ఒరుగుతున్న విగ్రహం దగ్గరికి వెళ్ళి శంకరులు శ్రీకృషుని స్తోత్రం చేసి ఆయనకి ఏమాత్రం అంగ భంగం కలుగకుండా పునఃప్రతిష్ఠ కార్యక్రమం లేకుండా గమ్మత్తుగా తన చేతులతో, భుజాలతో కృష్ణమూర్తి విగ్రహాన్ని. తీసి పూర్ణానది ఒడ్డున భద్రమైన ప్రదేశంలో ప్రతిష్ఠ చేసి వెళ్ళిపోయారు. అప్పటినుంచి కృష్ణమూర్తి పరమ సంతోషంగా అక్కడున్నాడు. శంకరాచార్యుల వారికి మొట్టమొదటి కృప కృష్ణుని అనుగ్రహంతోనే ప్రారంభం యథార్థానికి.

శంకరాచార్యులవారు కాలడిలో సాధించిన గొప్ప విజయాలలో పూర్ణానదిని తేవటం, సన్యసించటం, కృష్ణదేవాలయాన్ని పునరుద్ధరించటం ఇవి ఒక ఎత్తు. మనం ఆయన జీవితంలో ఎఱ్ఱ సిరాతో అండర్‌లైను చేసి

గుర్తుపెట్టుకోవలిసిన విషయం ఒకటుంది. శంకరులు గృహస్థాశ్రమంలోకి వెళ్ళలేదు. బాల్యం చూపించారు. బ్రహ్మచర్యం చూపించారు. సన్యాసం చూపించారు. బ్రహ్మచర్యం ఎలా ఉండాలో శంకరాచార్యులవారు నిర్వచించి చూపించారు యథార్థానికి.

శంకరులు సన్యసించటానికి ముందు ఆ రాజ్యాన్ని రాజశేఖరుడనే రాజు ఏలుతూ ఉండేవాడు. ఆయన శంకరాచార్యుల వారి గురించి విన్నారు. పూర్ణానదిని దారి మళ్ళించారని విని శంకరుల దర్శనం కోసమని చెప్పి మంత్రిని భద్రగజమిచ్చి పంపించాడు. మంచి పట్టుబట్టలు పంపించాడు. ఈ పట్టుబట్టలు కట్టుకుని భద్రగజమెక్కి శంకరులని తన ఆస్థానానికి రమ్మని. ఆ వచ్చిన మంత్రి అయ్యా మీరీ పట్టుబట్టలు కట్టుకుని భద్రగజం మీద కూర్చుని రాజాస్థానానికి రమ్మనిపిలిచాడు. శంకరాచార్యులవారన్నారు నాకేమిటి నియమం? బ్రహ్మచారిగా ఉన్నప్పుడు. ఒకటి గురువుగారి దగ్గర ఉండి వేదశాస్త్రాధ్యయనం చేయాలి. రెండు నేను వాహనాలు ఎక్కగూడదు. మూడు నేను ఎప్పుడైనా సరే ఆకలి వేస్తే మాగురువులు తీసుకురమ్మన్న భిక్షాన్నం స్వీకరించాలి. అటువంటి నేను భద్రగజమెక్కడమేమిటి? శంకరాచార్యులవారు ఏ ఆశ్రమంలో ఎలా ఉండాలో చూపించారండి మనకి. బ్రహ్మచర్యంలో ఉండగా ఏనుగెక్కలేదు. సన్యసించిన తర్వాత వాహనమెక్కలేదు. నాకు తెలిసి అంత ఖ్యాతి పొందిన వారు ఇద్దరే ఒకరు ఆదిశంకరులు రెండు చంద్రశేఖర పరమాచార్య. చంద్రశేఖర పరమాచార్య ఎన్నడూ వాహనమెక్కలేదు. వెళితే పాదచారియై వెళ్ళటం లేకపోతే శిష్యులు తీసుకెళ్ళిన పల్లకీలో వెళ్ళటం. వాహనం ఎక్కడం చంద్రశేఖర పరమాచార్య ఎప్పుడూ చేయలేదు. ఆదిశంకరులు చేయలేదు.

బ్రహ్మచారిగా ఉండగా నేను భద్రగజమెక్కను అని రాజశేఖరుడు పంపిన ఆహ్వానాన్ని మర్యాదగా తిరస్కరించి పంపించేసారు. మంత్రి వెళ్ళి చెప్తే పిల్లవాడి ప్రాజ్ఞతకి పొంగిపోయి ప్రభువు బయలుదేరి వచ్చారు. వచ్చి బాలశంకరుడి

పాదాల మీద పడ్డాడు. ఆయన తేజస్సు చూసి, నేను సంస్కృతంలో మూడు నాటకాలు వ్రాసాను. ఈ మూడు నాటకాలు మీరు వినండి అన్నాడు శంకరాచార్యులవారిని. విన్నారు శంకరులు చాలా బాగున్నాయి. ఏమీ దోషంలేదు. అలా ఉంచుకో అన్నారు. రాజు పదివేల బంగారు నాణాలు బహూకరించారు శంకరాచార్యులవారికి, బహూకరించి ఒక వరమడిగాడు. 'అయ్యా నాకు సంతానం లేదు. నాకొక్క కొడుకు పుట్టేటట్టు అనుగ్రహించండి' అన్నాడు. ఎన్నేళ్ళండీ అప్పటికి శంకరాచార్యులవారికి ఎనిమిదేళ్ళు. మహానుభావుడు కళ్ళుమూసుకుని ఒక్కసారి ధ్యానం చేసారంతే. 'నీవు చేసిన పాపమే నీకు సంతానం కలుగకుండా ప్రతిబంధకంగా నిలబడుతోంది. అందుచేత నేను ఒక ఇష్టిని చెప్తాను. నువ్వా ఇష్టిని చెయ్యి దేవతలనుద్దేశించి. నీకు సంతానం కలుగుతుంది. నేను వరమిస్తున్నాను. వెళ్ళు కానీ బ్రహ్మచారిగా ఉన్న నేను భిక్ష తీసుకోవాలి తప్ప బంగారు కాసులు పుచ్చుకోకూడదు. అందుకని నువ్విచ్చిన పదివేల బంగారు కాసులు ఇక్కడే ఉన్న బ్రాహ్మణులకు దానం చేస్తున్నాను.' పదివేల బంగారు నాణాలను గృహస్థాశ్రంలో ఉన్న బ్రాహ్మణులకు దానం చేసేసారు శంకరులు.

శంకర భగవత్పాదులు గురువుని అన్వేషిస్తూ బయలుదేరారు. ఇంత ప్రాజ్ఞుడికి ఋషులు వచ్చి ఆయన దగ్గర జ్ఞానాభ్యాసం చేసిన వ్యక్తికి గురువు దేనికండి.ఆయనే గురువులకు గురువు. అటువంటి వారికి గురువా? మర్యాద చూపించారు. ఎటువంటి వారికైనా గురుముఖతః ఉపదేశం ఉండాలి? గురువుని గౌరవించని వాడు, ఉపదేశం పొంది గురువును మరిచిపోయినవాడు భ్రష్టుడవుతాడు. ఏదిచేసినా గురువును తలుచుకుని నమస్కారం చేయాలి. ఒకసారి ఉపదేశం పొందారనుకోండి. వారు బోధక గురువు అంటారు. సూచక గురువు. వాచకగురువు, బోధక గురువు, పరమ గురువు, నిషిద్ధ గురువు అని గురువులు అయిదుగురు ఉంటారు. చిన్నతనంలో మనకు పాఠాలు నేర్పినవాడిని సూచక గురువు అంటారు. మనమేదైనా ఒక ఆశ్రమానికి

వెళ్ళినపుడు ఆశ్రమంలో నియమాలు చెప్పినపుడు వారిని వాచక గురువు అంటారు. మంత్రోపదేశం చేసినవారిని బోధక గురువు అంటారు. ఈ ఇద్దరు గురువుల కన్నా మంత్రోపదేశం చేసిన గురువు స్థాయి పెద్దది. బోధక గురువు కన్నా గొప్ప గురువు పరమగురువు. ఒక చంద్రశేఖర పరమాచార్య స్వామి వంటివారు వచ్చారనుకోండి పరమగురువులు. అందరూ లేచి నిలబడవలసిందే. నిషిద్ధ గురువుంటాడు. తాంత్రిక విద్యలు నేర్పుతాడు. ఉపాసన చేయకూడదు. వామాచారంలాంటి విద్యలు. వాటి వల్ల అమ్మవారికి ఖేదం కలుగుతుంది. అయితే వాటిని కూడా ఉపదేశం చేస్తారు. అందుకని అతడు కూడ గురువే. శాస్త్రం పక్కన బెట్టలేదు. కానీ అది మంచి పద్ధతి కాదు. అందుకని నిషిద్ధ గురువు అన్నారు.

లోకాచారం కోసం గురువన్నవాడు ఉండాలి. లేకపోతే తాను సముపార్జించిన జ్ఞానానికి ఒక పరిపూర్ణత ఉండదు. అందుకని ఇంతటి శంకరులు కూడా గురువును వెతుక్కుంటూ బయలుదేరారు. గురువును ఎలా వెతుక్కుంటారండీ? అంటే శంకరుల జీవితమే మీరు తెలుసుకోవాలి. అలా బయలుదేరి వెళుతూ వెళుతూ ఎన్ని ఊళ్ళు దాటారో ఎన్ని నగరాలు దాటారో ఉన్న ఊళ్ళో ఉండేవారు కాదు. మహానుభావులు ఆకలేస్తే అదికూడా ఒక వ్యాధి అనుకునే వారుట. అందుకే కౌపీన పంచకం చెప్పారండీ ఆయన. కౌపీనం పెట్టుకున్న సన్యాసి కన్నా పరమోత్కృష్టమైన వ్యక్తి ఈ జాతిలో ఎవరున్నారని పొగిడారాయన. ఎప్పుడయినా ఆకలేసిందా దానికో మందేసేవారాయన. మనకి ఆకలేస్తే వండుకుంటాం. ఆకలి వ్యాధి. నాకు దగ్గొస్తుందేమో అని దగ్గుమందు తెచ్చి ఇంట్లో పెట్టుకుంటారా? పెట్టుకోరు. ఆకలేస్తే నాలుగిళ్ళ ముందుకెళ్ళి చెయ్యిచాపి భవతి భిక్షాందేహి అంటారు. ఏ అమ్మ ఏనాడు ఏ చేతితో ఇంత కబళాన్ని పడేస్తుందో అన్ని పిడచలు కలుపుకుని తింటారు. రుచికి లొంగరు. అటువంటి సన్యాసియై దేశమంతటా పర్యటిస్తూ కాలినడకన బయలుదేరి ఉత్తర భారతదేశానికి చేరుకుని నర్మదా నది తీరానికి

చేరుకున్నారు. అక్కడికి వెళ్ళి గోవిందభగవత్పాదాచార్యుల వారు ఎక్కడున్నారు అని విచారణ చేసారు. చేస్తే అదిగో ఆ పక్కన ఉన్న కొండ గుహలో ఉన్నారు అన్నారు. మహానుభావులు పూర్వం అటువంటి గుహలలో ఉండేవారు.

మీకు చిత్రమేమిటో తెలుసాండి. నేనబద్ధం చెపుతున్నాననుకుంటే మీరు శంకరవిజయం తీసి చూడండి. శంకరభగవత్పాదుల గురువుగారైన గోవిందపాదాచార్యులవారు తపస్సు చేస్తున్న గుహకు ద్వారం ఎంత? బొటనవ్రేలు చాపి చిటికెన వ్రేలునుచాపితే ఎంత పొడుగుంటుందో అంత. ఎలా వెళ్ళారు? లోపలికి. అది వారి శక్తి. వారు యోగశక్తితో లోపలికి వెళ్ళిపోతారు. ఏ శబ్దం లేకుండా సమాధిస్థితిలోకి వెళ్ళి బ్రహ్మముతో రమిస్తూ ధ్యానమునందు మూడు ఒక్కటైపోయి త్రిపుటిని అధిగమించి తానే బ్రహ్మమై బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి అని బ్రహ్మని ఎరిగినవాడు బ్రహ్మమై ఆ సమాధిస్థితిలో నిరంతరం ఈశ్వరానుసంధానం చేస్తూ ఆనంద స్వరూపుడిగా కూర్చుని ఉండేవారు. శంకరులు గోవిందపాదాచార్యులవారు ఉన్న గుహదగ్గరికి వెళ్ళారు. వెళ్ళి చూసారు. ఆ గుహకి మూడుమార్లు ప్రదక్షిణం చేసారు శంకరాచార్యుల వారు. అక్కడ ఎందరో కూర్చుని ఉన్నారు. గోవిందపాదాచార్యులవారు బయటికి వస్తే దర్శనం చేసుకుందామని. అక్కడ కూర్చుని గోవిందపాదాచార్యుల వారిని స్తోత్రం చేసారు. అయ్యా మహానుభావా లోపలున్న నువ్వు ఎవరో నాకు తెలుసు. నువ్వు ఎవరివో? నువ్వు ఈ భూమినంతటినీ వేయి పడగలతో మోసే ఆదిశేషుడవు. ఒకనాడు సంస్కృత వ్యాకరణానికి భాష్యం వ్రాయడం కోసమని పతంజలి మహర్షిగా వచ్చావు. నువ్వు ఒకనాడు భూమిమీద వేయి ముఖాలతో తన శిష్యునికి పాఠాలు చెప్తుంటే ఆ ముఖంయొక్క కాంతిని తేజస్సుని చూడలేకపోయారు. నన్ను చూడలేక పోతున్నారని పతంజలి మహర్షిగా వచ్చారాయన. ఆయనే ఆ తరువాతి కాలంలో పరాశర మహర్షి కుమారుడు వ్యాసుడు. వ్యాసుని కుమారుడు శుకుడు. శుకుని శిష్యుడు గౌడపాదాచార్యులు. గౌడపాదాచార్యుల శిష్యులు గోవిందపాదాచార్యులు. గోవిందపాదాచార్యుల

శిష్యులు శంకరాచార్యులవారు. ఆ పరంపర విన్నంత మాత్రం చేత మీ పాపరాశి దగ్ధమయిపోతుంది. ఎందుకనంటే వాళ్ళందరూ అగ్నిహోత్రులు ఒక్కొక్కరూ. వ్యాసుడంటే వేదవిభాగం చేసినవాడు. ఎటువంటి వారి కొడుకు. పరాశర మహర్షి కుమారుడు. ఆయనది భగవంతుని అంశ. పట్టపగలు మంచుతెరలు సృష్టించి సత్యవతీ సమాగమంలో వ్యాసుని కన్నాడు. మహానుభావుడాయన. ఆ వ్యాసుని కుమారుడు శుకుడు. జన్మతః నాకసలు వివాహమే వద్దని వెళ్ళిపోయినవాడు. ఆ శుకుడు భాగవతం చెప్పాడు. మహాజ్ఞాని. ఆ శుక మహర్షి శిష్యుడు గౌడపాదాచార్యులవారు. వార్తికాలు వ్రాసాడాయన. ఆ గౌడపాదాచార్యుల వారి శిష్యుడు గోవిందపాదాచార్యులవారు.

ఆయన మహాజ్ఞాని. 'నువ్వు సూర్యమండలం ఎలా ఉంటుందో అటువంటి తేజోమూర్తివి. నువ్వు గుహలో కూర్చుని తపస్సు చేస్తున్నావు. నేను శిష్యుడినై నీ పాదాల దర్శనం చేద్దామని ఆర్తితో బయటనిలబడి ఉన్నాను. గురుదేవా నీ నేత్రాలను తెరచి నావంక ప్రసన్న దృక్కులతో చూసి నన్ను తరింప చేయవలసిందని' ప్రార్థన చేసారు. ప్రార్థన చేస్తే గోవింద పాదాచార్యులవారు చేసిన గమ్మత్తేమిటో తెలుసాండి. దర్శనమివ్వలేదుట. గోవిందపాదాచార్యులవారి పాదాలు రెండింటినీ గుహయొక్క కన్నం దగ్గర పెట్టారట. ఆ పాదాలుచూసినంత మాత్రంలో పొంగిపోయారట శంకరాచార్యుల వారు. చాలు గురువుగారి పాదాలు దొరికాయి నాకు అని ఆ రెండు పాదాలు పట్టుకుని 'తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' గురువు దగ్గర జ్ఞానం పొందటానికి ఉండవలసిన మొట్టమొదటి లక్షణం అహంకార పరిత్యాగం చేసి వారి పాదాలు పట్టి వారికి శుశ్రూష చేయాలి. లేకపోతే ఆ జ్ఞానం నిలబడదు. అందుచేత పాదాలు పట్టి స్తోత్రం. ఆ పాదాలకు సేవ. చేస్తే లోపల కూర్చున్న గోవింద భగవత్పాదులు పరమ ప్రీతిని పొందారు, కన్నులు విప్పి శంకరుల వంక చూసారు. చూసి కస్త్వం? ఎవరు నువ్వు? అనడిగారు. అడిగితే ఇప్పుడు ఏం చెప్పాలి శంకరాచార్యులవారు. యథార్థంగా ఇంకొకరైతే ఏం చెప్తారు. వెంటనే

కుడిచెయ్యి పైనేసి రెండు చెవులు పట్టుకుని ప్రవరంతా చెప్పి అహంభో అభివాదయే నేను నమస్కరిస్తున్నానుఅంటారు.

శంకరాచార్యులవారు గోవిందపాదాచార్యులవారితో ఏమని చెప్పారో తెలుసాండి. కస్త్వం అని ఆయన అడిగితే అన్నారు.

**నభూమిః, నతోయం, నతేజో, నవాయుః,**
**న ఖం, నేంద్రియం వా, నతేషాం సమూహః,**
**అనైకాంతికత్వాత్, సుషుప్తే కసిద్ధః**
**తదేకోఽవ శిష్టః శివః కేవలోఽహమ్.**

అన్నారు. నభూమిం నేను భూమిని కాదు. నవాయుః నేను వాయువును కాదు. నతేజో నేను అగ్నిని కాను. నతోయం నేను నీటిని కాను. నేనెవరు. న ఖం న ఇంద్రియం వా. నేను ఇంద్రియాలను కాను. నేను బుద్ధిని కాను మరి నేనెవరు. నేను తదేకోఽ వశిష్టస్య శివఃకేవలోఽహం నమస్తాన్ని తెలుసుకుంటున్న స్ఫురత్తేది ఉందో జ్ఞానమేది ఉందో ఏది భాసయో అది నేను.

**నవర్ణా నవర్ణాశ్రమాచార ధర్మా**
**న మేధారణా ధ్యాన యోగాదయోఽపి,**
**అనాత్మాశ్రయాహం మమాధ్యా సహానా**
**త్తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్.**

ఆ గురువు ఎంత పొంగిపోతారు లోపల? నవర్ణా నాకేం కులం లేదు. న వర్ణాశ్రమాచార ధర్మాః నేను ఏ కులానికి చెందినవాడను కాను.అందుచేత ఇదీ నా ధర్మమని చెప్పటానికి తగినది ఉన్నవాడిని కాను. నమేధారణా ధ్యాన యోగాదయోఽపి అన్ని సిద్ధాంతాలను ఖండించేసాను. నేను కేవలం తదేకోఽ వశిష్టఃశివఃకేవలోఽహం అన్నీ తెలుసుకున్న జ్ఞానమేది ఉన్నదో అది నేను. ఎంత గమ్మత్తయిన మాటండి అది నిజంగా అది తెలుసుకుంటోంది. ఆ

తెలుసుకుంటున్నదేదో అది మీరు తప్ప పైన ఉన్న జడమయిన శరీరం మీరు కాదు. శరీరం మీరైతే ఈ శరీరం లోపల ఎక్కడో ఇక్కడ కలుక్కని పట్టుకుంటే ఇక్కడ నెప్పి పెడుతోంది డాక్టరుగారూ ఊపిరి తీస్తున్నప్పుడు కలుక్కు కలుక్కుమంటోంది అంటాడు. లోపల ఊపిరి తీస్తున్నప్పుడు కలుక్కు కలుక్కుమంటోందన్న విషయం ఈ కంటితో చూడబడనిది ఏ కన్ను చూచి తెలుసుకున్నది. తెలుసుకున్నదేదో అది నువ్వు. తెలియబడుతున్నది ప్రపంచం. తెలుసుకుంటున్నదానికి అసలు శరీరం లేదు. కులం లేదు. మతం లేదు. జాతి లేదు. వర్ణం లేదు. ధర్మం లేదు. నశుక్లం నకృష్ణం, నరక్తం నపీతం నపీనం నకుడ్యం నహ్రస్వం న దీర్ఘం త దేకో౽ వశిష్టః అరూపస్య తదారూప తదాజ్యోతిరాకార స్త దేకో౽ వశిష్టఃశివఃకేవలో౽హం. ఎవరు చెప్తారండీ ఎనిమిదేళ్ళ వయస్సులో నేను పొడుగువాడను కాను.నేను పొట్టివాడను కాను. నేను తెల్లని వాడను కాను. నేను నల్లని వాడను కాను. నేను లావు వాడను కాను. నేను సన్నని వాడను కాను. నాకు ఆకారం లేదు.నేను జ్యోతి స్వరూపుడను. సమస్తం దేనిచేత ప్రకాశింపబడుతున్నదో అది నేను. ఎంత గమ్మత్తయిన మాట చూడండి. ఈ కన్ను చూస్తుంది మైకును. చూస్తే తెలుసుకుంటుందా? కన్ను తెలుసుకోలేదు. కన్ను చూస్తుందంతే. కన్ను చూస్తే కంటినుంచి బయలుదేరిన కిరణం మైకు మీదపడి పరావర్తనం చెంది వెనక్కి వచ్చి కనుగుడ్డు మీద పడితే కంటి వెనుక ఉన్న రెటీనా మీద ఈ మైకు ప్రతిబింబం పడితే దాన్ని కనిపెడుతుంది మనస్సు ఇది మైకు అని. ఆ మనస్సు కూడా ఆత్మచేత ప్రకాశవంతమవుతోంది. అందుకే ఆయన దక్షిణామూర్తి స్తోత్రం చెపుతూ ఒకమాట అంటారు. ఎవరు నేను అంటే 'సర్వకాలాలయందూ ఒక ఘటంలో ప్రకాశించే దీపం ఎలా ఉంటుందో అటువంటి స్వరూపుడను నేను' అంటారు. అని అదిగో ఆ స్వరూపమున్నదే

**సమాతా, పితావా, నదేవా, న లోకా,**
**న వేదా, న యజ్ఞా, న తీర్థం బ్రువంతి,**

**సుషుప్తౌ నిరస్తాతి శూన్యాత్మ కత్వాత్,**
**తదేకోఽవశిష్టః శివః కేవలోఽహమ్.**

నేను తల్లిని కాను తండ్రినికాను. కొడుకునుకాను. లేకపోతే నాకేం యజ్ఞంలేదు. యాగం లేదు. నేను వేదం కాను. నేనేమి కాను నేను ఎవరు. నేను అంతటా వ్యాపించినవాడెవడో వాడు నేను. ఈ మాటలు విని గోవిందపాదాచార్యులవారు తెల్లబోయార్ట. అమ్మబాబోయ్ ఇంత జ్ఞానం సంపాదించినవాడు. వీడు నాకు శిష్యుడా? ఏ శిష్యుడు ఏ గురువు ముందు ఇలా చెప్పాడండీ ఎనిమిదేళ్ళ వయస్సులో. శంకరభగవత్పాదులొక్కరే చెప్పారు. యశస్సలోకి అంటారు దీన్ని. పొంగిపోయారుట గోవిందపాదాచార్యులు లోపలినుంచే 'నీకు బ్రహ్మోపదేశం చేస్తున్నాను' అన్నారు.

బ్రహ్మోపదేశం అంటే ఏంటి? గాయత్రీ మంత్రం చెపితే బ్రహ్మోప దేశమే. ఎప్పుడు. ఉపనయన సమయంలో సన్యాసిగా ఆయనకి చేసిన బ్రహ్మోపదేశం వేదంలో ఉండే జ్ఞానకాండకి సంబంధించి నాలుగు వేదాలకు సంబంధించి నాలుగు ఉపనిషత్తులలోంచి ఐతరేయ ఉపనిషత్తు. బృహదారణ్యా కోపనిషత్తు. చాందోగ్యోపనిషత్తు, ఆ తరువాత మాండూక్యోపనిషత్తు. నాలుగు ఉపనిషత్తుల్లో ఉండే నాలుగు విశేషమైన అర్థాలను ప్రతిపాదన చేసే వాటిని మహావాక్యాలు అంటారు. తత్త్వమసి. ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మోస్మి, అయమాత్మాబ్రహ్మ నాలుగు మహావాక్యాలను బ్రహ్మోపదేశం చేసారు. గురుముఖతః వింటే? అంతటా వ్యాపించిన పదార్థమేదో అది దర్శనమవుతుంది. ఈ కంటితో చూసే వస్తువుకి అధిష్ఠానమేదో, దేనియందు ఇది నిలబడినదో, ఏది సత్యమో తెలుస్తుంది. ఇది తెలియగానే బ్రహ్మోపదేశం చేసి కాషాయ వస్త్రాలని బహూకరించారు.

ఆనాడు శంకరులు కాషాయ వస్త్రం కట్టుకుంటే శంకరవిజయంలో అంటారు. కైలాసపర్వతం మీద ఎఱ్ఱటి మబ్బుపడితే ఎలా ఉంటుందో అలా

మెరిసిపోతున్నారు శంకరాచార్యులవారు. పదమూడో తారీఖున కాషాయ వస్త్రం కట్టుకుని తెల్లటి శంకరులు కూర్చుని చేతిలో సత్యదండం పట్టుకుంటే ఆ రోజు చూద్దురుకానీ. ఆరోజు సన్యాసదీక్ష పుచ్చుకున్న శంకరులు ఎలా ఉంటారో? ఆరోజున పల్లకిలో శంకరాచార్యులవారు ఊరేగింపుకు బయలుదేరుతారు. ఆరోజున తెల్లటిపంచె కట్టుకుని మీద చొక్కా కట్టుకుని ఓ ఉత్తరీయం వేసుకున్న ప్రతిమొగవారూ ఆరోజున పల్లకి పట్టుకోవడానికి అనుమతింపబడతారు. శంకరులని భుజంమీద మోసే అదృష్టం ఆరోజు అందరికీ ఇవ్వాలి. శంకరజయంతి నాడు. అని అద్భుతమైన టేకుతో పల్లకి చేయించి శంకరాచార్యుల వారి పంచలోహ ఉత్సవమూర్తులను సిద్ధం చేయించారు రెడ్డిగారు. ఇదంతా కాకినాడ పట్టణంలో ఊరేగింపు జరగాలి అందరూ మొయ్యాలి. ఆడా మొగా జగద్గురువుల ఋణం తీర్చుకోవటానికి 'జయ జయ శంకర హరహర శంకర' అంటూ బయలుదేరాలి. ఆరోజు ఉదయం ఆరుగంటల ముప్ఫై నిమిషాలకు ప్రతిష్ఠ అయిపోతే అందరం దేవాలయంలోంచి బయలుదేరి పల్లకి తీసుకుని రాజవీథులలో తిరిగి ఆ ఉత్సవంలో మేళతాళాలతో వేదం చదువుతూ పండితులు నడుస్తూండగా దత్తాత్రేయ గురుస్వాముల వంటి గురుస్వాములు నడుస్తుండగా శంకరభగవత్పాదులను తీసుకుని రాజవీథులలో తిరిగి మళ్ళీ లోపలికి వచ్చి శంకరులకి రుద్రంతో అభిషేకం చేసి మధ్యాహ్నకాలమునందు షడ్రసోపేతమైన విందారగించి మనం బయలుదేరుతాం. బహుశః ఆరోజు సాయంకాలం ప్రవచనం కూడా ఉంటుందేమో. అందుచేత ఇంత గొప్ప కార్యక్రమాన్ని ఏర్పాటుచేసారు. అందరికీ ఆ పుణ్యం దక్కాలి. ఈ సంవత్సరం, వైశాఖ శుక్ల పంచమినాడు ఇంత గొప్ప ఉత్సవం జరగాలి. ఏదో గుడి కట్టి విడిచిపెట్టడం కాదు. దానికి అంత గొప్పగానూ జరగవలసిందే. అని రెడ్డిగారి సంకల్పం. దానికి ఈశ్వరుడు కటాక్షించాడు. జరుగుతోంది. సరే అందుచేత వారికి కాషాయ వస్త్రాలిచ్చి జ్ఞానదండాన్నిచ్చారు. అదే సత్యదండం అంటారు. ఆ

జ్ఞానదండాన్ని ధరించారు. దండ కమండలాలను పట్టుకున్నారు మహానుభావులు. ఎందుకు సత్యదండం. చేతిలో ఎందుకు పట్టుకుంటారు దండాన్ని. అంటే పశువుని కొట్టవలసి వస్తే మీరు పొద్దున్న మార్నింగ్‌వాక్‌కి వెళ్ళారనుకోండి. మార్నింగ్‌వాక్‌కి వెడితే కుక్క వస్తుందేమోనని హాండ్‌స్టిక్ పట్టుకుని బయలుదేరతారు.

శంకరభగవత్పాదులు ఈ జాతిలో అవతరించేటప్పటికి ఉన్నటువంటి పరిస్థితి ఏమిటో తెలుసాండీ. వేదాలలో ఉన్న మంత్రాలు సిద్ధాంతాలకు ఎవడికి తోచిన భాష్యం వాడు చెప్పుకున్నాడు. ఎవడికి తోచిన పద్ధతి వాడికి గొప్పని చెప్పుకున్నాడు. ఇన్నిటినీ ఆయన ఒక్కరే ఖండించారు. శంకరులు లేనినాడు వేదం ప్రమాణంగా కలిగిన మన మతానికి అస్తిత్వమే లేదు. శంకరులు నిలబెట్టారీమతాన్ని మహానుభావులు అందుకనీ ఆ వేదం ప్రమాణం కాదన్న వారిని, అద్వైతం సత్యం కాదన్న వాడిని తన వాదనా పటిమచేత ఓడించి జ్ఞాన దండం చేత మోది అద్వైతాన్ని ఆవిష్కరించి అద్వైత మతాన్ని సుస్థిరం చేశారు. అద్వైతం శంకరాచార్యులవారు స్థాపించలేదు. జ్ఞానకాండలో ఉన్నదే. వారు వ్యాప్తి చేసారంతే. భారతదేశపు నాలుగు చెరగులా తిరిగి మళ్ళీ వేద విరుద్ధమైన వాదాలు ఈ భారతదేశంలో ప్రవేశించకూడదని తూర్పున జగన్నాథ్‌లో గోవర్ధనపీఠం, పడమర ద్వారకలో కాళికా పీఠం, ఉత్తరాన బదరికాశ్రమంలో జ్యోతిపీఠం, దక్షిణాన శృంగగిరిలో శారదా పీఠం. నాలుగు దిక్కులా నాలుగు పీఠాలు కాపు పెట్టారు. ఇప్పటికీ పరంపరాగతంగా పీఠాలలా నడుస్తూనే ఉన్నాయి. ఎన్నివేల సంవత్సరాలో ఆ శంకరుడే నడిచే దేవుడిగా కాళ్ళు చేతులతో మళ్ళీ మనం దర్శనం చేసుకోవడానికి వీలైన రూపంతో వచ్చాడు అంటారు చంద్రశేఖర పరమాచార్య స్వామిగా. ఎందరో నమ్మారు. ఆయన కూడా అటువంటివారే. మహానుభావులు చంద్రశేఖర పరమాచార్య స్వామి. ఆయన పేరు చెప్తే ఇలా వెంటనే నమస్కారం చేయవలసిందే అటువంటి యతిపురుషులు చంద్రశేఖర పరమాచార్యస్వామి. సరే అందుచేత ఆ

జ్ఞానదండాన్ని పట్టుకుని పరమహంస అని పిలవబడ్డారు. పరమహంస అని ఎందుకు పిలవడం అంటే హంస ఆ పక్షికొక్క దానికే ఒక లక్షణం ఉంటుంది. పాలని నీటిని కలిపి మీరు పాత్రలో అక్కడ పెడితే ఒక కాకి వేరు చేయలేదు. ఒక బాతు వేరు చేయలేదు. ఒక కోడి వేరు చేయలేదు. హంసమాత్రం పాలను త్రాగి నీటిని విడిచిపెట్టేస్తుంది. అలా విడిచి పెట్టగలిగిన లక్షణం ఒక్క హంసకి మాత్రమే ఉంది. జగత్తునుంచి బ్రహ్మాన్ని విడదీసి బ్రహ్మాన్ని దర్శనం చేసి అశాశ్వతమైన జగత్తునుండి వైరాగ్యభావంతో తొలగిపోయేవాడు పరమహంస. శంకర భగవత్పాదులు పరమహంస పరివ్రాజకాచార్య అందుకని బ్రహ్మజ్ఞానంతో బ్రహ్మాన్ని గుర్తెరిగి భాష్యాలిచ్చి లోకాన్ని ఉద్ధరించారు కనుక వారిని పరమహంస అని పిలుస్తారు. పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శ్రీశ్రీశ్రీ శంకరాచార్య అన్న పేరు ఆది శంకరాచార్యులవారిది మొట్టమొదట. అంత మహాపురుషుడు శంకరులంటే. అందుచేత వారు పరమహంసయై జ్ఞానాన్ని చేతబట్టుకుని వేద ప్రమాణాన్ని నిలబెట్టారు. ఇప్పుడు మీరు చెప్పండి. శంకరాచార్యుల వారు లేని నాడు అసలు ఈ వేదం, ఈ గుళ్ళు, ఈ గోపురాలు ఈ అర్చనలు, ఈ పూజలు ఉండి ఉండేవా? లేవు. శంకరులు ఉండబట్టి ఉన్నాయి.

శంకరులంటే శంకరులే. మహానుభావులు. ఆయన లేనినాడు సూర్యుడు లేని రోజు లాంటిదే. ఆయన్ని అందుకే 'నమః శంకర భానవే' అని పిలుస్తారు. సూర్యుడు శంకరుడంటే అంతటి మహానుభావుడు. అందుకని బయలుదేరి ఆయన ఆ గోవిందపాదాచార్యుల దగ్గర శిష్యరికం చేసి బ్రహ్మోపదేశాన్ని పొంది ఆయన దగ్గర విషయాలను తెలుసుకున్న తర్వాత శుశ్రూష చేసిన తర్వాత వారికి ఏం తెలియాలి కనుక అన్నీ తెలుసున్నవారే అప్పుడు ఒక మాట చెప్పారు. నాయనా! చాలా కాలం అయింది. నువ్వు నా దగ్గరికొచ్చి ఉన్నావు. నువ్వు ఎవరో నేనిప్పుడు గుర్తుపట్టాను అన్నారు గోవిందపాదా చార్యులు. ఎప్పుడన్నారో తెలుసాండీ ఈ మాట? నువ్వు ఎవరో నేను గుర్తుపట్టాను అని, ఒకనాడు నర్మదానదికి వరదలొచ్చాయి. వరదలొచ్చి చుట్టు

ప్రక్కలనున్న గ్రామాలనన్నింటినీ కూడా నర్మద ముంచెత్తేస్తోంది. ప్రజలందరూ భోరు భోరున ఏడుస్తున్నారు. శంకరాచార్యులవారు నర్మదానది ఒడ్డుకు వెళ్ళి ఆ నర్మదని స్తవం చేసి తన కమండలాన్ని మంత్రప్రోక్తంగా అందులో ముంచారు. బుడబుడ బుడమని శబ్దమొచ్చింది. ఆనాడు అగస్త్య మహర్షి సముద్రాన్ని తాగేసినట్టు ఆ కమండలం అలాగే ఉంది. బుడబుడ బుడ చప్పుడు వస్తూనే ఉంది. నర్మద వరద నీటినంతటినీ ఆ కమండలం తాగేసింది. తాగేసిన తర్వాత గోవిందపాదాచార్యులవారి మిగిలిన శిష్యులు పరిగెత్తుకుంటూ వెళ్ళారు. అయ్యా! ఆశ్చర్యం చూసారా? కొత్తగా వచ్చిన శిష్యుడు శంకరాచార్యులవారు నర్మదా నది వరదలలో తన కమండలాన్ని ముంచారు. వరదలన్నీ కూడా కమండలంలోకి వెళ్ళిపోయాయి. వరదనీటిని తాగేసింది. ఆయన మంత్రపూరితంగా అందులో ముంచితేను.

ఇది విని 'నాయనా నువ్వు ఎవరో నేను గుర్తు పట్టాను. ఒకనాడు వ్యాస మహర్షి వేదవిభాగం చేసిన తరువాత ఒక సదస్సు నిర్వహించారు. ఆ సదస్సుకు అప్పుడు నేను కూడా వెళ్ళాను. అప్పుడు చాలా చిన్నవాడను. నేను వ్యాసభగవానుని ఒక ప్రశ్న వేసాను. అయ్యా మహానుభావా వేదవిభాగం చేసారు. బ్రహ్మసూత్రాలను రచించారు. కానీ కలియుగంలో ఉండే జీవుల ఆయుర్దాయం బహుస్వల్పం. అందునా వేదాధ్యయనం చేసే అధికారం కొంతమందికే ఉంటుంది. అందునా అన్ని వేదాలను అందరూ నేర్చుకోలేరు. ఒక్క వేదం చదవడమే కష్టం. ఇంక ఆ బ్రహ్మసూత్రాలను ఎవరు చదువుకుంటారు? ఎవరికి తెలుస్తుంది. అందుచేత బ్రహ్మసూత్రాలకు భాష్యాలనిచ్చీ వాటి నిజమైన స్వరూపమేది? వేదంచేత ప్రతిపాదించబడిన పరమ సత్యమైన సిద్ధాంతమేది? అన్నది తెలిసేటట్టుగా భాష్యాన్ని మీరివ్వవలసింది' అని అడిగారు. గోవిందపాదాచార్యులవారు వ్యాసులవారిని. అంటే వ్యాసుడు నవ్వి అన్నారు 'నీ కోరిక చాలా గొప్పదోయి. కానీ అది నేను చెయ్యను. బ్రహ్మసూత్రాలలో ఉండే సారం గ్రహించి భాష్యాలను రచించి

పరమసత్యమైన అద్వైతసిద్ధాంత వ్యాప్తి చేసే మహాపురుషుడు నీకు శిష్యుడుగా వస్తాడు. వాడు నీ శిష్యుడు అని ఎలా గుర్తుపడతావో తెలుసా? నర్మదా వరదలని తన కమండలంలో పట్టేస్తాడు. అలా ఎవరు పట్టాడో వాడే భాష్యాలనిస్తాడు' అన్నారు.

'నాయనా వరదను కమండలంలో పట్టావు. ఇప్పుడు గుర్తుపట్టాను. బ్రహ్మసూత్రాలకు భాష్యమివ్వగల సమర్థుడవు నువ్వే. నువ్వు శంకరుడవు నన్నునుగ్రహించి నాకు శిష్యుడవయ్యావు. అందుచేత ఆశీర్వచనం చేస్తున్నాను. విద్యలకు నిలయం కాశీపట్టణం. కాశీపట్టణం చేరుకుని నువ్వు కొంతకాలమక్కడ వాసం చేసి గంగాస్నానం చేసి విశ్వేశ్వరారాధన చేసి, అమ్మవారిని సేవించి అద్వైత సిద్ధాంత ప్రచారం ప్రారంభించ'మన్నారు. అద్వైతమంటే, ద్వైతమంటే రెండు. అద్వైతమంటే రెండులేవు ఒక్కటే. రెండు లేవనటమెందుకు శంకరాచార్యులవారు. ఒక్కటంటే సరిపోదా? రెండు లేవు అన్నామనుకోండి ఇంకొకడు లేచి మూడున్నాయంటాడు. ఇంకొకడు లేచి నాలుగున్నాయంటాడు. అందుకని శంకరులన్నారు. రెండు కానిది అన్నారు. రెండు కానిది అంటే మూడు కూడా కానిదేగా? నాలుగు కూడా కానిదేగా? అయిదు కూడా కానిదేగా? కాబట్టి ఎన్ని? ఒకటే. అద్వైతం అనగా ఉన్నది ఒక్కటే. రెండు కానిది ఉన్నది ఒక్కటి. అది శంకరుల సిద్ధాంతం. జ్ఞానకాండలో ఉన్నది. శంకరులు కనిపెట్టిందేం కాదది. ఆయన ప్రచారం చేసారు. అద్వైతాన్ని సరే ఆ కాశీపట్టణంలో పండితుల సభలలో అద్వైత ప్రచారాన్ని ప్రారంభంచేసారు. అంతే ఇంక అక్కడినుండి వాడవాడలా ఎంతెంత కొమ్ములు తిరిగిన పండితులు కూడా శంకరులతో రోజులు రోజులు వాదన చేసేవారు. కానీ శంకరుల వాక్పటిమ ముందు వారి శక్తి ముందు, వారి ధారణా బలం ముందు నిలబడలేక ఓడిపోయి అందరూ అద్వైత సిద్ధాంతమే పరమ ప్రామాణికమని అంగీకరించారు. అంగీకరించి లోకమంతా అద్వైతం వేపుకు నడుస్తోంది.

ఒకానొకనాడు గమ్మత్తుగా ఒకరోజు మధ్యాహ్నంవేళ శంకరాచార్యుల వారు గంగానదిలో స్నానం చేయాలని బయలుదేరారు. త్రికాలాలయందు స్నానం చేసి అనుష్ఠానం చేసేవారు. శంకరాచార్యులవారు. మధ్యాహ్నం వేళ నడిచివెళ్తున్నారు. వెడుతుంటే గంగానది ఒడ్డుకు వెడుతుండగా గంగానది వైపునుంచి ఈవలికి ఒక వ్యక్తి వస్తున్నాడు. నాలుగు కుక్కలు వెంటబెట్టు కున్నాడు. బాగా కల్లు తాగినట్టున్నాడు. చూడటానికి వికారమైన స్వరూపం. అంత్యజుడిలా కనబడుతున్నాడు. తూలుతూ వస్తున్నాడు. వస్తుంటే శంకరులన్నారు. దూరంగా తొలగిపో అని. అంటే ఆ వ్యక్తి ఆగిపోయాడు. ఆగిపోయి ఆయనన్నాడు. హవ్వా హవ్వా ఎంతమాట? జగద్గురువు అనిపించు కోవలసినవాడి నోటివెంట రావలసినమాటా ఇది అన్నారు. ఇప్పుడు శంకరులు ఆశ్చర్యపోయారు. ఏమైంది అన్నారు. 'దేన్ని తొలగమంటావు. ఇది పంచ భూతాలతో చేయబడినది నిజమైతే, నీ శరీరం పంచభూతాలతోనే చెయ్యబడింది. అన్నం తినడం చేత ఏర్పడిన అన్న వికారమైతే నీ శరీరమూ అన్నం తినడం చేత ఏర్పడిన అన్న వికారం. నీలో ఉన్నది ఆత్మ అయితే నాలో ఉన్నది ఆత్మ. అంతటా ఉన్నది ఒకే వస్తువని పెద్ద పెద్ద పండితుల ముందు వాదించి గెలిచిన, జగద్గురువు అని అనిపించుకోవలసిన గోవిందపాదా చార్యుల శిష్యుడు వేరొకరిని తొలగిపో' అన్నాడు. ఎవరు తొలగాలి అన్నాడాయన? అడిగితే తెల్లబోయారు శంకరులు. మనీషా పంచకం చేసాడు.

మహానుభావా నువ్వు చెప్పిన సిద్ధాంతంతో ఈక్షణం నేను అంగీకరిస్తున్నాను. నువ్వు సామాన్యుడవు కావు. నువ్వు చెప్పినది పరమ యథార్థం. ఇదీ శంకరాచార్యులవారి వినయం. నువ్వు ఏది అది ఇదీ అన్నవికారమన్నావో అది పరమసత్యం. ఇది చెప్పిన నిన్ను గురువుగా స్మరించి నమస్కరింస్తున్నాను. అందులో ఉన్నది ఆత్మ. ఇందులో ఉన్నది ఆత్మ. ఉన్నది ఆత్మ ఒక్కటే అని చెప్పిన నీమాట పరమ సత్యం. ఇది అంగీకరించి

నమస్కరింస్తున్నాను. కానీ నేను తొలగిపో అన్నది ఆత్మని కాదు. శరీరాన్ని కాదు శరీరాన్ని ఆత్మ అని భ్రమించి ఇంద్రియ లౌల్యంలో పడిన వ్యక్తి అని నిన్ను అనుకున్నాను. అనుకుని తొలగిపో అన్నాను. అజ్ఞానంలో ఉన్నావనుకుని తొలగిపో అన్నాను. ఇంత జ్ఞానివని నేను అనుకోలేదు. అందుకే నీకు నమస్కరిస్తున్నాను అన్నారు. అనేటప్పటికి మహానుభావుడు పరమశివుడు తన దర్శనాన్నిచ్చాడు. వచ్చినవాడు పరమశివుడు. అప్పుడు జీవబ్రహ్మైక్య సిద్ధాంతం చేత అంతటా పరివ్యాప్తమయిన ఆత్మదర్శనం చేయగల స్థితిని నువ్వు పొందావు కనుక నువ్వు ఇకనుంచి బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయడం ప్రారంభం చేయమని చెప్పారు. అప్పుడు బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయడానికి వారు ఎంచుకున్న ప్రదేశం ఏమిటో తెలుసాండి. బదరీ వెళ్ళారు. ఇప్పటికీ మనం బదరీ వెళ్తున్నామనుకోండి. మనకు ఓ మాట చెప్తారు. ఏమండీ అక్కడ మంచు పడిపోతూ ఉంటుంది. పెద్ద పెద్ద మంచు శిలలు పడిపోతాయి. ఆక్సిజన్ తగ్గిపోతుంది. ఊపిరి అందదు చాలా కష్టం. బస్సులు వెళ్ళవు అని. బదరీకి పరమ యథార్థమైన ఒక రహస్యం ఉంది. వైరాగ్య సంపత్తి తగినంత లేని వాళ్ళతో కలిసి బయలుదేరినా ఒక్కడూ వెడుతున్నప్పుడైనా వాడికి తగినంత వైరాగ్యం లేదని ఈశ్వరుడు భావించినా బదరీలోకి రానివ్వడు. వాడు ఎక్కడో ఉండిపోయి తిరిగి వెళ్ళిపోతాడు. అందుచేత బదరీ క్షేత్రంలో ప్రవేశించటమంటే వైరాగ్యం ఉండాలి. బదరీ ఇప్పుడంటే ఇంకా బస్సులు వెళుతున్నాయండీ. అప్పుడవేవీ లేవు. కనబడిన ఫలాలు తింటూ పువ్వులతో అర్చన చేసుకుంటూ మధుర జలాలు తాగుతూ సన్నటి మంచు చరియల్లోనుంచి కాలినడకన తన శిష్యులతో కలిసి శంకరభగవత్పాదులు బదరీ క్షేత్రానికి బయలుదేరారు. అక్కడ కూర్చుని బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయాలని. కాశీపట్టణంలో ఉండగానే ఏమి భక్తండి మహానుభావుడిది. మనం అందరం అడుగుతాం అన్నపూర్ణాదేవి దగ్గరికి వెళితే మాకేం కావాలి. 'అంబా శాంభవి చంద్రమౌళిరబలా........ కాత్యాయనీ భైరవీ' అని అమ్మా మాకు ఏదో అన్నం ఇవ్వు, వస్త్రం ఇవ్వు అని

అడుగుతాం. శంకరాచార్యులవారు ఏమడిగారు. 'జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాందేహిచ పార్వతీ'. అమ్మా నాకేమిస్తావో తెలుసా? జ్ఞాన వైరాగ్యాల నివ్వమ్మా. అన్నం నువ్వు ఎలాగో ఇస్తావు. నేను నిన్ను ప్రత్యేకం అడిగేది ఏమిటో తెలుసా తల్లీ? నాకు జ్ఞాన వైరాగ్యాలను ఇయ్యమ్మా అని అడిగారు. కాశీలో ముందు ఇది కోరినవాడు బదరీ చేరగలడేమో అని నేను అనుకుంటున్నాను.

ఆ బదరీ క్షేత్రానికి చేరుకోబోయేముందు కాశీపట్టణంలో ఒక గమ్మత్తు జరిగింది. శంకరాచార్యులవారి వద్దకు ఒకనాడు సునందుడు అనబడే ఒక వ్యక్తి వచ్చాడు. బ్రహ్మతేజస్సుతో విరాజిల్లుతున్నాడు. 'అయ్యా నేను మీ శిష్యుడినౌతాను' అనిఅడిగారు. 'శంకరులు నువ్వు ఎవరు అని అడిగారు.' నేను కావేరీ తీరంలో ఉండే బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాను. నన్ను సునందుడు అంటారు. నాకు శిష్యరికమి'మ్మని అడిగాడు. అడిగితే ఆయనకి శిష్యరికమిచ్చారు. శంకరాచార్యుల వారి దగ్గర శిష్యరికం చేసేవారు.

బదరీ క్షేత్రానికి వెళ్ళిపోయిన తర్వాత ఎక్కువగా సునందుడితో శంకరాచార్యులవారు మాట్లాడుతుండేవారు. భాష్యం వ్రాసేటప్పుడు ఆయనంటే ప్రీతి శంకరాచార్యులవారికి. అస్తమానం ఆయనతో మాట్లాడతారు మనతో మాట్లాడరు. అది శంకరులకి పక్షపాతం అన్నారు. మిగిలిన శిష్యులు. లోకానికి గుడ్డిచూపే. సరిఅయిన చూపు ఉండదు. శంకరుల శిష్యుల్లో కూడా ఈ భావం వచ్చింది. వస్తే శంకరాచార్యులవారు ఆ సునందుని గొప్పతనమేమిటో మిగిలిన శిష్యులకి చూపించాలనుకున్నారు.

ఒకరోజున శంకరులు కూర్చుని ఉన్నారు. మిగిలిన శిష్యులందరూ ఆయన పక్కన కూర్చున్నారు. మందాకినీ అన్న పేరుతో గంగానది ప్రవహిస్తున్నది. అలకనంద అని పిలుస్తూంటాం కదా. ఝరితో వెళ్ళి పోతుంటుంది. చాలా తీవ్రమైన వేగంతో వెడుతుంది గంగ అక్కడ. దానికి

అటువైపు సునందుడు నిలబడి ఉన్నాడు. శిష్యులతో మాట్లాడుతున్న శంకరులు హఠాత్తుగా, 'నాయనా సునందా! తొందరగా రా!' అన్నారు. ఈ మాట విన్నాడాయన. గురువు తొందరగా రా అన్నారు. గంగని ఎలా దాటటం. తొందరగా గురువు దగ్గరికి వెళ్ళిపోవాలి. గురువు పాదపద్మాలను మనసులో తలచుకుంటూ గంగమీద పరిగెత్తారు. గురువు పాదపద్మాలను అంతగా ఉపాసన చేసినవాడు కనుక ఆయన పాదాలు నీటిలో మునిగి పోకుండా గంగ పద్మాలు పట్టి ఆయన పాదాలు పట్టింది. పడితే ఆవల ఒడ్డుకు చేరుకున్నాడు. కాళ్ళకింద పద్మాలు వచ్చాయని ఆయనకి తెలియదు. ఆవల ఒడ్డుకు చేరిన తర్వాత శిష్యులు చూసి తెల్లబోయారు. శంకరులు లేచి కౌగిలించు కున్నారు. నాయనా గురుభక్తి నీది. ఇది నిరూపించటానికి నిన్నలా పిలిచాను. నీవు గంగమీద నడుస్తుంటే పద్మాలు నీ పాదాలు పట్టాయి కనుక నిన్ను ఇవాళ నుంచి పద్మపాదాచార్యుడు అని పిలుస్తారు. ఆ విధంగా సునందునికి పద్మపాదుడు అని పేరొచ్చింది.

పద్మపాదుడి జీవితంలో ఒక గమ్మత్తైన సంఘటన జరిగింది. గురువు పట్ల విశ్వాసమున్న పద్మపాదాచార్యులవారు శంకరులు కొంతకాలం తర్వాత దక్షిణ భారత దేశానికి వచ్చారు. శృంగగిరి పీఠంలో ఉన్నారు సురేశ్వరాచార్యుల వారు. వారికి పీఠాధిపత్యం ఇచ్చినప్పుడు పద్మపాదాచార్యుల వారు వెళ్ళి అడిగారు. అయ్యా నేను తీర్థయాత్ర వెళదామనుకుంటున్నాను అని అడిగారు. అంటే శంకరాచార్యులవారు అన్నారు. 'ఎందుకురా నాయనా తీర్థయాత్ర తీర్థయాత్రల్లో దొంగలుంటారు. వేళపట్టున స్నానం దొరకదు. అనవసర ప్రసంగాలు ఎక్కువగా ఉంటాయి. సరియైన శౌచం కలిగిన ఆహారం దొరకదు. అన్నివేళలా భగవన్నామం చేసుకోవటానికి కుదరదు. దీర్ఘమైన ప్రయాణం చేస్తున్నప్పుడు సరియైన నీరు దొరకదు. అందుచేత శరీరానికి రుగ్మతలు ఏర్పడతాయి. వీటన్నింటి చేత బ్రహ్మమునందు మనస్సు నిలబడడంలో తేడా వస్తుంది. గురువు పాదాల కన్నా గొప్పవి ఏవీ లేవు. అందుకని నువ్వు

ఆశ్రమంలోనే ఉండి శుశ్రూష చేస్తూ నా బోధ వింటూ తరించు' అన్నారు. అంటే పద్మపాదులన్నారు. 'అలాక్కాదు గురువుగారూ లోకజ్ఞానం కావాలంటే ఒక్కసారి దేశాటనం చేయాలి కదా అందుకని నేను ఒక్కసారి ఉత్తర భారతదేశం, దక్షిణభారతదేశం పర్యటన చేయాలనుకుంటున్నాను. మీరు దయతో అంగీకరించండి' అన్నారు. 'సరే నువ్వంతగా వెళ్ళుతానంటున్నావు కాబట్టి నిన్ను అనుగ్రహిస్తున్నాను కానీ చాలా జాగ్రత్త సుమా! తస్మాత్ జాగ్రత జాగ్రత క్షేమంగా వెళ్ళిరా' అని ఆశీర్వచనం చేసి పంపారు.

పద్మపాదాచార్యులవారు ఉత్తరభారతదేశం వెళ్ళి తీర్థయాత్రంతా పూర్తిచేసుకుని దక్షిణభారతదేశానికి వచ్చారు. కాళహస్తిలో శివలింగాన్ని అర్చించారు. ఆ తర్వాత క్రిందనున్న విష్ణుక్షేత్రాన్ని ఆరాధించారు. కంచి వెళ్ళారు. అక్కడ వరదరాజస్వామిని,శంకరుని క్షేత్రాన్ని వీటన్నింటినీ సందర్శించారు. సేతుబంధనానికి వెళుతున్నారు రామేశ్వరానికి వెళుతూ వెళుతూ మార్గమధ్యంలో కావేరీ నదిలో స్నానం చేసారు. ఆ కావేరీ నది పక్కనే వాళ్ళ ఊరు ఉంది అక్కడ పద్మపాదాచార్యులవారి మేనమామ ఉన్నారు. అప్పటికి పద్మపాదాచార్యులవారు సన్యసించారు. బ్రహ్మచారిగా ఉండగా ఇక్కడ తిరుగుతూ ఉండేవారు పిల్లవాడు, మళ్ళీ ఇన్ని సంవత్సరాలకి సన్యాసిగా వచ్చాడు అని మురిసిపోయి 'నాయనా నీ అనుష్ఠానానికి ఏ ఇబ్బంది లేకుండా మా ఇంట్లో ఏర్పాటు చేస్తాను. నువ్వు భిక్ష తీసుకుని కొన్నాళ్ళుండి నువ్వు శంకరుల దగ్గర నేర్చుకున్న విషయాలు మా అందరికీ చెప్పి వెళ్లవలసినది' అన్నారు. కానీ పద్మపాదాచార్యుల వారి మేనమామగారు మీమాంసా మతానికి చెందినవాడు. ఆయన అద్వైత సిద్ధాంతాన్ని అంగీకరించేవాడు కాదు. శంకరభగవత్పాదులు చేసే భాష్యానికి టీక వ్రాసారు పద్మపాదాచార్యులవారు. అది ఎవ్వరూ చేయలేకపోయారు. ఒక్క పద్మపాదులే వ్రాసారు. ఆ వ్రాసిన టీక పుస్తకం పద్మపాదాచార్యులవారు తనతో పట్టుకుని వెళ్ళారు. ఆ పుస్తకం తీసి చదువుతున్నారు అందులోనుంచి శంకరుల అద్వైత సిద్ధాంత బ్రహ్మసూత్ర

భాష్యానికి టీక చదివారు. మేనమామ గారు తెల్లబోయారు. ఏమి గురుకటాక్షంరా వీడికి. వీడితో వాదించటం కుదరదు. అపారమైన ప్రజ్ఞాశాలి అయిపోయాడు. వాదిస్తే ఓడిపోతాం. వాదించకపోతే వీడు మిగిలిన మతాల్ని ఖండిస్తాడు. అద్వైతాన్ని వ్యాప్తి చేసేస్తాడు. ఎందుకనంటే వీడికి శక్తి ఎక్కువయిపోయింది. శంకరుల శిష్యరికం చేసాడు. ఎల్లాగయినా అద్వైతమత వ్యాప్తి జరగకుండా వీడిని ఎల్లాగో అల్లా పాడు చేయాలి. అనుకున్నారు ఆయన.అని సంకల్పం చేసి సమయం కోసం నిరీక్షిస్తున్నారు. ఈ పుస్తకం నేను చదువుతాను నాకిమ్మని పట్టుకెళ్ళి ఇంట్లో కూర్చుని దాన్ని చదువుతున్నాననేవారు.

పాపం పద్మపాదాచార్యుల వారు రామేశ్వరం వెళ్ళిపోయే సమయం వచ్చింది. ఆయన అన్నారు 'అయ్యా మీ దగ్గర ఉంచుకుని ఆ పుస్తకాన్ని చదవండీ. నా జీవితంలో శంకరుల శిష్యరికం చేసి నేర్చుకున్న సమస్త విషయాలను ఆ టీకలో పెట్టాను. ఆ పుస్తకం నా ప్రాణంతో సమానం. అది పోయిననాడు పద్మపాదుడు ఉన్నా ఒకటే. వెళ్ళిపోయినా ఒకటే. అందుకని మీరు దాన్ని మాత్రం చాలా జాగ్రత్తగా భద్రం చేయండి' అని చెప్పి రామేశ్వరానికి వెళ్లిపోయాడు. వెళ్ళిపోయి రామేశ్వరం నుంచి తిరిగొస్తున్నాడు. వచ్చేస్తున్నాడు పద్మపాదుడని తెలుసుకుని ఈ పుస్తకం దక్కకూడదని అంటే ఆ రోజుల్లో ఇంకో ఎడిషన్ ఉండదాండీ? అంటే తాళపత్ర గ్రంథాలు అన్ని పుస్తకాలు ఉండేవి కావు. ఆ పుస్తకాన్ని పద్మపాదాచార్యుల వారి మేనమామగారు తన ఇంట్లో పెట్టి తన ఇల్లు తానే అంటించేసుకున్నాడు. ఇల్లూ కాలిపోయింది పుస్తకం కాలిపోయింది. మేనల్లుడు వచ్చిన తర్వాత 'నువ్వు నాకంత అప్పచెప్పావు. కానీ ఆ గ్రంథం కాలిపోయింది. నా ఇల్లు కూడా కాలిపోయిం'దని ఏడుపు మొదలుపెట్టాడు.

పాపం పద్మపాదాచార్యులవారు తెలియక 'అయ్యో పుస్తకం కాలిపోయిందని ఏడుస్తున్నావు.నాకు బాధే కానీ నీ ఇల్లు కాలిపోయింది నేను

దానికి విచారిస్తున్నాను. బెంగపెట్టుకోకు' అన్నారు. 'నాకు నా గురువుల ఆశీర్వచన బలం ఉంది. అందుచేత కాలిపోయిన గ్రంథంలో నేను ఏమి వ్రాసానో అవి అక్షరం తప్పిపోకుండా మళ్ళీ వ్రాసేస్తా'నని మళ్ళీ వ్రాసేయడం మొదలు పెట్టాడు. కొన్ని పేజీలయ్యాక మేనమామ గారు తీసుకు చదివారు. అక్షర భ్రష్టత్వం లేకుండా పూర్వం ఎలా ఉందో అలాగే ఉంది. అమ్మ బాబోయ్ పుస్తకం మళ్ళీ పూర్తయిందంటే ప్రమాదం వస్తుందని బుద్ధికి మాంద్యం వచ్చేటట్టుగా అన్నంలో మందు పెట్టి పెట్టేసారు పద్మపాదాచార్యులవారికి. పద్మపాదులు అది తినేసారు. తినేసిన తర్వాత ఇంక ఏమీ జ్ఞాపకానికి వచ్చేవి కావు. పుస్తకమేమిటి ప్రార్థనా శ్లోకమే జ్ఞాపకానికి రావటం మానేసింది. దేనిమీద బుద్ధి నిలబడదు. జ్ఞాపకానికి రాదు. స్ఫురణ పోయింది. మాట్లాడలేరు. దేన్నీ కూడా తర్కం చేయలేరు. అసమాన ప్రతిభతో ఉదాహరణ చూపించలేరు. బుద్ధికి మాంద్యం వచ్చేసింది. తెలుసుకున్నారు ఏదో ప్రమాదం జరిగిందని. 'నా గురువు వెళ్ళవద్దు తీర్థయాత్ర అని చెప్పారు. నేను బయలుదేరాను. నా గురువు వద్దన్నప్పుడు ఆగిపోయి ఉంటే నాకీ ప్రమాదం వచ్చి ఉండేది కాదు. నా గురువు గుర్తుపట్టారు. నేనే గురువుల మాటవినలేదు. ప్రమాదంలో పడ్డా'నని శంకరులు ఎక్కడ ఉన్నారని కనుక్కున్నారు.

శంకరాచార్యులవారు అప్పుడే తల్లిగారికి సంస్కారంచేయటానికి దక్షిణభారతదేశం వచ్చారు. సంస్కారం చేసి వారు కేరళ రాష్ట్రంలో పర్యటిస్తున్నారు. ఒక విష్ణ్వాలయంలో ఉన్నారాసమయంలో ఇది తెలిసి పద్మపాదాచార్యుల వారు పరిగెత్తుకుంటూ ఆ విష్ణ్వాలయం చేరుకుని శంకరాచార్యుల వారి పాదాల మీద పడ్డారు. 'మహానుభావా మీరు నాయందు అపారమైన కరుణతో నాకు చేసిన బోధని ఆధారం చేసుకుని టీక రచించాను. కానీ నా మేనమామ నా యందున్న పక్షపాత బుద్ధిచేత ఆ గ్రంథాన్ని కాల్చేసాడు. సరికదా నా బుద్ధికి మాంద్యం వచ్చేటట్టుగా మందు పెట్టి అన్నం పెట్టేసాడు. అందుకని ఇప్పుడు నాకేమీ స్ఫురణలో లేవు. నాకేమీ జ్ఞాపకం రావట్లేదు.

మీరు వద్దంటే యాత్రకి వెళ్ళాను. ఇప్పుడు నాకు కేవలం మీ చరణ కమలాలే ఆధారం. నన్ను మన్నించండి గురుదేవా?' అని శంకరుల పాదాల మీద పడ్డాడు. శంకరులన్నారు 'ఎందుకు నాన్నా అంత బెంగపెట్టుకుంటావు?' అని చెయ్యి ఒక్కసారి ఆయన శిరస్సుమీద. ఉంచి, 'లే! నీకు గుర్తుందా? మనం శృంగేరీ పీఠంలో కూర్చున్నప్పుడు నేను వ్రాసిన టీక వినండి అని ఒకసారి నువ్వు నా పక్కన కూర్చుని ఆ పుస్తకం చదివావు. నేను విన్నాను. కాబట్టి ఇప్పుడు మళ్ళీ చెప్పేస్తాను వ్రాసుకో' అన్నారు.

ఒక అక్షరం పొల్లుపోకుండా పద్మపాదులు ఆనాడు ఏది వ్రాసారో అది మొదటినుంచి చివరి వరకు కొన్ని వేల పేజీల టీక మళ్ళీ చెప్పేసారు శంకరాచార్యులవారు. చెప్పేస్తే పద్మపాదుల వారు వ్రాసేసాడు. మళ్లీ బుద్ధి వైభవం ప్రకాశించింది. అలా శిష్యుణ్ణి కాపాడుకున్నారు. శంకరులంటే మాటలాండీ. వారిని తలచుకున్నంత మాత్రం చేత వారి పాదాలకు 'భవశంకర దేశిక మే శరణం' అన్నంత మాత్రంచేత మనకి రాబోయే అన్ని ప్రమాదాలనుంచి గట్టెక్కించగలిగిన జగద్గురువు స్వరూపం అది. అంతటి మహానుభావుడు. అందుకే తోటకాచార్యులవారు మనయందు కరుణతో ఆ తోటకాష్టకాన్ని ఇచ్చారు.

తదనంతరం బదరీలో కూర్చుని శంకరభగవత్పాదులు వ్యాసభగవానుడు రచించిన బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానం చేసారు. భాష్యాలంటారు వాటిని. అవి చాలా విశేషమైన పాండితీ ప్రకర్ష ఉన్నవాళ్ళకే అందే స్వరూపంతో ఉంటాయి. ఎందుకంటే అంతా వేదాంతపరమైన ప్రక్రియ. వాటికి భాష్యాలు చేద్దామన్నంత సాహసం ఎవరూ చేయలేరు. కానీ శంకరాచార్యులవారు మాత్రం వ్యాసకృతమైన బ్రహ్మసూత్రాలకు భాష్యాన్ని వెలయించారు. ప్రతిరోజూ చక్కగా అక్కడ ఉండే నదిలో స్నానం చేయటం. నిత్యకార్యక్రమాలన్నీ పూర్తిచేసుకోవటం. శిష్యుల్ని చుట్టూ కూర్చో పెట్టుకోవడం. బ్రహ్మ సూత్ర భాష్యాన్ని తన శిష్యులందరికీ వివరించడం. తన శిష్యులు ఏవైనా ప్రశ్నలు వేస్తే ప్రశ్నలకి

సమాధానం చెప్పటం. తదనంతరం కాసేపు ఏదో భిక్ష స్వీకరించటం ఇలా పరమసంతోషంగా కాలం గడిచిపోతోంది.

ఒకానొకనాడు తన శిష్యులందరికీ బ్రహ్మసూత్ర భాష్యాన్ని చెప్పి శంకరులు భిక్ష కోసమని పైకి లేస్తున్నారు. ఆ సమయంలో అపూర్వమైన తేజో సంపన్నుడు ఎఱ్ఱటి జడలు కట్టుకున్న ఒక వ్యక్తి వచ్చాడు. ఒంటినిండా విభూతి అలదుకుని మెఱుపు తీగ ఎలా ఉంటుందో అలాంటి శరీరచ్ఛాయతో రుద్రాక్షలు ధరించిన వాడై వచ్చి శంకర భగవత్పాదులను పలకరించారు. అయ్యా మీరు ఏంచేస్తున్నారు అని. అడిగితే శిష్యులు చెప్పారు. మా గురువులు సాక్షాత్తుగా జ్ఞానమునందు సూర్యభగవానుడు. ఉపనిషత్తులన్నీ ఆయనకు కరతలామలకం. కేవలాద్వైత స్వరూపంగా ఉపనిషత్తుల సారమైన బ్రహ్మసూత్రాలకు భాష్యాలు రచించారు. ఆ భాష్యాలను మాకు ప్రతిరోజూ నేర్పుతుంటారు. మా గురువరేణ్యులు శంకరయతీంద్రులు. వారిపేరు శంకరభగవత్పాదులు అని చెబితే ఆ వచ్చిన పెద్దమనిషి అన్నారు. ఓహో! వ్యాసభగవానుడు రచించిన బ్రహ్మసూత్రాలకి భాష్యం చేసావా? ఏది నేనొక సూత్రం అడుగుతాను. ఆ సూత్రానికి నువ్వు ఏం భాష్యం చెప్పావో చెప్పు. అని బ్రహ్మ సూత్రాల్లో మూడవ అధ్యాయం నుంచి ఒక సూత్రాన్ని తీసుకున్నారు. అది చాలా కష్టమైన సూత్రం అంటారు. ఆ సూత్రాన్ని తీసుకుని దానిమీద నువ్వు చెప్పిన భాష్యం చెప్పమన్నారు. అంటే శంకరభగవత్పాదులు తాను చేసిన భాష్యాన్ని చెప్పారు. దానిమీద వచ్చిన వ్యక్తి వాదనకి దిగాడు.

ఇద్దరిమధ్యా విశేషమైన వాదన నడుస్తోంది. ఎంతకీ ఆ వాదన తెగదు. ఒకరిని మించి ఒకరు మాట్లాడుతున్నారు. పద్మపాదాచార్యుల వారు చూసారు. ఎంత గొప్పగా వాదించుకుంటున్నారా వీళ్ళిద్దరూ అసలు ఎవరు వీళ్లిద్దరూ? అని దగ్గరికొచ్చి పరిశీలనాత్మకమైన దృష్టితో చూసారు. చూస్తే పద్మపాదాచార్యుల వారి అదృష్టం వారి కర్థమైంది వారిద్దరూ ఎవరో. 'శంకర శ్శంకరస్య సాక్షాత్ వ్యాసో నారాయణస్స్వయం. తయోర్ వివాదే సంప్రాప్తే కిం కరోమి'. అన్నారు

ఇవతల పక్కన కూర్చుని బ్రహ్మసూత్ర భాష్యం చేసిన వారు సాక్షాత్తుగా శంకర స్వరూపుడైన శంకరాచార్యులవారు. అటు కూర్చుని బ్రహ్మసూత్రాల గురించి మాట్లాడుతున్నవారు సాక్షాత్తుగా నారాయణ స్వరూపుడైన వేదవ్యాస భగవానుడు. వ్యాసుడే ఆ రూపంలో వచ్చారు. జడలు ఎఱ్ఱగా ఉంటే జుట్టు ఎఱ్ఱగా ఉండి రంగేసుకున్నదాని గురించి నేను ప్రస్తావన చేయడంలేదు. జడలు కట్టి జుట్టు ఎఱ్ఱగా ఉండి అపారమైన తేజోవంతమై బంగారు కాంతితో మెరిసి పోతూంటే వారు అపారమైన తపశ్శక్తి సంపన్నులు అని గుర్తు. అందుకే వ్యాసులవారి జుట్టు నల్లగా ఉండదు. ఆయనకి అరుణజటేశ్వరుడు అని పేరు. ఆ వచ్చిన వాడు ఎవరో గుర్తుపట్టారు. ఆయన సాక్షాత్తుగా బ్రహ్మసూత్రాలను రచించిన వేదవ్యాసుడే. భాష్యం రచించినవారు శివాంశ సంభూతుడైన శంకరాచార్యులవారు.

శివకేశవులు ఇద్దరూ కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఎంత రమణీయమైన సన్నివేశమది. ఒక పరబ్రహ్మం రెండుగా కూర్చుంది. కూర్చుని మాట్లాడుతోంది. ఇది చూసి పద్మపాదాచార్యులవారు అన్నారు. ఆయనేమో శంకరుడు. మీరేమో కేశవుడు. 'తయోర్వివాదే సంప్రాప్తే' మీఇద్దరూ మాట్లాడుకుంటున్నారు ఒక విషయం గురించి ఎలా? ఒకరి మీద ఒకరు ఎత్తులు వేసి మాట్లాడుతున్నారు. ఇంతలా మాట్లాడుకుంటుంటే 'కింకరః కింకరోహ్యహం.' మేం కింకరులం మాకు ఏం అర్థమవుతుంది. మేం ఏంచేస్తాం. విని సంతోషిస్తాం అన్నాడు.

అప్పుడు శంకరులు పరిశీలనాత్మకంగా చూసారు. చూస్తే వ్యాస భగవానుని దర్శనం అయింది. శంకరాచార్యుల వారు దర్శనం పొందిన వ్యాసుని స్వరూపం ఏమిటో తెలుసాండి. పద్మాసనం వేసుకుని కూర్చున్న వ్యాసభగవానుని దర్శనం కాదు. ఒంటినిండా విభూతినలదుకుని ఎఱ్ఱని శరీరచ్ఛాయతో విభూతి పుండ్రములు పెట్టుకుని మెడనిండా రుద్రాక్షలు వేసుకుని పరమశివుని తొడమీద కూర్చున్న వ్యాసభగవానుడు దర్శనమయ్యాడు

శంకరులకి. ఎక్కడుంది తేడా? 'శివస్య హృదయం విష్ణుర్విష్ణోః స్య హృదయం శివః యథాశివం మయో విష్ణుం' ఇలా రోజూ సంధ్యావందనంలో చెప్తున్నాం కదా శివకేశవుల మధ్య భేదాభిప్రాయం నా హృదయంలో అంకురించకుండా ఉండుగాక అని. అలా దర్శనమిచ్చారు. శంకరులు సదాశివుడిగా లేరు. ఎలా ఉన్నారు. యతిపురుషుడిగా ఉన్నారు. దర్శనమిచ్చినవాడెవ్వరు. వ్యాస భగవానుడు, అందుకని శంకరులు వెంటనే ప్రణిపాతం చేసారు. ప్రణిపాతం చేసి వ్యాసభగవానుని స్తోత్రంచేసారు.

'మహానుభావా నువ్వు లోకంలో కృష్ణద్వైపాయనుడనే పేరుతో వ్యాసుడవై లోకాన్ని కాపాడినవాడివి. అందుకే నిన్ను ఓం కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితేరతం వేదార్థభాస్కరం వందే' అని పిలుస్తారు. శమాది గుణనిలయం అని ఆయన శమాది సంపత్తికంతటికీ కూడా నిలయమైనవాడు. వేదార్థభాస్కరం వందే. వేదం అనే తామరపువ్వు వ్యాసుడు అనే సూర్యుని కిరణంచేత విచ్చుకుంటోంది. కృష్ణద్వైపాయనం వందే. ఓ కృష్ణద్వైపాయనా నీకు నమస్కరిస్తున్నాను. సర్వలోక హితే రతం. నువ్వు సర్వలోకానికి హితము చేసినవాడివి. ఎందుకని? వేదవిభాగంచేసి పద్ధెనిమిది పురాణాలు ఇచ్చాడాయన.

వ్యాసుడు పరమప్రీతిని పొందారు. 'నాయనా నేను బ్రహ్మసూత్రాలను రచించాను. కానీ ఆ బ్రహ్మసూత్రాలకు భాష్యం చెప్పగలిగినవాడు దొరుకుతాడా అని ఎప్పటినుంచో ఎదురు చూస్తున్నాను. బ్రహ్మసూత్రాలను నేను ఏదృష్టితో రచించానో ఆ దృష్టితో కేవలాద్వైత స్వరూపంగా నువ్వు భాష్యాలిచ్చావు. నేను ఎంతో ఆనందిస్తున్నాను' అంటే శంకరభగవత్పాదులన్నారు. 'నేను కూడా మీ దర్శనం కోసమే ఎదురుచూస్తున్నాను.నాకు మొట్టమొదట ఎనిమిది సంవత్సరాలతో నా జీవితం అయిపోయింది. ఎందుకంటే ఎనిమిది సంవత్సరాలలో ఈ లోకంలో ఉన్న సమస్త వాఙ్మయాన్ని ఆపోసన పట్టేసాను. ఆ తర్వాత ఇంకొక ఎనిమిది సంవత్సరాలు సన్యాసిగా ఉన్నాను.

బ్రహ్మసూత్రాలకు భాష్యం ఇమ్మని గురువుగారు చెప్పారు కనుక. అందుకని పదహారేళ్ళతో భాష్యమిమ్మని నాగురువైన గోవిందపాదాచార్యులవారు ఇచ్చిన ఆజ్ఞ పూర్తయిపోయింది కనుక నేను మీ పాదపద్మాలను మనసులో స్మరిస్తూ ఈ శరీరాన్ని విడిచి పెట్టేయాలని అనుకుంటున్నాను' అన్నారు.

మీరు చాలా జాగ్రత్తగా గుర్తు పెట్టుకోండి అద్వైత మార్గమునందు ప్రయాణించేవాడికి శరీరమునందు ధ్యాస ఉండదు. అంటే వ్యాసుడు అన్నారు. 'నువ్వు పదహారో సంవత్సరం వచ్చిందని శరీరం వదిలి పెట్టేస్తే ఇంత భాష్యాన్ని ఎవరు ప్రచారం చేస్తారు. ఈ భాష్యాన్ని ప్రచారం చేయడం వేరొకరికి సాధ్యంకాదు. శంకరా నేను నీకు మూడు వరాలు ఇస్తున్నాను. ఏమిటో తెలుసా? ఒకటి పదహారు సంవత్సరాలు మాత్రమే నీ ఆయుర్దాయం. కానీ నీ ఆయుర్దాయాన్ని వేరొక పదహారు సంవత్సరాలు నేను పెంచుతున్నాను. బ్రహ్మగారి వ్రాతని తుడిచి. కాదు శంకరుడి ఆజ్ఞని దాటి'. వ్యాసుడంటే అంత గొప్పవాడు. మహానుభావుడు. అందుకని 'ఇంకొక పదహారు సంవత్సరాల ఆయుర్దాయం ఇస్తున్నాను. రెండు ఈ పదహారు సంవత్సరాల ఆయుర్దాయంలో వేదంలో ఉండే అనేకరకాలైన మంత్రాలకు, వేదాల ప్రమాణాలకు వ్యతిరిక్తంగా ఎవడి ఇష్టమొచ్చిన రీతిలో వాడు చెప్పుకున్న అన్ని సిద్ధాంతాలను ఖండించి జ్ఞానభాస్కరుడవై కేవలాద్వైత సిద్ధాంతాన్ని ప్రచారం చేయాలి. మూడు నీవు రచించిన భాష్యాలు వేదంలో చెప్పబడిన బ్రహ్మసూత్రాలకు ఖచ్చితమైన యథార్థమైన భాష్యాలు కనుక సూర్యచంద్రులు ఎంతకాలం ఉంటారో, నక్షత్రాలు ఎంతకాలం ఉంటాయో అంతకాలం ఈ భాష్యాలు ప్రపంచంలో ఉంటాయి.' ఎవరు ఆ భాష్యాలకు నమస్కారం చేస్తారో ఎవరు భాష్యాలను చదువుకుంటారో? ఎవరు శంకరులను గురువుగా పెట్టుకుంటారో అందుకే లోకంలో ఒక నానుడి ఉంది. గురువు లేనివాడు శంకరాచార్యుల వారిని గురువుగా పెట్టేసుకోవచ్చు. గురువుగా వరించవచ్చు శంకరాచార్యులవారిని. అది ఒక్క జగద్గురువులు శంకరుల విషయంలో మాత్రమే ఉంది ఆ అధికారం. అందుకని 'శంకరా

నీకీ మూడు వరాలు ఇస్తున్నాను. అందుచేత నీ సిద్ధాంతాన్ని వ్యాప్తిచేయమ'ని చెప్పారు. చెప్పి అంతర్ధానమైపోయారు వ్యాసభగవానులు.

ఈ భాష్యాలను ప్రచారం చేయాలని తన శిష్యసమేతుడై శంకర భగవత్పాదులు మళ్ళీ వెనక్కి తిరిగి వస్తున్నారు. ప్రయాగ క్షేత్రం కనబడింది. దాని పేరు ప్రయాగ. ప్రయాగ అని ఎందుకు పేరో తెలుసాండి? దానికొక విశేషమైన రహస్యం ఉంది. ప్రయాగలో స్నానంచేసాం ప్రయాగలో స్నానంచేసాం అంటారు. ప్రయాగ అంటే ఏమిటి? ఆ ఊరు పేరు ప్రయాగ కాదు. ఊరు పేరు మీ అందరికీ తెలుసు. రైల్వేస్టేషన్ పేరేమిటో. ప్రయాగ అంటే యాగం, సశాస్త్రీయంగా యాగం చేసిన వాడికి ఎంత పుణ్యమొస్తుందో అంతకన్నా ద్విగుణీకృతమైన పుణ్యం ఏమీ తెలియకపోయినా వెళ్ళి స్నానం చేసినంత మాత్రం చేత ప్రకృష్టమైన యాగఫలితాన్ని ఇయ్యగలిగిన క్షేత్రం కనుక దానికి ప్రయాగ అని పేరు. ఆ ప్రయాగలో శంకరులు స్నానంచేసారు. స్నానం చేసి అక్కడనుంచి బయలుదేరి ఇప్పుడు ఈ భాష్యవ్యాప్తికి అవరోధంగా వస్తున్నది ఏది? అద్వైత స్వరూపం కన్నా భిన్నంగా వ్యాప్తి చేయబడుతున్నది ప్రస్తుతమేదని చూసారు. చూస్తే కర్మ వాదం విపరీతంగా ప్రచారంలో ఉంది. వేదం యొక్క పూర్వభాగం కర్మకాండ. ఉత్తరభాగం జ్ఞానకాండ. శంకరాచార్యులవారు జ్ఞానకాండని బాగా ప్రచారం చేసారు. అంతమాత్రం చేత వారు కర్మకాండను నిరసించలేదు. ఆచార వ్యవహార సంప్రదాయాలకు భిన్నంగా వ్యవహరించమని ఆయనేం చెప్పలేదు. దీనిచేత జ్ఞానాన్ని పొంది మోక్షాన్ని పొందమని చెప్పారు. అందుచేత శంకరభగవత్పాదులు బయలుదేరి కుమారిలభట్టు ఉండే ఊరికి బయలుదేరారు.

కుమారిలభట్టు అంటే ఆయనదొక గమ్మత్తైన జీవితం. ఆయన సాక్షాత్తు సుబ్రమణ్యేశ్వర స్వామి వారి అవతారం. ఆ కుమారిలభట్టు ఎందుకు అవతారం స్వీకరించవలసి వచ్చింది అంటే మీకు సూక్ష్మంగా చెపుతాను దాని గురించి. ఆరోజుల్లో నాస్తికవాదం ప్రచండంగా ఉండేది. నాస్తికవాదమంటే చాలామంది

అనుకుంటారు దేవుడు లేడు దేవుడు లేడు అనేవాడు నాస్తికుడు అనుకుంటార్, దేవుడు లేడు అన్నవాడు నాస్తికుడని శాస్త్రం చెప్పలేదు. వేదం ప్రమాణ్యం కాదు అని ఎవడంటాడో వాడు నాస్తికుడు. శాస్త్రం దృష్టిలో. అందుకని వార్ వేదప్రమాణాన్ని అంగీకరించరు. నాస్తికులలో కూడా మళ్ళీ అయిదు శాఖలున్నాయి. ఆ నాస్తిక వాదాన్ని ఖండించటం కోసమని సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారు కుమారిలభట్టుగా వచ్చారు. వచ్చి అప్పటిలో వైదికమైన మతా వలంబనానికి ఎదురు నిలిచిన నాస్తిక మతాన్ని ఖండించవలసి వచ్చింది. ఖండించాలంటే అసలు నాస్తిక మతంలో గురువులు ఏంచెప్తున్నారు అది ముందీయన తెలుసుకోవాలి. అందుకోసం కుమారిలభట్టు తాను కూడా నాస్తికమతాన్ని అవలంబించాలని అనుకుంటున్నాని చెప్పి నాస్తికమత గురువుల పాదాలు పట్టి సేవించి వారి దగ్గర నాస్తికమత రహస్యాలన్నీ తెలుసుకున్నారు.

ఒకరోజున కుమారిలభట్టు కూర్చునుండగా ఆ శిష్యులందరినీ ఉద్దేశించి గురువు ప్రసంగం చేస్తున్నారు. వేదంలో చెప్పినవి అశాస్త్రీయాలు. అవి ప్రమాణాలు కావు. అవి అబద్ధాలు. వేదం కాదు ప్రమాణం. మన కంటికి కనబడేది ప్రమాణం అని ఆయన వేదాన్ని దుయ్యబడుతూ ప్రసంగం చేస్తున్నారు. వేదమునందు అపారమైన నమ్మకమున్నవారు కుమారిలభట్టు. ఆయన అలా నిందిస్తుంటే వినలేక కుమారిలభట్టు కన్నులవెంట నీరు కారి ఒక చిన్న సరస్సుగా మారింది. శిష్యులు వెనక్కి తిరిగి చూసారు. చూస్తే ధారాపాతంగా వారి కన్నుల వెంట నీరు కారిపోతోంది. వారికి అనుమానం వచ్చింది. ఇంత ఏడుస్తున్నాడంటే వీడు నాస్తికుడు కాదు. వీడు ఖచ్చితంగా వేద ప్రమాణాన్ని అంగీకరించినవాడు. ఎందుకో మన దగ్గరికి చేరాడు. అని అనుమానం వచ్చింది. వాడిమీద గూఢచారులను పెట్టి వాడిగురించి తెలుసుకుందాం. అని ఆయనమీద గూఢచర్యాన్ని నియోగించారు. తెలుసుకుంటే వేదం ప్రమాణాన్ని అంగీకరించినవాడు. మన రహస్యాన్ని తెలుసుకోవడానికి వచ్చాడని తెలిసిపోయింది. అయితే గుట్టు చప్పుడు కాకుండా కుమారిలభట్టుని

చంపేయండి అన్నారు. చంపేయాలంటే ఎలా చంపేయాలని ఆలోచించారు. ఒకరోజున ఆయన ఉన్న భవనం పైభాగంలో మేడమీద పడుకుని నిద్రపోతున్నారు కుమారిలభట్టు. ఆ మిగిలిన శిష్యులందరూ వచ్చి కుమారిల భట్టుని పట్టుకుని తెలివి వచ్చేలోపల గోడమీదనుంచి కిందకి తోసేసారు. అది చాలా ఎత్తైన భవనం. ఆ పైనుంచి కింద పడిపోతున్నారు కుమారిలభట్టు. క్రిందపడుతున్నప్పుడు నాస్తికులందరూ భయపడ్డారు. వీడిని అనవసరంగా తోసాం కిందకి పడిపోతూ వేదం ప్రమాణమైతే నేను బ్రతికెదను గాక అంటున్నాడు. ఒకవేళ ఇప్పుడు కిందపడ్డ తర్వాత వీడు చచ్చిపోకపోతే వేదం ప్రమాణమైపోతుంది. అప్పుడు మనందరి వాదం ఓడిపోతుంది. వీడొక్క మాటతో గెలిచేస్తున్నాడిప్పుడు. మనం చంపుదామనుకుంటే వీడు మనల్ని చంపుతున్నాడు అనుకుంటున్నారు. ఆయన కింద పడ్డారు. కిందపడిన తర్వాత గబుక్కున ఒక్కసారి చీకటి కమ్మినట్టయింది. మరి ఏమిటో తెలియదు. మరి అదేమి గమ్మత్తో చూసుకుంటే ఒక కన్ను పోయింది. ఎందుకు పోయిందని ఆలోచించారు. వారికి ఒక్క దెబ్బతగల్లేదు. ఆరోగ్యం చక్కగా ఉంది. ఏమీ అవ్వలేదు. జీవించారు. కానీ ఒక కన్నుపోయింది. అదీ చీకటికి కారణం. ఎందువల్ల కన్ను పోయిందని ఆలోచించారు. అప్పుడు శ్రుతిమాత ఒక మాటంది. నువ్వు అలా అనకూడదు. వేదమునందు నమ్మకమున్నవాడివైతే వేదమే ప్రమాణం కనుక నేను జీవించెదనుగాక అనాలి. కలదు కలండనెడివాడు కలడోలేడో అన్నట్లు ఎక్కడో చిన్న అనుమానం చూపించావు. అందుకే ఒక కన్ను పోయింది నీకు అన్నది.

ఆ కుమారిలభట్టు తదనంతరం నాస్తికమతాన్ని ఖండించి ఇంత కాలం వాళ్ళు దుష్ప్రచారం చేసి ప్రజలను వేదమార్గంలో నడవకుండా చేసారని రాజుగారి ముందు నిరూపించారని నాస్తికుల్ని ఉరితీసాడు రాజుగారు. కానీ తను నమ్మినదేమిటి? వేదమార్గాన్ని నమ్మారు. నమ్మిన కుమారిలభట్టు ఇంతమంది మరణానికి కారణమయ్యాడు. పైగా నాస్తికమతానికి చెందిన

గురువుగారిని నమ్మించారు. తను శిష్యుడినని. అది కర్మ మార్గంలో ఉండవలసినవాడు ప్రవర్తించ వలసిన విధానమా? తనయందు కూడా దోషముంది కదా? అందుకని నేను చేసిన ఈ రెండు దోషాలకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే ఈ ఫలితాన్ని నాకు భగవంతుడు శిక్ష వేస్తాడు. ఉత్తర జన్మలలో అనుభవించాలి. అందుకని ఇక్కడే ప్రాయశ్చిత్తం చేసుకుంటానని తుషాగ్నిలో కూర్చున్నారు. కూర్చుని తన శరీరాన్ని కాల్చేసుకుంటున్నారు.

ఆసమయానికి శంకరాచార్యులవారు వచ్చారు. అదృష్టమేమిటంటే ఆసమయంలో శంకరుల దర్శనమవ్వటం. శంకరులన్నారూ మీరు కర్మవాదాన్ని వ్యాప్తిచేసారు. కర్మవాదంకన్నా అద్వైతం గొప్పది అని వాదించటానికి నేను వచ్చాను. అందుచేత వాదిద్దాం అన్నారు. అంటే కుమరిలభట్టు అన్నారు ఇంక అవకాశంలేదు. నేను తుషాగ్ని ప్రవేశం చేసేసాను. నా ఒళ్ళు కాలిపోతోంది. అంటే ఎందుకు ప్రవేశంచేసారని అడిగారు. అడిగితే నావల్ల ఈ పొరపాట్లు జరిగాయి. అందుకని ఇక్కడే ప్రాయశ్చిత్తం చేసుకోవటానికి తుషాగ్నిలో కాలుతున్నాను. కొంతసేపట్లో నా ప్రాణాలు పోతాయి. అందుకని వాదం కుదరదు. నా శిష్యుడు మండనమిశ్రుడు ఉన్నాడు మాహిష్మతీ పురంలో. ఆయనతో వాదించమన్నాడు. అంటే శంకరులు మళ్ళీ ఇక్కడనుంచి నార్త్ఇండియా వైపుకు వెళ్ళాలి.

శంకరాచార్యులవారికి యోగవిద్యలన్నీ తెలుసు. వెంటనే యోగ విద్యచేత తాను, తన శిష్యులు ఆకాశమార్గంలో మాహిష్మతీ పురం వెళ్ళిపోయారు. మాహిష్మతీ పురంలో మండనమిశ్రుని ఇంట్లోని దాసీజనం రేవానదిలో కడవలతో నీళ్ళు తెచ్చుకుంటున్నారు. శంకరులు వారిని మండనమిశ్రుని ఇల్లు ఎక్కడ అని అడిగారు. వారు 'ఏ ఇంటిముందు చిలుకలు పంజరాలలో కూర్చుని వేదము స్వతః ప్రమాణమా? పరతః ప్రమాణమా? అంటే పౌరుషేయమా? అపౌరుషేయమా? పౌరుషేయమంటే మనుషులు చెప్పింది.

అపౌరుషేయమంటే మనుషులు చెప్పనిది అని వేదాన్ని గురించి చిలుకలు వాదించుకుంటాయి. అది మండనమిశ్రుని గృహం' అని చెప్పారు. శంకరాచార్యులవారు చాలా ఆశ్చర్యపోయారు. అబ్బో ఇతడు సామాన్యుడు కాదు అందుచేత మనం తప్పకుండా మండనమిశ్రుడి ఇంటికి వెళ్ళవలసిందే అనుకున్నారు. శిష్యులను అక్కడ ఉంచి యోగ మార్గంలో ఒక్కసారి ఆకాశంలోకి వెళ్ళి అక్కడ నుంచి తిన్నగా ఇంటి పైకప్పులోంచి మండన మిశ్రుడు ఉన్న గదిలోకి దిగిపోయారు.

మండనమిశ్రుడు అప్పుడు వాళ్ళ నాన్నగారికి తద్దినం పెడుతున్నాడు. అందుకని ఆయన ఎంత కర్మిష్ఠి అంటే సాక్షాత్తుగా మీమాంసాప్రవర్తకుడు జైమిని శిష్యుడు ఆయన. తండ్రికి తద్దినం పెడుతుండగా ఎవరైనా చూస్తారేమోనని అన్ని గదుల కవాటాలు బిగించాడు. అందుకని శంకరాచార్యులవారు పైనుంచి కిందకి దిగారు. మూలాధార చక్రాన్ని కదపడం ఎవరికి వస్తుందో కుండలినిని మూలాధార చక్రంలోకి ఎవరు తీసుకెళ్ళగలరో అటువంటి వాళ్ళు పృథివీ తత్త్వాన్ని గెలిచేస్తారు. వాళ్ళకి ఇంక పృథివి అంటదు. ఈ గోడ పృథివి కదా ఇక్కడ నుంచి గోడలోంచి లోపలికి వెళ్ళిపోతాడు. తలుపులోంచి లోపలికి వెళ్ళిపోతాడు. పైనించి కిందికి వచ్చేస్తాడు. పృథ్విని గెలుస్తాడు. శ్రీవిద్యా సంప్రదాయంలో శంకర భగవత్పాదులు అప్పటికే షట్చక్ర భేదనంలో మహా నిష్ణాతులు.అందుకని పైనుంచి కిందికి దిగారు అది రహస్యం. మండనమిశ్రుడు అపారమైన కర్మిష్ఠి. తను చేసిన పని చేతనే మోక్షం వస్తుందని నమ్ముతాడు. ఏ పని ఎలా చెయ్యాలో అలాగే చెయ్యాలి. వేదం ఎలా చెప్పిందో అలాగ. అలా చేస్తేనే మోక్షం వస్తుందని.

మండనమిశ్రుడు బ్రాహ్మణుడు. ఆ విషయం నేనింక వేరే చెప్పక్కర్లేదు. బ్రాహ్మణుడు అనడానికి ఏమిటి గుర్తు? అపారమైన కర్మిష్ఠియైన బ్రాహ్మణుడికి ఒక లక్షణం ఉండాలి. ఏమిటి ఆ లక్షణం అంటే శిఖ ఉండి, కేవలం శిఖ

ఉంటే సరిపోదు. అది ధర్మాచరణానికి గుర్తు. శిఖ ఉండి శిఖ ఇలా కిందకి వచ్చి పైకి తీసి ముడి వెయ్యాలి. అలా ఉండాలి శిఖ. అలా ఉంటే తాను ధర్మాచరణం చేస్తున్నాడని గుర్తు. రెండు సత్యవ్రతమునందున్నాడని గుర్తు యజ్ఞోపవీతం ఉండాలి. శంకరాచార్యులవారి మార్గంలో అద్వైత సిద్ధాంత ప్రచారకులు యజ్ఞోపవీతం తీసేస్తారు. మొలతాడు తీసేస్తారు. ఇవే మూట కడతారు దండంలోకి. అందుకని ఆ తరువాత శిఖ తీసేస్తారు. శిఖ ఉండదు, యజ్ఞోపవీతం ఉండదు, మొలతాడుండదు. కౌపీన ధారణమే చేస్తారు. ఏకవస్త్రం కట్టుకుంటారు. అందుచేత ఇప్పుడు వచ్చిన వారికి శిఖలేదు. శిరస్సు అంతా ముండనం అయిపోయి ఉంది. గుండుతో ఉన్నారు. యజ్ఞోపవీతంలేదు. ఇటువంటి వారు తిన్నగా వచ్చి కిందకి దిగారు. తను తండ్రికి తద్దినం పెడుతున్నాడు. ఎంత మండిపోతుంది ఇలాంటప్పుడు ఇలాంటివాడు వచ్చాడంటే. కర్మమార్గము నందు నమ్మకం లేనివాడు కనపడ్డాడు ఎదురుకుండా.

శంకరాచార్యులవారు అమాయకులు కాదండి. ఆ టైంలో ఎందుకెళ్ళారో తెలుసా ఆయన. మండనమిశ్రుడు చూడడు ఇలాంటి వాళ్ళని. అంతకోపం ఆయనకి. అంత కోపంలో ఉంటే ఉత్తప్పుడు వెళ్ళారనుకోండి శంకరా చార్యులవారు. ఛ అవతలికి పో అంటాడు. నేను మాట్లాడనంటాడు. ఇప్పుడు అలా అనకూడదు మండనమిశ్రుడు. ఎందుకు అనకూడదు?

అక్రోధనైః బ్రహ్మచర్యం. తద్దినం పెట్టేవాడికి కొన్ని లక్షణాలు చెప్పారు. తద్దినం పెట్టే వాడు ముందురోజు తలస్నానం చెయ్యాలి. ముందురోజు తలస్నానం చేసి దీక్షా స్వీకారం చేస్తారు. అయ్యా పితృదేవతలారా, రేపటి రోజున మీరు శరీరం విడిచిపెట్టిన తిథి. అందుచేత నేను పితృకార్యం చెయ్యబోతున్నాను. దానికి వేరే పేరుండదు. శ్రాద్ధము అంటారు. అంటే శ్రద్ధతో పెట్టేది. తండ్రికి తద్దినం పెట్టిన రోజు రాత్రి ఎట్టి పరిస్థితుల్లో వేరొక ఊరు వెళ్ళి పడుకోకూడదు. ఇవ్వాళ వచ్చి తద్దినాలు పెట్టి వెళ్ళిపోతున్నారు రాత్రి. పొలిమేర దాటి వెళ్ళకూడదు. ఆరోజు రాత్రి అక్కడ ఉండి మరునాడు

దీక్షాస్వీకారాన్ని వదిలి పెడుతున్నట్టు స్నానం చెయ్యాలి. మళ్ళీ తలస్నానం చేస్తే వాడికి అక్కడతో పోతుంది అది. సంధ్యావందనం మాత్రం మొదలు పెట్టకూడదు. ఈ రోజులలో అక్రోధనైః ఎట్టి పరిస్థితులలో కోప్పడకూడదు. అందుకే ఉపనిషత్తు పారాయణం చేయండి అంటారు. ఇప్పుడు మరి ఎదురుకుండా పిలక లేనివాడు, యజ్ఞోపవీతం లేనివాడు కనబడ్డాడని కేకేసాడనుకోండి తద్దినం పోతుంది. అందుకని అప్పుడొచ్చారాయన. ఇప్పుడెలా అరుస్తాడు. మాట్లాడి తీరాలి తప్పదు.

మండనమిశ్రుడికి కడుపులో మంటొచ్చింది. వీడొచ్చాడేమిట్రా పిలకలేని వాడు యజ్ఞోపవీతం లేనివాడు. నేను తండ్రికి తద్దినం పెట్టుకుంటుంటే. అందుకని 'కుతోముండీ' అన్నాడు. ఒరేయ్ నీలాంటివాడు రాకూడదనే తలుపులన్నీ వేసేసాను.ఎలా వచ్చావురా? అన్నాడాయన. ఎక్కడినుంచి వచ్చావు అన్నాడు. శంకరాచార్యులవారు మహాదిట్ట. ఆయన నాకు యోగ శక్తులున్నాయి. అని ఆయన చెప్తారా? ఆయనన్నారూ 'అవిలితం ముండీ' అన్నారు. మెడ వరకు రా? అంటే ఆయనేమన్నారు తల ఎక్కడనుంచి వచ్చిందిరా అంటే కంఠం నుంచి వచ్చింది అన్నారు. ఆయన వేరు రకంగా చెప్పారు. దాని అర్థాన్ని మార్చి. ఇంకా కోపం వచ్చింది. నేను అడిగిందొకటి నువ్వు చెప్తున్నదొకటి. నువ్వు ఏ మార్గంలో వచ్చావని నేను అడుగుతున్నాను. ఆ మార్గం చెప్పటం మానేసి ఏదేదో మాట్లాడతావేంటి అన్నారు. అంటే శంకరులన్నారు. నువ్వు ఏ మార్గంలో ఉన్నావో తెలుసుకోకుండా కోప్పడి మాట్లాడుతున్నావు. నీ మార్గం ముందు నీవు తెలుసుకో అన్నారు. ఇంకా కోపం వచ్చేసింది మండన మిశ్రుడికి 'సురా పీతా' ఏరా కల్లు తాగావా? అన్నారు. అంటే శంకరులు అన్నారు. 'సురాన పీతా శ్వేతః' అన్నారు. సురాపీతా అంటే కల్లు తాగావా అని ఒక అర్థం. సురాపీతా అంటే కల్లు పసుపుపచ్చగా ఉంటుందని. కల్లు పసుపుపచ్చగా ఎందుకుంటుంది. తెల్లగా ఉంటుంది కల్లు. అందుకని సురానపీతా సురానపీతా సుర పసుపుపచ్చగా ఉండదు. సురా

శ్వేతాః తెల్లగా ఉంటుంది. అంటే మండనమిశ్రుడికి మరీ కోపం వచ్చింది. తద్దినం టైంలో రావడమే కాకుండా కల్లు గురించి మాట్లాడతాడేమిట్రా? అని కట్టుకున్నది కాషాయం. వేసిన వేషం సన్యాసం. కల్లు గురిచి మాట్లాడుతున్నావ్. కల్లు రంగు నీకెలా తెలిసింది అన్నారు. శంకరులు అన్నారు. నాకు రంగే తెలుసు. బహుశః నీకు దాని గుణం కూడా తెలుసు అన్నారు. అనేటప్పటికి ఎక్కడలేని కోపం వచ్చేసింది మండనమిశ్రుడికి. భోక్తల కింద వచ్చినవారు ఎవరో తెలుసాండి. వ్యాసమహర్షి, జైమిని మహర్షి వచ్చారు భోక్తలకింద. అదీ మండనమిశ్రుడి శక్తి. వ్యాసుడన్నాడు. తప్పయ్యా ఎవరైతే ఏమిటి? అని ఒక సిద్ధాంతం ఉందికదా. అభ్యాగతర్విష్ణు స్వరూపః అభ్యాగతుడు విష్ణు స్వరూపుడు. అందుకని కోప్పడగూడదు. వచ్చిన అతిథి శ్రీ కృష్ణ స్వరూపం. అతిథి దేవోభవ అని కదా. అతిథి వస్తే దైవంగా భావించాలి. ఎక్కడినుంచి వచ్చావు. నీరూపం ఏమిటి? అని కోప్పడతావేమిటయ్యా తద్దినం పెట్టేవాడికి కోపం ఉండకూడదు. అందుకని సన్యాసులు ఏం తీసుకుంటారు. భోజనానికి నిమంత్రించకూడదు. సన్యాసి వస్తే అయ్యా మా ఇంటికి భోజనానికి రండని ఎలవకూడదు. సన్యాసిని భిక్షకి పిలవాలి. బ్రహ్మచారిని భిక్షకి పిలవాలి. అందుకని మండనమిశ్రుడన్నాడు. వ్యాసుడు చెప్పాడు కదాని మా ఇంట్లో భిక్ష స్వీకరించండన్నాడు. అంటే శంకరులన్నారు. నేను ప్రాకృత భిక్షకి రాలేదు. నేను అన్నం కోసం వచ్చినవాడిని కాను. నాకు వాద భిక్ష కావాలన్నాడు. నీతో వాదం చేస్తాను. ఆ భిక్ష ఇస్తావా అన్నారు.

సన్యాసి ఇంటికొస్తే భిక్షపెట్టను. అనకూడదు. అందుకని వాదభిక్ష పెడతానన్నాడు. అని తద్దినమంతా అయిపోయిన తర్వాత ఈయనకీ కడుపులో బాధే ఇలాంటి విషయాలు ఆయనకి ఇష్టం ఉండవు. యజ్ఞోపవీతాలు తీసేయడం. శిఖలు తీసేయడం. జ్ఞానమార్గం ఆయనకి ఇష్టం ఉండదు. ఎంతసేపూ కర్మమార్గం మండనమిశ్రుడిది. అందుకని ఆయనకూడా వాదానికి సంతోషంగా ఉన్నారు.

ఇద్దరూ వాదమండపం చేరుకున్నారు. అబ్బో పండితులందరూ వచ్చేసారు. ఆ రోజుల్లో ఇలా పండితులు వాదించుకుంటుంటే వినటం అంతిష్టం. సరే వాళ్ళిద్దరూ వాదించుకుంటే వీళ్ళు గెలిచారు. వీళ్ళు ఓడిపోయారని చెప్పాలికదా ఎవరో ఒకరు మరి ఎవరు చెప్తారు. అందుకని మండనమిశ్రుడన్నాడు. అయ్యా వ్యాసభగవానుడా నీకన్నా గొప్పవాడెవడయ్యా? నువ్వు కూర్చుని విను అన్నారు. అని జైమినిని వ్యాసుడిని పిలిచారు. వ్యాసుడన్నాడూ దీనికి నేను అక్కరలేదు. మీ ఇద్దరూ వాదించుకుంటే ఎవరు విజేతలో చెప్పటానికి మీ ఆవిడ చాలయ్యా మీ ఆవిడని న్యాయనిర్ణేతగా పెట్టుకోండని చెప్పి ఆయన అంతర్ధానమయిపోయాడు. ఇప్పుడు మీకు చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. అదేమిటండీ? మండన మిశ్రుడే ఇంత గొప్పవాడైతే అతనిభార్య ఎంత గొప్పదో!

మండనమిశ్రుడి భార్య ఉభయ భారతి. ఆవిడ సరస్వతీ దేవి అవతారం. దూర్వాసో మహర్షి శాపంచేత సరస్వతీ దేవి పుట్టిందక్కడ. మండనమిశ్రుడు బ్రహ్మగారు. అందుచేత ఉభయభారతిని న్యాయమూర్తిగా ఉండమన్నారు. అంటే శంకరులన్నారు. ఇంత కష్టపడి వాదం చేసేటప్పుడు ఏదో ఒక పణం ఉండాలి. మనం ఏమంటాం. ఏదో పందెం అంటాం. పందెం ఉండాలి నేను ఓడిపోతే నీకు శిష్యుడినైపోతాను. శంకరులు శిష్యులైపోయారనుకోండి. కర్మమార్గంలోకి వెళ్ళిపోతారు. అంటే శుభ్రంగా పెళ్లిచేసేసుకుని ఒక అమ్మాయిని పెట్టుకుని సుఖంగా కాలక్షేపం చేయాలి గృహస్థాశ్రమంలో. నువ్వు ఓడిపోతే సంసారాన్ని విడిచిపెట్టి నా శిష్యుడివైపో. అంటే జ్ఞాన మార్గంలోకి వస్తావు కాబట్టి సన్యాసివైపో అన్నారు. ఇప్పుడు ఏ భార్యైనా తీర్పు చెప్పటానికి ఒప్పుకుంటారండీ? ఓడిపోయాడు అని చెప్పగానే మండనమిశ్రుడు వెళ్ళిపోతాడు. ఆయన కూడా ఒక సత్య దండం పట్టుకుని వెళ్ళిపోవటమే. మరి ఆవిడ తీర్పు చెప్పొచ్చా అంటే ఆ రోజులలో అలా ఉండేవారు. అంత శక్తికలిగి ఉండేవారు. ఉభయభారతి ఇద్దరికీ మధ్య న్యాయమూర్తి. ఆవిడ

రెండు పుష్పమాలలు తెప్పించింది. ఇద్దరి మెడలో ఆ పుష్పమాలలు అలంకారం అయ్యేటట్లు చూసింది. ఇంక మీ ఇద్దరూ మాట్లాడుకోండి. నేను ఇంటి పనులు చేసుకుంటూ వింటాను అంది. ఎందుకని గృహిణి భర్తకి వంట చేయటం మానేసి, ఇంటికి అతిథిగా వచ్చిన సన్యాసికి భిక్ష పెట్టడం మానేసి తనిద్ది వింటూ కూర్చోకూడదు. అందుకని ఇంట్లో పనులు చేసుకుంటూ ఉండేదిట. అలా ఒకసారి ఇటుచెవి పడేసేదిట. అంతే ఆవిడకి అర్థమయిపోయేది. ఏం వాదించుకుంటున్నారో? మధ్యాహ్నం అయ్యేటప్పటికి ఒకసారి వచ్చేదిట. ఏమండోయి మీరు భోజనానికి రండి. స్వామీ మీరు భిక్షకి రండి అనేది. అంటే ఏమిటి? అలా పిలిచినంత కాలం ఇంక ఈయన భర్తే. ఆయన సన్యాసే. ఎప్పుడైనా ఆవిడ గాని ఒకవేళ మీరిద్దరూ భిక్షకి రండందనుకోండి అంటే డిపోయినట్టే మండనమిశ్రుడు. అంతేకదా తీర్పు. నువ్వు సన్యాసివైపోవచ్చు అని చెప్పేసినట్టు. ఎన్నాళ్ళు ఉభయభారతి అలా పిలిచిందో అంతకాలం ఇద్దరి వాదన నడుస్తున్నట్టు లెక్క. అలా నడుస్తూనే ఉంది. సంధ్యావందన సమయానికి ఆపేవారు. వెళ్ళి సంధ్యా వందనం చేసుకునేవారు మండనమిశ్రు డు. అగ్నికార్యం చేసుకునేవారు. స్నాన ధ్యానాదులు చేసుకోవటానికి వేళ ఇచ్చేవారు. మళ్ళీ చక్కగా కలిసి వెళ్ళేవారు ఇద్దరూ రేవానదికి. స్నానంచేసేవారు. మళ్ళీ వాదం మొదలుపెట్టేవారు. ఇలా చాలా కాలం గడిచిపోయింది.

ఒకరోజు ఉభయభారతి వచ్చి అంది అయ్యా ఇద్దరూ భిక్షకి లేవచ్చండి. మావారి మెడలో మాల వాడిపోయింది. ఎవరు వాదం సరిగ్గా చేయలేక పోయారో వారి మెడలో మాల వాడిపోయింది. శంకరాచార్యుల వారి మెడలో మాల రోజు రోజుకి రోజు రోజుకి సుగంధ భూయిష్ఠమై మరింత తేజో విరాజితమయింది. అందుకని శంకరులే గెలిచారనే ప్రకటించింది తల్లి. కేవలం పూలదండను బట్టి కాదు. ఆమె సరస్వతీ అవతారం. ఆవిడ శంకరులు చెప్పిన సిద్ధాంతం సత్యమని నమ్మింది. సరే మండనమిశ్రుడు లేచిపోయాడు. అంగీకరించాడు కానీ మనసులో చిన్న బాధ. నా గురువు జైమిని. జైమిని

చెప్పింది అసత్యమా? అని. అప్పుడు జైమినియే సాక్షాత్కరించాడు. 'శంకరులు ఏది చెప్పారో అదే నా హృదయం మండనమిశ్రుడా! శంకరులు చెప్పినదే యథార్థం' అని చెప్పారు. అప్పుడా అనుమానం కూడా తీరిపోయింది. అప్పుడు శంకరాచార్యులవారి పాదాలమీద పడి బ్రహ్మోపదేశం ఇమ్మని అడిగాడు. సన్యాసం స్వీకరించటానికి. అప్పుడు ఉభయభారతి అంది అంత తొందరగా మా ఆయన ఓడిపోయాడని అనుకోకు. మా ఆయన సగమే ఓడిపోయాడు అనంది. అదేమిటి అన్నారు శంకరాచార్యులవారు. భార్య భర్త శరీరంలో సగభాగం నువ్వు ఎవరిని గెలిచావు. నా భర్తని గెలిచావు. నేను లేనూ నన్నుకూడా గెలువు. తర్వాత అప్పుడు మండనమిశ్రుడు మీతో వస్తాడంది. అంటే శంకరులన్నారూ అమ్మా నేను నీతో వాదించను అన్నారు. ఎందుకు వాదించరు అనడిగింది ఆవిడ. అడిగితే సన్యసించిన వ్యక్తి, కాషాయం కట్టుకున్న వ్యక్తి స్త్రీల ముఖంలోకి చూస్తూ స్త్రీలతో ఎక్కువ సంభాషించటం శాస్త్రంచేత దూష్యం. అలా చేయకూడదు. అందుకని నేను నీతో కూర్చుని మాట్లాడటం, వాదం చేయటం జరగదు. నేను యతిపురుషుడను. కాషాయం కట్టుకుని ఉన్నవాడిని. ఒక స్త్రీతో అలా వాదించటం మాట్టాడం అవి చేయకూడదు. అందుకని నేను నీతో వాదన చేయను అన్నారు. అంటే ఆవిడందీ అయ్యా స్త్రీ అంటే శరీరంచేత తెలుస్తుంది. పురుషుడు శరీరంచేత తెలుస్తాడు. స్త్రీయా, పురుషుడా అన్నది విడిచిపెడితే గార్గితో సాక్షాత్తుగా యాజ్ఞవల్క్యుడు వాదించాడు జనక మహారాజు గారి సభలో. అలాగే జనక మహారాజు గారు తాను స్వయంగా సులభయోగినితో వాదించారు. అందుచేత స్త్రీలు మహా జ్ఞానులైనప్పుడు వాదించటంలో తప్పులేదు. అందుచేత నువ్వు నాతో వాదించు అన్నది. శంకరులు ఇష్టపడలేదు. కానీ పక్కనున్న శిష్యులు గురువుగారూ మీరు వాదించండన్నారు. సరే సన్యాసంలో ఉన్నవాడు స్త్రీలతో ఎక్కువసేపు వాదించటంచేత వచ్చే ప్రమాదం లోకానికి తెలియడం కోసం నేనీ వాదంలోకి ప్రవేశిస్తున్నాను అన్నారు.

ఉభయభారతితో శంకరులు వాదం ప్రారంభించారు. ఉభయభారతి గ్రహించింది తానోడిపోతున్నానని. ఇప్పుడు ఎల్లాగైనా శంకరులని ఓడించాలి. ఎందుకు? శంకరులని ఓడించలేనని ఆవిడకి తెలుసు. తన భర్తని దక్కించుకోవాలి. పతివ్రతగా అందుకని ఆవిడందీ మీకు నాకు వాదం సమయంలో ఏవిధమైన విధి నిషేధాలు లేవు. ఈ విషయం గురించి మాట్లాడకూడదు అనిలేదు. నేను నిన్ను ఒక ప్రశ్న వేస్తున్నాను. శుక్లపక్షంలో, కృష్ణపక్షంలో చంద్రుడి కళలు మారుతున్నప్పుడు కామకళా విలాసం ఎలా మారుతుంది. ఏయేస్థానాలలో మారుతుంది. ఏ స్థానాలను స్పృశించినప్పుడు ఏ రకమైన ఫలితాలు వస్తాయి. అవి ఎక్కడ ఉంటాయి. నాకు చెప్పు అంది. శంకరులు మహాయోగి పుంగవులు. కాషాయ వస్త్రధారి. బాల్యమునందు 'బ్రహ్మచర్యమునందు సన్యసించినవారు. వారికి అసలు సంసారం గురించి ఏమీ తెలియని వ్యక్తి. ఆయనకి కామశాస్త్ర జ్ఞానంలేదు. అయితే మీరిక్కడొక మాట నన్నడగవచ్చు. ఏమండీ శంకరాచార్యుల వారు ఆత్మస్వరూపి కదా? సాక్షాత్తు శివాంశ సంభూతుడు కదా? శివుడంటే మహాజ్ఞాని కదా? కామశాస్త్రం కూడా శాస్త్రమేకదా? మరి అలా అయితే వాత్స్యాయనుడు కామసూత్రాల్ని శాస్త్రం క్రిందే కదా వ్రాసాడు? వ్రాసినప్పుడు శంకరులు తన సంకల్పబలం చేత ధ్యానబలం చేత తెలుసుకోలేరా? తెలుసుకోగలరు. కానీ తనకి అనుభవం లేనటువంటి విషయాన్ని కేవలం శాస్త్ర పరిజ్ఞానంతో తను తెలుసుకున్న విషయాన్ని పరిజ్ఞానం కలిగిన ఒక స్త్రీతో వాదించేటప్పుడు అది ఎటు తిరిగి ఎటొస్తుందో. ఒక సన్యాసి దాన్నంత లోతుగా వాదించటం రేప్పొద్దున్న లోకానికి ఎటువంటి స్థితిని ఏర్పాటు చేస్తుందోనని శంకరులు దీనిమీద నేను వాదించకూడదు. అందుకని ఇప్పుడు తానుకూడా అనుభవం సంపాదిస్తే తప్ప వాదించడం కుదరదు. సంపాదిస్తే సన్యాసం పోతుంది. సంపాదించకపోతే ఉభయభారతితో వాదం చేయలేరు. తానోడిపోయినట్టే. ఎందుకని సగభాగంతో వాదిస్తే తప్ప మండనమిశ్రుడియందు నువ్వు విజయం సాధించినవాడవు

కావు అంది. ఎలా? శంకరులన్నారు. అమ్మా కామకళా శాస్త్రమునందు నాకు ప్రవేశం లేదు. నేను బాల్యమునందు సన్యసించాను. నువ్వు శుక్లపక్ష, కృష్ణపక్ష తిథులలో వచ్చే కామకళాప్రకాశం గురించి అడిగావు కనుక నాకు ముప్ఫై రోజుల వ్యవధినియ్యి. ఇస్తే నేను ముప్ఫై రోజులలో ఈ విషయాలను తెలుసుకుని వచ్చి నీకు చెప్తాను అన్నారు. ఇది ఎలా సాధ్యం శంకరాచార్యుల వారికి. ముప్ఫై రోజుల టైం ఇస్తే మాత్రం తెలుసుకోవటం అంటే ఆవిడ ఎంతగొప్ప విషయం పెట్టిందంటే అది ధ్యానం కాదు. ఈ శరీరంతో అనుభవించిన సుఖం చేత తెలుస్తుంది అది శంకరులకి. ఈ శరీరంతో ఎలా చేస్తారు. అందుకని శంకరులు వెంటనే అంతర్ధానమయి యోగవిద్యలో ఆకాశంలోకి వెళ్ళిపోయారు. శంకరులంటే శంకరులే. వారికే చెల్లింది. ఇంకొకరికి చెల్లదు. శంకరులు ఆకాశమార్గంతో వెళుతూ చూసారు. ఒక రాజు మరణించి ఉన్నాడు. అమరక ప్రభువు అని పేరు ఆయనకి మెరుపు తీగలలాంటి నూర్గురు భార్యలున్నారు. నూర్గురు భార్యలూ ఆయన్ని చుట్టుముట్టి ఏడుస్తున్నారు. మేము అనాథలమై పోయామని. వెంటనే పద్మపాదునివంక చూసి శంకరాచార్యులవారన్నారు. నేను ఇప్పుడు ఉభయభారతితో వాదించడానికి కావలసిన జ్ఞానసముపార్జన కొఱకు వేరొక శరీరంలో ప్రవేశిస్తాను. ప్రవేశిస్తే ఆ శరీరంతో ఆ శరీరం యొక్క భార్యలతో రమిస్తాను. కానీ ఇంద్రియాలు ఇవే కదా. పరకాయ ప్రవేశం చేసినప్పుడు ఇంద్రియాలను కూడా తీసుకెళతారు. మరి ఇంద్రియాలు ఎలా? శంకరులన్నారూ నేను అప్పుడు ఆ సుఖాన్ని పొందుతున్నప్పుడు సోహం స్థితిలో అంతటా పరివ్యాప్తమైన ఆత్మగా నిలబడి దాన్ని కూడా ఒక శాస్త్రాభ్యాసంగా తెలుసుకుంటాను. తిథి మారిపోకూడదు. శుక్లపక్ష, కృష్ణ పక్షాలలో ఒక రాత్రి వృథా అయినా మారిపోతుంది. అందుకని ముందా శరీరంలోకి వెళ్ళిపోయారు. పద్మపాదుడు హెచ్చరిస్తూనే ఉన్నాడు. అయ్యా లేనిపోని ఉపద్రవాలు వస్తాయేమో చూడండని. శంకరులు నువ్వు నా శరీరాన్ని కాపాడుతూండు. గుహలో పెడతానని

పద్మపాదునికి చెప్పి వెళ్లిపోయారు. పరకాయ ప్రవేశమనేది ఒక విద్య పూర్వకాలంలో అటువంటి విద్యలు కూడా కరతలామలకం. ఆ శరీరంలోంచి ఇంద్రియాలను పట్టుకుని పైకి లేచిపోతారు. ఆ శరీరం పాడవదు. కానీ దాన్ని ఎవరూ ముక్కలు చేయకూడదు. కాల్చేయకూడదు. అలా అయిపోతే శరీరం అలా ఉంటుంది. మళ్లీ వచ్చేవరకు. శంకరులు తన శరీరంలోంచి లేచి మరణించిన రాజు శరీరంలోకి వెళ్ళారు. అందులో వాయు ప్రసరణం జరిగింది. రక్తం కదిలింది. రాజులో కదలిక వచ్చింది. కానీ లోపల ఉన్న జీవుడు వేరు. శంకరులు ఉన్నారు. ఇప్పుడందులో. కానీ శంకరుల శరీరం పరమ పవిత్రంగా గుహలో ఉంది. ఈ శరీరంతో రాజుభార్యలందరూ మురిసిపోయారు. అంతఃపురంలోకి తీసుకువెళ్ళారు. పురోహితులందరినీ పిలిచి మీరు రాజ్యం చేయండని చెప్పారు. మంత్రులకి రాజ్యం అప్పచెప్పి వీళ్లందరితో కలిసి ప్రతిరాత్రి కూడా తాను పొందిన జ్ఞానాన్ని, గ్రంథరచన చేసారు. సోహం స్థితిలో నిలబడ్డారు శంకరాచార్యులవారు. ఇదసలు చాలా కష్టం. అది మన ఊహకి కూడా అందని విషయం. ముప్పయ్యో రాత్రి గడిచిపోతోంది. ఈలోగా గమ్మత్తు జరిగింది. ప్రతి పదిరోజులకి ఒక వర్షం –పడాలి. భూమి తడిసేటట్టు. ఎలా? ప్రభువు ధర్మాత్ముడైతే పడుతుంది. శంకరులు ప్రభువు శరీరంలో ఉన్నారు కనుక మహా తపస్వి కనుక లోకమంతా సుభిక్షమయిపోయింది. పదిబస్తాలు పండే పొలాలు యాభై బస్తాలు పండేస్తున్నాయి. రెండు శేర్లు పాలిచ్చే ఆవులు పదిశేర్లు పాలిచ్చేస్తున్నాయి. ఎక్కడా లోకంలో గొడవలు లేవు. రాజ్యంలో అల్లర్లు లేవు. అందరూ పరమసంతోషంగా ఉంటున్నారు. సింహాసనం మీద కూర్చున్నవారు శంకరాచార్యులవారు. మంత్రులు కనిపెట్టారు. ఏదో తేడా వచ్చింది. శ్మశానంలో మళ్ళీ ప్రభువు లేచి ఇంటికొచ్చాక రాజ్యమంతా సస్యశ్యామలం అయిపోయింది. శత్రువులు కన్నెత్తి చూడటం లేదు. సరికదా పాము ముంగిస స్నేహంగా ఉంటున్నాయి. కప్ప పాము స్నేహంగా ఉంటున్నాయి. అంటే ఎవరో దివ్య పురుషుడు ఉన్నాడు. ఏదో పనిమీద

వచ్చాడు ఆ శరీరంలోకి. అంటే వెళ్లిపోతాడు. వెళ్ళిపోతే మళ్ళీ మనరాజ్యం నాశనమయిపోతుంది. అతను వెళ్లకుండా ఉండాలంటే అతను వదిలిన శరీరం ఎక్కడో ఉంటుంది. ఇప్పుడే చచ్చిపోయినవాడైనా సరే అయ్యో ఇంకొక గంట ఏడవాలండీ అన్నా సరే ఆపొద్దు. మీరే అంత్యక్రియలు చేసేయండి. కనబడ్డ శవాన్ని కనబడ్డట్టు కాల్చేయండి. అంగుళం మేర వదలకుండా వెతికి కాల్చేయండన్నారు. అంటే సైనికులు బయలుదేరారు. ఎక్కడ దొరికిన శవాన్ని అక్కడ కాల్చేస్తున్నారు. గుహలో పద్మపాదాచార్యులవారు గమనించారు. వాళ్ళు గుహలోకి కూడా వచ్చేస్తారు. ఎలా కాపాడటం ఇప్పుడు శంకరుల శరీరాన్ని. శంకరులని బయటికి తీసుకురావాలి తొందరగా. ఎలా మాట్లాడతారు. ఏమని చెపుతారు? శంకరులవారితో. అందుకని మహానుభావుడు పద్మపాదుడు ప్రభువును చూడటానికి వచ్చినటువంటి అతిథిగా రాజాంతఃపురంలోకి వెళ్ళి భ్రమరగీతం పాడారు. ఓ తుమ్మెదా నువ్వు పుష్పాల మీద వాలి మకరందపానం చేస్తున్నావు. కానీ పుష్పం మూసుకునే సమయం ఆసన్నమయిపోయింది. నీ శిష్యులు బయట పరితపిస్తున్నారు. తొందరగా బయటకిరా తుమ్మెదా అని పాడారు. పాడితే శంకరాచార్యులవారు గమనించారు. ఓహో ఏదో ప్రమాదం వచ్చింది నా శరీరానికి పద్మపాదుడు వచ్చాడని వెంటనే రాజు శరీరాన్ని వదిలేసాడు. అందులోంచి తిన్నగా వచ్చి శంకరాచార్యులవారి శరీరంలోకి వచ్చేసారు. కానీ ఈలోగా సైనికులు శంకరాచార్యులవారి శరీరాన్ని తీసుకెళ్ళి చితిమీద పెట్టి అంటించేసారు. అంటించేసరికి దాని చేతులు కాలిపోతున్నాయి అప్పటికే శంకరాచార్యులవారు అందులోకి వెళ్ళారు. కానీ శంకరాచార్యుల వారియందు ఏ దోషం లేదు కాబట్టి అప్పుడు చేసారండీ 'శ్రీమత్పయోనిధి నికేతన! చక్రపాణే! భోగీంద్ర భోగమణిరాజిత పుణ్యమూర్తే' ఆస్తోత్రం ఉందే 'లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబం' కాలిపోతున్న చేతులిమ్మనిస్తోత్రం చేసారు. నరసింహ స్వామి వారు కటాక్షించారు. వెంటనే శంకరాచార్యుల వారి చేతులు వచ్చేసాయి. శంకరులయందు దోషం ఉంటే నరసింహ స్వామి

కటాక్షం ఉంటుందాండి. అటువంటి స్వరూపం. వెంటనే యోగమార్గంలో బయలుదేరి మళ్ళీ ఉభయభారతి దగ్గరకు వెళ్ళిపోయారు. వెళ్ళిపోయిన తర్వాత ఉభయభారతీ దేవితో వాదానికి కూర్చున్నారు. ఆవిడ తెలుసుకుంది. శంకరాచార్యుల వారు పరకాయ ప్రవేశం చేసి సోహం స్థితిలో నిలబడి ఆ శాస్త్రమునందు కూడా ప్రవీణులై వచ్చారు. ఇప్పుడు వారికి తెలుసు విషయాలు. అని తన ఓటమిని అంగీకరించింది. అంగీకరించి అప్పుడు చెప్పింది. నేను మా పుట్టింట్లో ఉండగానే నాకీ విషయం చెప్పారు. 'నేను సరస్వతీ దేవిని శంకరా నాకు అనుమతిని ఇప్పించు. నాభర్త సన్యసిస్తాడు కాబట్టి ఇంక నేను ఇక్కడుండవలసిన అవసరం లేదు. వెళ్ళిపోతాను' అన్నది. అంటే అప్పుడు సరస్వతీదేవిని శంకరులు స్తోత్రం చేసారు. స్తోత్రం చేసి అమ్మా నిన్ను శృంగగిరి పీఠంలో పీఠాధిదేవతగా పెడతాను శారదగా. శారద అంటే తెల్లటి కాంతి. ఎవరో తెలుసాండి. సరస్వతీ దేవి. పరమశివుని చెల్లెలు. పరమశివుని తెల్లని కాంతిలోంచి సరస్వతీదేవి వచ్చింది. అందుకే సర్వ శుక్లా సరస్వతీ. లక్ష్మీదేవి నారాయణుని చెల్లెలు. సరస్వతీదేవి శివుని చెల్లెలు. అందుకే ఇద్దరూ జ్ఞానమూర్తులే. ఇద్దరూ జ్ఞానమిస్తారు. అందుకే 'అమ్మా నిన్ను కట్టేస్తున్నాను వనదుర్గమంత్రంతో. నిన్ను శృంగగిరి పీఠంలో ప్రతిష్ఠాపన చేస్తాను. అంతవరకు నన్ను మన్నించి జగదాంబా ఉండమ్మా' అని అడిగారు. 'శంకరా నీ కోరిక తీరుస్తాను' అంది.

అందుకే శృంగగిరి పీఠంలో శారదా పీఠం అంత శక్తిమంతమయింది. అందుకే నవరాత్రులకు కూడా శరన్నవరాత్రులు, శారదా నవరాత్రులు అని పేరు. ముందు అమ్మవారి కాళ్ళు పట్టుకుంటే తప్ప తమోగుణం విరగదు. అందుకేమనం చైత్రమాసంలో వచ్చే వసంత నవరాత్రులు ముందు చేయం. ముందు అశ్వినీ నక్షత్రంతో వచ్చే ఆశ్వయుజ మాసంలో శరన్నవరాత్రులు ముందు చేయాలి. శారదా కటాక్షం ఉంటే తప్ప వాడు వేరొకటి చేయటానికి పనికిరాడు. అందుకని ముందు శరన్నవరాత్రులే చేయాలి. అందుచేత

శంకరభగవత్పాదులు ఉభయభారతీదేవి ఓటమిని అంగీకరించిన తరువాత మండనమిశ్రుడికి బ్రహ్మోపదేశం చేసి సురేశ్వరాచార్యులవారని పేరు పెట్టారు. శంకరభగవత్పాదులంతటి వారు సోహం స్థితిలో నిలబడి ఆ విషయాలు తెలుసుకున్నారు అంటే అదంత తేలికగా అంగీకరించ కలిగిన విషయమా అని ఎవరడిగారో తెలుసాండి? సర్వజ్ఞ పీఠం అని ఉంది. కాశ్మీరంలో దానికి నాలుగు దిక్కులనుంచి ద్వారాలున్నాయి. మూడు ద్వారాలనుంచి ముగ్గురు మహాపురుషులు వెళ్ళి సింహాసనాల మీద కూర్చున్నారు. నాలుగో ద్వారం మూతపడిపోయి ఉండేది. దక్షిణదేశంనుండి సర్వజ్ఞుడు. లేక తలుపు మూసుకుని ఉండేది. శంకరాచార్యులవారు సర్వజ్ఞ పీఠాధిరోహణం చేయటానికి వెళ్ళారు. వెళ్ళటం అంటే మాటలు కాదు. అనేక సిద్ధాంతాల వాళ్ళు అడ్డొస్తారు. ఇంతమందినీ శంకరాచార్యులవారు ఓడించి పీఠంమీద ఇలా కూర్చోబోతున్నారు. సరస్వతీ దేవి. ఆగు అంది. ఆగారు శంకరాచార్యులవారు. ఇన్ని వేలమందిలో నిన్నొక ప్రశ్న వేస్తున్నాను శంకరా. నువ్వు యతిపురుషుడవై కాషాయం కట్టుకుని సత్యదండం పట్టుకుని దివ్యమైన శరీరంతో ఉండవలసిన వాడివి. ముప్పై రోజులు నూర్గురు భార్యలతో రమించావా? లేదా? అని అడిగింది. నీకు సర్వజ్ఞపీఠం మీద కూర్చునే యోగ్యత ఉన్నదా? అని అడిగింది. శంకరులన్నారూ 'అమ్మా దీనికి సాక్షి నువ్వే. ముప్పై రోజులు నేను రాజు భార్యలతో సంగమించినప్పుడు ఏ ఒక్క క్షణం కూడా బుద్ధి స్థాయిలో కానీ, మనోస్థాయిలో కాని లేకుండా జ్ఞానసముపార్జన కోసమని సోహం స్థితిలో నిలబడినవాడినైతే ఆత్మ తత్త్వానికి సరస్వతివైన నువ్వే సాక్షి ఇప్పుడు నువ్వు చెప్పు. అలా నేను శాస్త్రం నేర్చుకున్నానా? ఎప్పుడైనా ఒక్క అంగుళం కిందకి దిగి మనోస్థాయిలో స్త్రీలతో రమించానా? నువ్వు చెపితేనే కూర్చుంటాను, అన్నారు. సరస్వతీదేవి శంకరా నువ్వు ఎన్నడూ ఒక అంగుళం దిగలేదు. సోహం స్థితిలో నిలబడి శాస్త్ర ప్రవేశం చేసావు. నిన్ను అనుమతిస్తున్నాను. అయ్యా కూర్చో, అంది సర్వజ్ఞపీఠం మీద. ఇప్పుడు చెప్పండి శంకరులలాంటి

జగద్గురువులు లోకంలో ఉంటారా? ఇదీ శంకరాచార్యులవారి వైభవం అంటే. అంతటి మహాత్ముడాయన.

తదనంతరం బయలుదేరి దక్షిణభారతదేశంలోకి వచ్చారు. వారి అమ్మగారు అంత్యకాలంలో శంకరులని స్మరించారు. అమ్మగారికి వరమిచ్చారు. అమ్మ స్మరించగానే యోగవిద్యతో కాలడికి వెళ్ళిపోయారు. అమ్మ మరణశయ్య మీద ఉన్నది. శంకరభగవత్పాదులను చూచి పొంగిపోయింది. అమ్మకి బ్రహ్మవిద్యసంతటినీ బోధ చేసారు. బోధ చేస్తే ఆవిడకి శంకరాచార్య స్వామివారు గురువుగారన్న భావన లేదు నా కొడుకన్న భావన. ఆవిడందీ నాకు ఈ నిర్గుణ పరబ్రహ్మం గురించి అర్థంకావటంలేదు. నువ్వు ఇంత చెప్తున్నావు. నాకు ఆత్మస్వరూపం ఏమిటో తెలియటంలేదు. నాకు సగుణంగా బ్రహ్మమును చూపించగలవా? అంది. 'సగుణా నిర్గుణా ........... విరాగిభిః' అంటాడు వ్యాసుడు. నిర్గుణంగా అంటే ఆత్మ తత్త్వంగా. అది జ్ఞానులు చేయగలరు. సగుణంగా అంటే భక్తి తత్పరులు ఏదో ఒక రూపంలో చేయగలరు. అందుకని ఒక రూపంలో పరమేశ్వరుణ్ణి చూపించగలవా? అంది. అంత్యకాలంలో ఆ పరమేశ్వరుణ్ణి చూస్తూ ప్రాణం వదిలేయొచ్చని. ఇలా అడిగితే ఏకొడుకైనా చూపించగలడా ప్రపంచంలో. శంకరులన్నారు అమ్మా నీకు తప్పకుండా ఈశ్వర దర్శనం చేయిస్తానని భుజంగ వృత్తంలో ఈశ్వరస్తవం చేసారు. భుజంగ వృత్తంలో ఈశ్వరుణ్ణి స్తోత్రం చేసారు. పరమశివుడు ప్రసన్నుడయినాడు. తన దగ్గరుండే కింకరులని పిలిచాడు. వెళ్ళి ఆర్యాంబ ప్రాణాన్ని తీసుకురండని పంపించాడు. ఆవిడ జీవుణ్ణి తీసుకురావటం కోసమని శంకరుని పార్శదులు వచ్చారు. పార్శదులంటే శంకరులు ఎలా ఉంటారో వాళ్ళు కూడా అలాగే ఉంటారు. డమరుకం, త్రిశూలం, విభూతి, త్రినేత్రుడై ఎఱ్ఱటి జడలతో ఒంటి నిండా విభూతి నలదుకుని వచ్చారు వాళ్ళు. అమ్మంది ఆర్యాంబ నాకు వీళ్ళని ఇలా చూస్తూంటే ఆ వంటి నిండా విభూతి, ఆ మూడో కన్ను, ఆ త్రిశూలం, ఆ డమరుకం. ఈ స్వరూపం నాకు గబుక్కున మనసుని నిలబట్టం లేదు.

ఏదో కొంచెం కదిలిపోతోంది. ఇంతకన్నా చాలా మంగళప్రదమైన స్వరూపాలతో నాకు కనబడేటట్లు చూడగలవా? అంది. శంకరులు అమ్మా తప్పకుండా చూపిస్తాను అన్నారు.

ఇప్పుడు శంకరులు మళ్ళీ శ్రీ మహావిష్ణు స్వరూపంగా ప్రార్థనచేసారు. సశంఖ చక్రం సకిరీట కుండలం సపీత వస్త్రం సరసీరు హేక్షణం 'పచ్చటి పట్టు పీతాంబరాలు పట్టుకుని శంఖ చక్ర గదా పద్మాలను పట్టుకున్న వారై ప్రసన్నమైన రూపాలతో విష్ణు పార్శదులు ఎదురొచ్చారు. అమ్మ అంది ఈ స్వరూపాలు చాలా బాగున్నాయి' నేను వీటిని ధ్యానం చేస్తూ వీటిలోకి వెళ్ళిపోతాను అంది. వారు విష్ణుద్వేషి అయి ఉంటే శంకరాచార్యుల వారు స్తోత్రం చేస్తే శంకరాచార్యుల వారి అమ్మగారిని పట్టుకెళ్ళటానికి శ్రీమహావిష్ణువు విష్ణు పార్శదులను పంపిస్తారా? శంకరులకటువంటి ద్వేషాలు తెలియవు. శంకరాచార్యులవారి మీద అటువంటి ద్వేషాలుకానీ మనం చూపిస్తే పరమపాతకులమయిపోతాం. మహాపురుషుల విషయంలో వేలెత్తి చూపించకూడదు. మనకా శక్తి లేదు, మనకా అధికారంలేదు. ఈశ్వరుడిచ్చిన మనుష్య జన్మ నాశనం చేసుకుని పాపం మూటకట్టుకోవాలనుకుంటే చేయాలంతే అలాంటి ప్రయత్నాలు. లేకపోతే శంకరాచార్యులవారిని వేలెత్తి చూపించడానికి మీకున్న అధికారం ఏమిటి? ఏది చేయగలవని నీవు శంకరులని విమర్శించగలవు. 'అహంబ్రహ్మాస్మి' స్థితికి ఎదిగారు. పశుంమాంసర్వజ్ఞ ప్రతిథకృపయా పాలజ్ఞ విభో అన్నారు. ఈరెంటి మధ్యలోనే మిగిలిన వాఙ్మయం. శంకరభగవత్పాదుల వారు మహాపురుషులు. అందుచేత వారు స్తోత్రం చేస్తే విష్ణు పార్శదులు వచ్చారు. ఆర్యాంబ విష్ణు పార్శదులతో కలిసి వెళ్ళిపోయింది.

శంకరాచార్యులవారిని అమ్మ ఒక వరం అడిగింది. 'నాయనా నువ్వు సన్యాసివి. నేను శరీరం విడిచి పెట్టిన తర్వాత నేను అమ్మకి అంత్యేష్టి చేయడమేమిటి? నేను చేయకూడదు సన్యాసిని కనుక అని నన్ను విడిచి పెట్టకు. నాకు అంత్యేష్టి సంస్కారం నీ చేతులమీద జరగాలని' కోరుకుందావిడ.

వరమిచ్చారు శంకరులు. అందుకని అమ్మకి అంత్యేష్టి సంస్కారం చేస్తాను అగ్నిహోత్రమిమ్మని అడిగారు జ్ఞాతుల్ని. అడిగితే వాళ్ళన్నారు. నువ్వు నీచుడవు నువ్వు సన్యసించావు. సన్యసించిన వాడివి తల్లికి అంత్యేష్టి సంస్కారం చేస్తాను అంటున్నావు. అందుకని నీకు అగ్నిహోత్రం ఇస్తే మేము పాపాత్ములం అవుతాం. మేము ఇవ్వం అన్నారు. శంకరులు అన్నారు 'తల్లికన్నా గొప్పది ఈ ప్రపంచంలో ఇంకొకటిలేదు. అటువంటి తల్లికి నేను వరమిచ్చాను. అమ్మా నీకు నేను అంత్యేష్టి చేస్తాను అని చెప్పాను. మాట తప్పకూడదు. అందుకని నాకు అగ్నిహోత్రాన్ని ఇవ్వండి చరణ సంస్కారం చేస్తాను' అన్నాడు. తలుపులు వేసుకున్నారు. మేం ఇవ్వమన్నారు. శంకరులు అజ్ఞానులు వీళ్ళని వచ్చి, ఎండు పుల్లలు అక్కడ కనపడినవన్నీ తెచ్చారు. తెచ్చి అమ్మ శరీరాన్ని దాని మీద పడుకోబెట్టి యాగం చేసేటప్పుడు అరణిమథనం అని చేస్తారు. లౌకికాగ్నితో వెలిగించకుండా. అమ్మగారి కుడి భుజాన్ని మథనం చేశారు. అందులోంచి అగ్ని పుట్టింది. చల్లబడిపోయిన శరీరంలోంచి. అగ్ని పుట్టింది అది విచిత్రం. ఇది ఈ శంకరుల ప్రజ్ఞ అంటే. అలా పుట్టిన అగ్నిహోత్రంతో అమ్మగారి శరీరానికి అంత్యేష్టి సంస్కారం చేశారు. అగ్నిహోత్రుడు పొంగిపోయాడు. సాక్షాత్ శంకరుడికి జన్మనిచ్చిన తల్లి ఆ తల్లి. ఆ తల్లిని అగ్నిహోత్రం కలుపుకుంది. శంకరుడు అప్పుడు శపించాడు. ఒకటి ఈ కేరళ రాష్ట్రంలో ఉన్న బ్రాహ్మణులకు వేదమే ఆధారం. ఇకనుంచి వీరికి వేదం నిరాదరణం అయిపోతుంది. వీళ్ళు వేదం యొక్క ప్రమాణం తెలుసుకోకుండా బ్రతుకుతారు. రెండు ఇకనుంచి ఇక్కడ ఉన్న వాళ్ళు తమ ఇళ్ళ వెనకాతలే సమాధులు కట్టుకుంటారు. అందుకే కేరళలో ఇప్పటికీ ఇళ్ళ వెనకాతల సమాధులు కట్టుకుంటారు. మూడు గృహస్థ ఆశ్రమంలో ఉన్నవాడికి గొప్పతనం ఏది. తన ఇంటికి అతిథి వచ్చినప్పుడు అతిథి సత్కారం చెయ్యడం. సన్యాసి వస్తే సన్యాసిని లోపలికి ఆహ్వానించి భిక్ష ఇవ్వడం. ఈ దేశంలో పీఠం ఉండదు సన్యాసులకు భిక్ష ఉండదు. అందుకే శంకరులు పుట్టిన రాష్ట్రంలో పీఠంలేదు.

శృంగగిరి పీఠం కర్ణాటకలో ఉంది. శంకర భగవత్పాదులు తన జీవితంలో ఇచ్చిన శాపం అదొక్కటే. అంత ప్రసన్నమూర్తులు ఆయన. అటువంటి శంకర భగవత్పాదులు ఆ రాష్ట్రాన్ని, అక్కడ ఉన్న బ్రాహ్మణుల్ని శపించారు. తదనంతరం బయలుదేరిపోయారు అక్కడి నుంచి. అక్కడే ఒక గమ్మత్తు జరిగింది అక్కడ నుంచి వస్తున్నప్పుడే.

అక్కడ నుంచి వస్తున్నప్పుడు శంకరులు మూకాంబికా క్షేత్రానికి వెళ్ళారు. అక్కడ ప్రభాకరుడు అనబడే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన కూడా కర్మిష్ఠి. ఆయనకు ఒక కుమారుడు జన్మించాడు. సూర్యుడి పగిది వెలిగిపోతుండేవాడు ఆ పిల్లవాడు. కానీ వాడు పుట్టినప్పటినుంచీ మాట్లాడలేదు. ఏడవలేదు. వాడలా కూర్చుని ఉండేవాడు. పెరిగాడు పెద్దవాడయ్యాడు. ఒరేయ్ అంటే ఊ అనేవాడు కాదు. కళ్ళు రెండూ ఇలా తెరిచే ఉండేవి. ఎప్పుడు అలా చూస్తుండేవాడు శూన్యంలోకి అంతే. అసలెప్పుడూ మాట్లాడేవాడు కాదు. మాట్లాడకపోతే తల్లి వీడికి ఆకలేస్తోందేమో అని నోట్లో ఏదైనా పెడితే ఇదేమిటని అడిగేవాడు కాదు. మింగేసేవాడు. కందిపప్పు వేసి అన్నం పెడిశ మింగేసేవాడు. ఆవకాయ వేసి అన్నం పెడితే తినేసేవాడు. పాలు పోసి పెడి త్రాగేసేవాడు. ఇదేమిటని అడిగేవాడు కాదు. ఇదెందుకు పెడుతున్నావ అడిగేవాడు కాదు. పిల్లవాడు పెద్దవాడయిపోయాడు. అందరు పిల్లలూ ఆయన ముందు ఆడుకునేటట్టు చేసారు. పిల్లలకి చాపల్యం కదా ఆడుకుంటాడని. ఆపిల్లలందరినీ బొమ్మ చూసినట్టు అలా చూస్తుండేవారు. తప్ప ఆడతాననేవాడు కాదు. ఉపనయనం చేస్తే మారతాడని పీటలమీద కూర్చోబెట్టి ఉపనయనం చేసారు. యజ్ఞోపవీతం వేసారు. ఆ తర్వాత బ్రహ్మోపదేశం చేసారు. ఈ చెవులతో విన్నాడో వినలేదో చేసానని తండ్రి అనుకున్నాడు. సంధ్యావందనం చేసేవాడు కాదు. సంధ్యావందనం చేయలేదేమిరా అంటే పలికేవాడు కాదు. కొడితే కదిలేవాడు కాదు. ఆ తండ్రికి బెంగగా ఉండేది.

ఒకసారి మూకాంబికా క్షేత్రానికి శంకరాచార్యులవారు వెళ్ళారు. అక్కడకి వెడితే ఈ ప్రభాకరుడు తన కుమారుణ్ణి తీసుకెళ్ళాడు. తీసుకెళ్ళి ఒరేయ్ ఆయన యతివరుడు రా ఆయన పాదాలకు నమస్కారం చేయి అన్నాడు. ఆయన అలాగే నిలబడ్డాడు. నిలబడితే ఈయనే ప్రణిపాతం చేసి అయ్యా నా కర్మ ఒక్కగానొక్క కుమారుడు ఇలా చూస్తుంటాడు. పుట్టినప్పటినుంచి ఇంతే. పెడితే తింటాడు. పెట్టకపోతే తినడు. మరి ఏమిటో తెలియదు. ఇలా ఉన్నాడు ఈ పిల్లాడు. అసలు ఎందుకిలా ఉన్నాడని అడిగాడు. శంకరులు ఆ పిల్లవాణ్ణి 'కస్త్వం' నువ్వెవరు అని అడిగారు ఆ పిల్లవాణ్ణి. అప్పటి వరకు మాట్లాడని ఆ పిల్లవాడు వాడన్నాడు 'నేను సూర్యుడను కాను. నేను చంద్రుడను కాను. నేను బ్రహ్మచారిని కాను. నేను గృహస్థును కాను. నేను సన్యాసిని కాను. నేను సప్తధాతువులు కాను. నేను అన్నమయకోశం కాను. నేను ప్రాణమయ కోశం కాను. నేను మనోమయ కోశం కాను. నేను ఏ అవస్థకి చెందినవాడనుకాను. నేను ఒకనాడు ఉన్నవాడను కాను. నేను ఒకనాడు పోయేవాడిని కాను. నేను వృద్ధి చెందుతున్నవాడిని కాను. నేను క్షీణిస్తున్న వాడను కాను. నేను సర్వకాలమునందు సాక్షిగా ఉండి జగత్తునంతటినీ చూసే ఆత్మ స్వరూపమేదో అటువంటి ఆత్మ స్వరూపుడను నేను. నాకు రూపంలేదు. నాకు నామం లేదు. నాకు పేరు లేదు. నాకు దేహంలేదు. నేను కేవలం సాక్షీ శివోహం' అన్నాడు. శంకరులు తెల్లబోయారు. అతనలా మాట్లాడేస్తుంటే శంకరాచార్యుల వారు వాడి తలమీద చెయ్యి పెట్టారు. హస్తమస్తక సంయోగం చేసారు. గురువు తనంతతాను సంకల్పం చేసి పెడితే శిష్యరికం ఇచ్చినట్టు. ఆయన అనుగ్రహం ప్రసరిస్తుంది అందులో. అప్పుడు శంకరాచార్యులవారు చెప్పారు. 'వీడు మహాజ్ఞాని వీడికి ఇంక లోకంతో సంబంధంలేదు. వీడు తనలో తానే ఆత్మలో రమిస్తున్నాడు. ఇంక ఇటువంటి వాడు లోకంతో మాట్లాడడు. లోకానికి సంబంధించిన విషయాలు అక్కరలేదు. జీవన్ముక్తుడు అంటామే కేవలం ఇంక ఆఖరి జన్మగా ఈ శరీరంలోకి వచ్చాడు. అందుకని

ఇతనికి లోకంతో సంబంధం ఉండదు. మీ దగ్గర ఉంటే పిచ్చివాడిలా కనబడతాడు. ఆ పిల్లవాడిని నాకిచ్చేయండి. నా శిష్యునిగా తీసుకెళ్ళిపోతాను ఈ పిల్లవాడికి ఏ ఉపదేశం లేకుండా ఇంతటి జ్ఞానం అరచేతిలో ఉసిరికాయలా వచ్చింది కాబట్టి ఈ పిల్లవాడికి హస్తామలకాచార్యులవారని పేరు పెడుతున్నాన'ని అన్నారు.

శంకరాచార్యుల వారి పక్కన కూర్చున్న నలుగురు శిష్యులలో తలకు రుద్రాక్షలు కట్టుకున్నవారు తోటకాచార్యులవారు. ఆయన పక్కన కూర్చున్న వారు హస్తామలకాచార్యులవారు. ఆయనే హస్తామలకుడు. బ్రహ్మజ్ఞానం ఉన్నవారు. ఎప్పుడూ శంకరులతో తిరుగుతూండేవారు. మీకు ఇప్పుడు ఆ నలుగురి గురించి సూక్ష్మంగా చెప్పాను. ఒకరు పద్మపాదాచార్యులు, ఒకరు సురేశ్వరాచార్యులు, అటు తోటకాచార్యులు, హస్తామలకాచార్యులు. సురేశ్వరాచార్యులంటే మండనమిశ్రుడు. సరే తోటకాచార్యులెవరు. తోటకాచార్యులవారు శంకరాచార్యులవారి దగ్గర ఉన్న శిష్యులందరిలో కొంచెం తక్కువ గ్రహణశక్తి ఉన్నవారు. అంత తొందరగా ఆయనకేమీ అర్థమయ్యేవి కావు పద్మపాదాచార్యుల లాంటి వారు డిస్టింక్షన్‌లో ఉంటారు. ఎప్పుడూ. నూటికి తొంబైతొమ్మిది స్కోరింగు వాళ్ళది. అక్కడే ముప్పయ్యయిదు మార్కులాయన తోటకాచార్యులు. ఒకరోజున పాపం తోటకాచార్యుల వారి గొప్పతనం ఏమిటి తెలుసాండి. శంకరాచార్యులవారు ఇలా లేచారనుకోండి లేవగానే శంకరాచార్యుల వారి పుస్తకం తీసేసి చంకన పెట్టుకుని ఆయనకేసిన పూలదండ తీసి చేతిలో పట్టేసుకుని. ఆయనకేమైనా మామిడిపండ్లు ఇస్తే గబగబా కవర్లో వేసేసుకుని వెళ్ళిపోతారు. శంకరాచార్యులవారు స్నానం చేస్తే గబగబగబా ఆయన ఒళ్ళు తుడిచేసేవారు. శంకరాచార్యులవారు ఇలా అనేటప్పటికి పొడిబట్ట ఇచ్చేవారు. శంకరాచార్యులవారు ఇలా చూసేటప్పటికి తడిబట్ట పిండేసేవారు. ఇన్ని చేస్తుండేవారు. ఎప్పుడూ సేవ. ఏక్షణంలో శంకరులు ఏం చేస్తారో ఆయనకు తెలుసు. సేవ చేస్తుండేవారు.

ఓరోజు శంకరాచార్యులవారి బట్టలుతకడానికి నదికెళ్ళారు. వెళ్ళి బట్టలుతుకుతున్నారాయన. శంకరులు పాఠం చెప్పే సమయం ఆసన్నమయి పోయింది. శిష్యులందరూ వచ్చి కూర్చుండిపోయారు. భాష్యం చెప్పాలని. శంకరాచార్యులవారు మౌనంగా కూర్చున్నారు. సమయం అయిపోయింది. ఈ శిష్యులనుకున్నారు తోటకాచార్యులవారు ఇంకా రాలేదని చూస్తున్నారు. వస్తే మాత్రం వాడికి పాఠాలు అర్థమవుతాయా? ఎందుకు వాడి గురించి కూర్చోవటం. మనం పద్మపాదాచార్యులవారులాంటి వాళ్ళం సభలో ఉన్నాం. ఎందుకు వాడి గురించి చూడటం. అని గురువు ప్రారంభం చేసేముందు ప్రార్థనాశ్లోకం చేస్తారు. వాళ్ళే ప్రార్థనా శ్లోకం మొదలెట్టేసారు. అంటే ఇంక మొదలెట్టేయండి మీరు అనన్నమాట. శంకరాచార్యులవారు ఇలా చూసేటప్పటికి తోటకాచార్యులవారు ఆ బట్టలన్నీ ఉతికేసి పిడిచేసి భుజాలమీద, చేతులమీద వేసుకుని గబగబా గబగబగబా వచ్చేస్తున్నారు. శంకరులొక్కసారి వారి వంక దృష్టి ప్రసారం చేసారు. అంతే తోటక వృత్తమని చాలా కష్టం. అందులో గురువుమీద వైభవోపేతమైన స్తోత్రాలు చెప్పేసారు తోటకాచార్యులవారు. కేవలం శంకరాచార్యులవారు ఇలా చూసినంత మాత్రంచేత సర్వవిద్యా పారంగతుడై పోయారు తోటకాచార్యులు. ఆయనే అప్పుడు చెప్పారు. గురువు అనుగ్రహం ఉంటే లభించలేనిది ఏది? ప్రపంచంలో 'భవశంకర దేశికమే శరణం' అని తోటకాచార్యులవారే శంకరాచార్యులవారి పాదాలను పదిమార్లు ముట్టుకుని ఎనిమిది మాట్లు చెప్పి శరణు చేస్తూ అష్టకం చెప్పారు. అప్పటికీ ఇప్పటికీ శంకరాచార్యులవారు ప్రసన్నం కావటానికి తోటకాష్టకమే చెప్తారు. 'భవశంకర దేశికమే శరణం' అని తోటకులంటే ఎంత నిస్వార్థమైన సేవో తెలుసాండి శంకరులకి.

శంకరాచార్యులవారిని చంపాలని ప్రయత్నం చేసిన శిష్యుడు ఒకడుండే వాడు. ఈర్ష్యా, ద్వేషాలు పెరిగిపోతే వాటికి అంతు ఎక్కడుంటుంది. ఆయన అభినవ గుప్తుడని శాక్తేయుడు. ఆయనేం చేసాడంటే ఈయన కేవలాద్వైత

ప్రచారం చేస్తున్నారు. దీనివల్ల మిగిలిన వాదాలన్నీ పక్కకి వెళ్ళిపోతున్నాయి. శంకరుల వైభవముందు ఎవరూ తట్టుకోలేకపోతున్నారు. ఈయన్ని చంపేయాలనుకున్నారు. ఆభిచారిక ప్రయోగం చేసారు. అభిచారికా ప్రయోగం చేయటం వల్ల శంకరాచార్యుల వారికి భగందర వ్యాధి వచ్చేసింది. భగందర వ్యాధి చేత ఏమవుతుందంటే ఆసనంలో పెద్ద పుండు వస్తుంది. ఆ పుండు వెంటనే నొక్కుకుని అందులోంచి రక్తం కారిపోతుంది. అలా కూర్చోలేరు. ఒక పదినిమిషాలు కూర్చోవడం చాలా కష్టం. ఒకవేళ కూర్చున్నా పంచెంతా నెత్తుటితో తడిసిపోతుంది. శంకరులు శిష్యులకి భాష్యం చెప్పేవారు అలాగే. నదేహం అని చెప్పడమేమిటి? ఆ స్థాయిలో ఉన్నారు శంకరాచార్యులవారంటే అందుకని ఆయన పట్టించుకునేవారు కాదు. చిరునవ్వుతో ఉండేవారు. ఆయన రక్తంతో తడిసిపోయి వస్త్రం పుల్లటి కంపు వచ్చేది. అందుకని అరగంటకొకసారి లేచి ఆ వస్త్రం వదిలిపెట్టేవారు. వదిలిపెడితే పాపం తోటకాచార్యులవారు గబగబా వచ్చి ఆ వస్త్రాలు తీసుకుని నదిలో ఉతికి మళ్ళీపట్టుకొచ్చి ఆరేస్తుండేవారు. ఆ అభినవ గుప్తుడు అభిచారికా ప్రయోగం చేస్తే ఎందరో వైద్యుల్ని పిలిపించారు. వైద్యులందరూ వచ్చారు. శంకరాచార్యులవారికి తెలుసు తన మీద మంత్ర ప్రయోగం చేసారని. ఆభిచారిక ప్రయోగం వల్ల భగందర వ్యాధి వచ్చిందని శంకరాచార్యులవారికి తెలుసు. వైద్యులు వచ్చారు ఓషధులిచ్చారు. తగ్గలేదు.రక్తం అలా కారిపోతూనే ఉంది. అలాపోతే ఏమవుతుంది. మృత్యువుకి ఆసన్నమైపోతుంది. అభినవగుప్తుడు సంతోషిస్తున్నాడు. ఇంక శంకరుల శరీరం పడిపోతుందని.

ఈ సమయంలో శంకరాచార్యుల వారు నిర్వికల్ప సమాధిలోకి వెళ్ళి పార్వతీ పరమేశ్వరుల పాదారవింద సేవనం చేసుకుంటూ సమాధిస్థితిలో శంకరుణ్ణి ధ్యానం చేస్తూ ఉండిపోయేవారు. శంకరులలా గంటలు గంటలు కూర్చుని ధ్యానం చేస్తున్నారు. శంకరులని రక్షించమని అశ్వినీదేవతలను పంపించారు. అశ్వినీ దేవతలు ఓషధులు పట్టుకొచ్చారు. వాళ్ళు చూసి అన్నారు.

ఇది శరీరానికి వచ్చిన వ్యాధికాదు. ఎవరో మంత్ర ప్రయోగం చేస్తే భగందర వ్యాధి పుట్టింది. ఇది మందులకు లొంగదని వెళ్ళిపోయారు. పద్మపాదాచార్యుల వారు చూసారు. 'ఎవడురా నా గురువు మీద మంత్ర ప్రయోగం చేసినవాడు, ఆభిచారిక ప్రయోగం చేసినవాడు' అని పద్మపాదాచార్యులవారికి నరసింహ మంత్రోపాసన తెలుసు. వెంటనే వారు నరసింహ మంత్రోపాసన చేసారు. అభినవ గుప్తుని మీదకి నరసింహ స్వామి వెళ్ళిపడ్డాడు. పడేటప్పటికి వాడు తట్టుకోలేకపోయాడు. భగందర వ్యాధి శంకరాచార్యులవారికి తగ్గిపోవటం మొదలు పెట్టింది. అభినవగుప్తునికి వెళ్ళిపోవటం మొదలుపెట్టింది. వ్యతిరిక్తం అయింది. కొన్నాళ్ళకి అభినవ గుప్తుడు మరణించాడు. శంకరాచార్యులవారు స్వస్థులయ్యారు. అలా శంకరులని పద్మపాదులు దక్కించుకున్నారు. మా గురువుగారు వెళ్ళిపోతే మాకు మళ్ళీ ఎవరిలా చెప్పేవారు. మాకు ఎవరు చెప్తారు పాఠాలు అని. అందుకే గురువు తన శరీరంలో ఉండాలని కోరుకోడు. నిరపేక్షగా ఉంటాడు. నిస్వార్థంగా ఉంటాడు గురువు. గురువుకి స్వార్థం ఉండకూడదు. గురువుకి స్వార్థం ఉంటే అగ్నిహోత్రానికి చెదలు పట్టడం లాంటిదది. అందుకని అలాంటివి ఎందుకు కోరుకుంటాడు. ఆయన 'త్యాగేనైకే అమృతత్వ మానసుః' సమస్త కాలములయందు త్యాగమూర్తియై నిలబడాలి గురువు. అమృతప్రాయుడై ఉండాలి. అటువంటి వాడు వెళ్ళిపోతే మళ్ళీ మాకు అలా చెప్పేవాళ్ళు ఎక్కడ దొరుకుతారు. అందుకని ఆ గురువు శరీరంలో ఉండాలని శిష్యుడు కోరుకుంటాడు. ఆ శరీరానికి ఏదైనా ప్రమాదం వస్తే అందులోంచి వెళ్ళిపోతాడేమో గురువని అందులో నిలబెట్టుకోవటానికి శిష్యులు చూసుకుంటారు, అందుకని పద్మపాదాచార్యులవారు శంకరాచార్యుల వారిని నిలబెట్టుకున్నారు.

శంకరాచార్యులవారికి స్వస్థత కలిగింది. అంతేకాని ఆ రోగం తగ్గించుకుందాం, నేను బాగా ఉండిపోదాం అని శంకరాచార్యులవారు ఎప్పుడూ ప్రయత్నం చేయలేదు. తాను ఆత్మస్థితి గతుడై ఉండిపోయారు. అటువంటి

మహానుభావుడు శంకరుడంటే. ప్రస్థాన త్రయానికి భాష్యాలిచ్చారు. భగవద్గీత, బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు ఇవి ప్రస్థాన త్రయం అంటారు. ఆమూడింటికీ భాష్యాలిచ్చారు. శివానంద లహరి, సౌందర్య లహరి వంటి స్తోత్రాలు ఇచ్చారు. ఎందరో దేవతలమీద స్తోత్రాలు వ్రాసారు. అన్ని స్థాయిలలో ఉన్నవారికి కావలసిన సమస్త వాఙ్మయాన్ని శంకరులు ముప్పై రెండు సంవత్సరాలలో అందించేసారు. దేశం నాలుగు చెరగులా పాదచారియై పర్యటించారు. నాలుగు పీఠాలు పెట్టారు. ఎందరో శిష్యుల్ని పైకి తీసుకు వచ్చారు.

శంకర భగవత్పాదులు పరమ కారుణ్యులు. వారు గొప్ప జ్ఞాని. సాక్షాత్తు శివావతారులు. అటువంటి వారికి ఎంత కరుణ చూడండి. మీరు కనకధారా స్తోత్రమే ఉదాహరణ తీసుకోండి. శంకరాచార్యులవారు కనకధారాస్తోత్రం తనకు ఒక గుప్పెడు అన్నం పెట్టమని చేశారా? చెయ్యలేదు. మనందరికీ అన్నం పెట్టమని అన్నపూర్ణాష్టకం చేసి ఆయనేం కోరుకున్నారు అమ్మా 'జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం భిక్షాందేహిచపార్వతీ' అన్నారు. అమ్మా జ్ఞానవైరాగ్యాలను కటాక్షించు అన్నారు. ఎన్నో స్తోత్రాలనిచ్చారు. అటువంటి శంకరులు ఒక బ్రాహ్మణ గృహిణికి ఉపకారం చెయ్యాలని కనకధారాస్తోత్రం చేశారు. అలాగే అన్నిటికన్నా మహోత్కృష్టమైన త్యాగం శంకరాచార్యులవారి జీవితంలో వారి కారుణికతకి ఇంక ఎల్లలు లేవు. దానికి హద్దు లేదు. అసలు మీరు దానిని కొలవలేరు. ఎంత త్యాగమయ మూర్తి అంటే వారు శ్రీశైలం విజయం చేశారు ఒకసారి. ఆంధ్రదేశంలో శ్రీశైల పట్టణానికి వచ్చారు. శంకరులు పాదచారియై ఆసేతు హిమాచలం పర్యటించారు. దానిలో భాగంగా శ్రీశైలానికి. వచ్చినప్పుడు ఇప్పుడు ఉన్నట్టుగా లేదు శ్రీశైలం. శ్రీశైలానికి పూర్వం ఒక లక్షణం ఉండేది. ఏమిటా లక్షణం అంటే రెండిటిచేత శ్రీశైలం ఒక గొప్ప క్షేత్రం. ఒకటి 'శేషాద్రిశృంగే శ్రీశైలశృంగేసదావసంతం శేషాద్రిశృంగే వివిధప్రసంగే' అని శ్రీశైలంలో అనేకమైన ఓషధులు దొరుకుతాయి. అందులో బంగారం తయారు చేసే ఓషధులు కూడా దొరుకుతాయి అని పూర్వకాలం ఆ వేరు తీసి ముట్టిస్తే

బంగారం అయిపోతుంది అని దాని కోసం కూడా వెతుకుతుండేవారు. ఇప్పటికీ అక్కడ రత్నగర్భగణపతి ఉన్నారు. అందుచేత శ్రీశైల క్షేత్రానికి ఓషధుల చేత గొప్ప శక్తి కలిగిన క్షేత్రం. రెండు శ్రీశైలంలో తొందరగా మనోలయమైపోతుందంటారు. మీకొక్క హిమాలయాలలో తప్ప అంత తొందరగా భూమండలంలో దక్షిణ భారతదేశంలో మనోలయం చేయగలిగినటువంటి పరమోత్కృష్టమైన క్షేత్రంగా శ్రీశైలానికి పేరు. అందుకే శంకరభగవత్పాదులు రత్నావళీ స్తోత్రం చేసేటప్పుడు ఓ మాటంటారు. అందులో నేను 'శ్రీశైల శృంగకుహరేషు ఖగౌపలక్ష్యే గాత్రం యదామ మలతాః' అని నేను శ్రీశైలంలో ఉండే ఒక గుహలోకి వెళ్ళి కూర్చుంటే నా మనసు లయమైపోతే నేను కదిలినంత కాలం ఏ కదలిక లేకుండా మనోలయమైపోయి నేను కూడా ఒక స్థావరంలా అలా ఉండిపోతే అప్పుడు ఇది కదలదురా అని నమ్మి ఏం చేయాలి. 'శ్రీశైల శృంగకుహరేషు ఖగౌపలక్ష్యే గాత్రం యదామమలతాః పరివేషయంతి. కర్ణేయదాః విరచయంతి ఖగా ఛరిదా తదా ....' అక్కడ ఉన్నటువంటి తీగలు వచ్చి అల్లుకుంటాయిట. మీరో చిక్కుడు పాదు పెట్టి అక్కడ కెళ్ళి కూర్చున్నారనుకోండి ఓ నాలుగు రోజులు చిక్కుడు తీగ మిమ్మల్ని అల్లుకోదు. దానికి తెలుసు వీడు లేచి వెళ్ళిపోతాడని. అక్కడో రాయి పడుందనుకోండి. ఆ రాయిని అల్లుకుంటుంది. ఇది కదలదురా అని దాన్ని ఆధారం చేసుకుంటుంది. శ్రీశైలంలో గొప్పతనం ఏమిటో తెలుసాండి. అక్కడ గుహలలో తపస్సు చేస్తే తొందరగా మనోలయమైపోయి కదలికలేని స్థితిని పొందుతారుట. పొందితే చుట్టూ ఉన్నటువంటి తీగలు వచ్చి అల్లుకుంటాయి. ఇది కదలదురా ఇక్కడ మనం గూడు పెట్టుకోవచ్చని పక్షులు పుల్లలు తెచ్చి చెవిలో పెట్టి గూళ్ళు కట్టుకుంటాయిట. నాకెప్పుడు వస్తుందో అటువంటి స్థితి అన్నారు శంకరులు. శంకరులు చేసిన శివానందలహరిలో మధ్యలో ఉన్న శ్లోకం 'సంధ్యారంభ విజృంభితం శ్రుతి శిరస్థానాంతరాధిష్ఠితం'. సంధ్య రెండు కాలముల మధ్యలో ఉంటుంది. ఆ శ్లోకం పుస్తకానికి నూరు శ్లోకాలకి మధ్యలో

ఉంటుంది. శ్రీశైల క్షేత్రం మనోలయమై సంకల్ప వికల్పాలకు మధ్యనుండే ఆత్మస్థితిని చూపించగలిగిన క్షేత్రం కనుక శ్రీశైల క్షేత్రాన్ని శంకరాచార్యులవారు అక్కడ చూపించారు.

అంత పరమోత్కృష్టమైన శ్రీశైల క్షేత్రానికి శంకరులు వచ్చారు. వచ్చి ఒకనాడు తన ఆశ్రమంలో తను నిర్మించుకున్న చిన్న కుటీరంలో కూర్చుని ధ్యాన నిమగ్నులై ఉన్నారు. వారు కన్నులు తెరిచేసరికి ఎదురుగుండా ఒక కాపాలికుడు నిలుచుని ఉన్నాడు. కాపాలికుడు అంటే వారిది వామాచారం. చాలా వ్యగ్రమైన పూజ చేస్తారు. అది అనుసరణీయమైన పద్ధతి కాదు. అలా చేయకూడదు. ఎవరో తెలియక ఎక్కడో చేస్తే దాన్ని అమ్మవారు చూస్తుంది. తప్ప సాధారణంగా నాగరికత ఉన్నవారు చేయకూడదు వామాచారం. కాపాలికుడు వచ్చి ఒక మాట అడిగారు శంకరాచార్యులవారిని. నేను ఒక గొప్ప స్థితిని చేరుకున్నాను. నేనిప్పుడు ఒక అగ్నిహోత్రాన్ని చేస్తున్నాను. ఆ అగ్నిగుండంలోకి ఒక సార్వభౌముడైన రాజు, ఒక పరిపాలకుని శిరస్సునైనా అందులో వేయాలి. లేకపోతే ఒక మహాజ్ఞాని శిరస్సునైనా అందులో వేయాలి. ఒక సార్వభౌముని శిరస్సు నాకు దొరకదు కదా నీవు మహాజ్ఞానివి కదా. దేహం అని భ్రాంతి లేదు కదా. ఈ దేహం నేను కాదు అని చెప్పినవాడవు కదా. అందుచేత నీ శిరస్సు నాకిస్తే నేను అగ్నిహోత్రంలో వినియోగిస్తాను అన్నాడు. శంకరులు ఒక నవ్వు నవ్వారు. నోటితో చెప్పడం వేరండి. అనుష్ఠానంలో పెట్టుకోవడంలో చాలాతేడా ఉంటుంది. నోటితో చెప్పినంతా అనుష్ఠానంలోకి రావడమంటే మాటలు కాదు. అది శంకరులకి చెల్లింది. చంద్రశేఖర పరమాచార్య స్వామికి చెల్లింది. రామకృష్ణ పరమహంసకి చెల్లింది. అందరికీ చెల్లుతుందా అంటే ఎవరికి వారు నిరూపించుకోవాలిసిన విషయం అది. అందుచేత శంకరభగవత్పాదులన్నారు. నా శిరస్సుకదా నీకు కావలసింది. తప్పకుండా తీసుకో కానీ నేను రేపటిరోజు ఉదయం సమాధిమగ్నుడనై ఉంటాను. నా శిష్యులందరూ పాతాళ గంగలో స్నానంచేయటానికి

వెళ్ళిపోతారు. వాళ్ళు చూస్తుండగా నా శిరస్సు తీస్తే వాళ్ళు అంగీకరించరు. ఎందుకంటే గురువు శరీరంతో ఉండాలని వాళ్ళు కోరుకుంటారు. అందుకని వాళ్ళు పాతాళగంగకి వెళ్ళిపోయినప్పుడు నేను సమాధిమగ్నుడనై ఉన్నప్పుడు నువ్వు వచ్చి నా శిరస్సును ఉత్తరించి తీసుకుని అగ్నిహోత్రంలో వ్రేల్చుకో అన్నారు.

మరునాడు శిష్యులందరూ పాతాళగంగకి వెళ్ళిపోయారు. శంకర భగవత్పాదులు కూర్చుని ధ్యానమగ్నులై ఉన్నారు. కాపాలికుడు వచ్చి కత్తితీసి శంకరుల శిరస్సును నరకబోతున్నాడు. అదే సమయంలో పాతాళగంగలో స్నానం చేస్తున్న పద్మపాదాచార్యులవారికి కొన్ని నిమిత్తాలు తోచాయి. గురువు శరీరానికి ఏదో ప్రమాదం వాటిల్లుతోంది అని. వెంటనే ఆయన నరసింహ మంత్ర ఉపాసకులు కనుక లక్ష్మీనరసింహ స్వామిని స్తోత్రంచేసారు. చేసేటప్పటికి ఎక్కడినుంచి వచ్చిందో తెలియదు. ఇది పరమయథార్థంగా జరిగిన సంఘటన. శంకరుల జీవితంలో నేను చెప్పినవన్నీ యథార్థాలు. అందులో కల్పితాలు లేవు. ఒక బ్రహ్మాండమైన సింహం ఒకటి వచ్చి కత్తి తీసి శంకరుల శిరస్సు నరకడానికి ఉద్యుక్తుడవుతున్న కాపాలికుడి మీద పడి తునా తునాకలుగా ఖండించింది. శంకరులు లేచి నరసింహస్వామిని స్తోత్రం చేసారు. అంతటి ఉదారబుద్ధి శంకరభగవత్పాదులది. తన శరీరం మీద కూడా భ్రాంతి లేనటువంటి మహాపురుషులు. వారు ఎంత కారుణికులు అంటే వారు ఒకనాడు మూకాంబికాక్షేత్రానికి వెళ్ళారు. దక్షిణభారతదేశం వెళితే తల్లిదండ్రులకు ఒక్కడే కుమారుడు. కుమారుడు మరణించాడు అకాలంగా. ఆ తల్లిదండ్రులు ఇద్దరూ ఆ కొడుకు పార్థివ శరీరాన్ని అక్కడ పెట్టుకుని ఏడుస్తున్నారు. శంకరభగవత్పాదులు అటుగా వెళ్ళిపోతున్నారు. నాయందు కరుణించి ఆ తల్లిదండ్రుల శోకాన్ని చూడలేకపోతున్నాను. ఆ పిల్లవానికి ఆయుర్దాయం ఇవ్వమని ప్రార్థనచేసారు. వెంటనే పరమేశ్వరుడు కటాక్షించాడు. మరణించిన పిల్లవాడు నిద్రలోనుంచి లేచినట్టు లేచి అమ్మా, నాన్నా అంటూ వాళ్ళిద్దరినీ కౌగిలించుకున్నాడు. ఇదీ శంకరాచార్యుల వారి అపారమైన కరుణ.

శంకరులు తన సిద్ధాంతాన్ని ప్రవచనం చేసి వెళ్ళిపోలేదు. అందుకే శంకర భగవత్పాదులు ముప్పై రెండు సంవత్సరాలు జీవించారు. ఎనిమిది సంవత్సరాలు బాలశంకరులు, మరొక ఎనిమిది సంవత్సరాలు సన్యాసిగా ఆశ్రమంలోకి ప్రవేశించి గోవిందపాదాచార్యుల వారిని చేరుకుని భాష్యాలు రచించారు. మిగిలిన పదహారు సంవత్సరాలు తన భాష్యాలను ప్రచారం చేశారు. చేతిలో కర్ర పట్టుకున్నారు. వ్యవసాయదారుడు ఎప్పుడూ కర్ర లేకుండా ఆఫీసుకు వెళ్ళేవాడు పోయినట్టుగా ఏదో ఇలా రెండు చేతులు వెనక్కి కట్టుకుని స్నేహితులతో మాట్లాడుతూ గట్టుమీద నడవడు. రైతు గట్టుమీద నడుస్తున్నప్పుడు నడిచే విధానాన్ని మీరు చూడాలి. చేతిలో కర్ర పట్టుకుని తలకి పాగా చుట్టుకుని తన కాళ్ళకి చెప్పులు లేకపోయినా చాలా పరిశీలనాత్మకమైన....దృష్టితో తిరుగుతుంటాడు. ఒక ఎలక కనపడిందనుకోండి టక్కున ఒక దెబ్బ వేస్తాడు. ఒక పాము కనపడిందనుకోండి టక్కున ఒక దెబ్బ వేస్తాడు. రెండు మొక్కలు గాలికి ఒకదాన్ని ఒకటి పెనవేసుకుని వంగిపోతున్నాయి అనుకోండి. చాలా అందంగా అందులోకి దిగి విడదీసి ఆ మొక్కకు మళ్ళీ మట్టి కొంచెం పెట్టి నిలబడేటట్టు చేస్తాడు. శంకరులు చేసింది కూడా అంతే. చేతిలో సత్యదండాన్ని పట్టుకుని ఎవడు వేదానికి విరుద్ధమైన ప్రసంగాలు చేస్తున్నాడో ఎవడు సరి అయిన సిద్ధాంతాన్ని ప్రబోధం చెయ్యకుండా ఇష్టం వచ్చిన సిద్ధాంతానికి రూపకల్పన చేసి వేద విరుద్ధమైన మార్గాన్ని ప్రచారం చేస్తున్నాడో, దాన్ని ఖండన చేశారు. శంకరులు చేసింది కేవలం తన సిద్ధాంత ప్రచారం కాదు. అన్య సిద్ధాంత ఖండనం ఎంత చేశారో మహానుభావులు. అందుకని చేతిలో జ్ఞానదండం పట్టుకున్నారు. అందుకే వారికి శిఖ ఉండదు. శిఖ లేకపోడానికి కారణం వారి శిఖ జ్ఞానశిఖ అన్నారంతే. ఏమిటా స్వరూపం? పోతపోసిన జ్ఞానం అంతే. అటువంటి స్వరూపులై చేతిలో సత్యదండాన్ని జ్ఞానదండాన్ని పట్టుకుని భాష్యాలన్నింటిని ప్రచారం చేశారు. శంకరుల గొప్పతనం ఎక్కడుందంటే, వారు కేవలాద్వైత సిద్ధాంత ప్రచారం చేసినపుడు, అందులో

షణ్మత స్థాపకులయ్యారు. ఏయే స్వరూపాన్ని ఆరాధన చేసి మోక్షాన్ని పొందవచ్చో స్థిరీకరించారు.

చాలా మంది ఒక మాట అంటుంటారు. శంకరాచార్యులవారు ఇలా విభూతి పెట్టుకున్నారు కనక ఆయన ఏదో శివభక్తుడు, ఆయన విష్ణువు పట్ల ద్వేషి అనుకుంటారు. శంకరాచార్యులవారు అలా ఎప్పుడూ చెయ్యలేదు. షణ్మత స్థాపానాచార్యులైన శంకరాచార్యులు శ్రీమహావిష్ణువుని వరతత్త్వంగా అంగీకరించి విష్ణు పూజ చేసి నారాయణానుగ్రహంతో మోక్షాన్ని పొందవచ్చు అని స్థిరీకరించారు ఆయన. విష్ణుసహస్రనామ స్తోత్రానికి భాష్యం చేశారు. కనకధారాస్తోత్రం చేశారు. కృష్ణుని మీద ఎన్ని స్తోత్రాలు రచించారో మహానుభావులు. ద్వేషాలు, రాగాలు, అహంకారాలు అలాంటివి శంకరా చార్యులవారికి లేవు అసలు. అందుచేత మహానుభావుడు అద్వైత సిద్ధాంత వ్యాప్తి చేశాడు. కేవలాద్వైత సిద్ధాంతానికి ప్రాణప్రదమైన మాటలు మూడు ఉన్నాయి. ఒకటి 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి' ఎవడు బ్రహ్మమును తెలుసు కొనుచున్నాడో, వాడు బ్రహ్మమగుచున్నాడు. రెండు జీవునకూ, బ్రహ్మానికి భేదం లేదు. రెండూ ఒక్కటే. ఈ రెండు కాకుండా మూడవ సిద్ధాంతం ఒకటి ఉంది. అద్వైత సిద్ధాంతంలోనే ప్రాణప్రదమైన సూత్రం. 'జగన్మిథ్య బ్రహ్మసత్యం జీవోబ్రహ్మస్సనాతనః' ఈ మూడే ప్రాణప్రదమైన సూత్రాలు. ఈ మూడిటీ చేత 'అహంబ్రహ్మాస్మి' ఏర్పడుతుంది. ఆయన అన్నారు జగన్మిథ్య బ్రహ్మసత్యం.

శంకరులు అన్నారు ఉన్నది ఒక్కటే పదార్థం. ఈ జగత్తు లేదు అంటే మనం అంగీకరిస్తామా అంత తొందరగా? జగత్తులేకపోవడం ఏమిటండీ మైకు లేదా, స్టూల్ లేదా, ఫ్యాన్ లేదా, ఇది లేదా, మీరు లేరా, మేము లేమా? ఇన్ని ఉండగా జగత్తు లేదు బ్రహ్మ సత్యం. శంకరులు అన్నారు జగన్మిథ్య. అది మిథ్య అందుకని శంకరాచార్యులవారి గురించి తెలిసీ తెలియని వాళ్ళన్నారు. ఆయన మాయావాది అన్నారు. ఆయన మాయావాది కాదు

మాయ అంటే ఏమిటో చెప్పారు ఆయన. మిథ్య అంటే యథార్థానికి ఏ రకమైన అస్తిత్వం లేకపోయినా ఉన్నట్టు కనపడేది. మీరు జ్ఞానంచేత తెలుసుకుంటే పోయేటటువంటి స్వరూపం ఉన్నదాన్ని మిథ్య అంటారు.

ఒకడు చీకటిలో వెళ్ళిపోతున్నాడు. సాధారణంగా ఇదే ఉపమానం చెప్తుంటారు. వాడు చీకటిలో వెళ్ళిపోతున్నాడు. అక్కడొక తాడు పడి ఉంది. వాడి మనస్సులో పాము ప్రవేశించింది. అమ్మో ఈ రోడ్డులో నల్లత్రాచొకటి సంపంగి చెట్టు కిందకి వెళ్తుంది అంటాడు. నల్లత్రాచు ఇక్కడ లేదుకదా? అనుకున్నాడు. అంతకుముందే ఎవరో పిల్లాడు ఆడుకుని ఆడుకుని అక్కడ ఒకతాడు క్రింద పడేశాడు. ఆ త్రాడు చూసాడు. అమ్మో ఇదిపామే అనుకుని ఆగిపోయాడు. ఆగిపోగానే భయం ఏర్పడింది. శరీరంలోంచి చెమట పుట్టింది. ఒళ్ళంతా వణుకుతోంది. ఇదే సమయంలో గాలి వీచింది. ఆ తాడు కదులుతోంది. అదిగో పడగ విప్పి ఆడుతోంది అనుకున్నాడు. ఇంతలోకే ఎక్కడనుంచో గాలివీయటంతో చప్పుడు వచ్చింది. అదిగో బుస్సు బుస్సు అంటోందనుకున్నాడు. భయపడిపోయాడు. పామున్నదా? తాడున్నదా? ఉన్నది తాడే. పక్కనున్నవాళ్లు ఒరేయ్ అది పాము కాదురా తాడు అని చెప్పారనుకోండి వాడు వెళ్ళలేదు దగ్గరికి. ఎందుకు వెళ్ళలేదంటే వాడు దాని కదలికయందు శబ్దమునందు ఆకృతియందు పామును దర్శనం చేస్తున్నారు. ఇప్పుడు ఎలాపోతుంది దాని భయం. ఇప్పుడు ఎవరో పక్కింటాయన కుక్కని వదిలేసి తలుపులేసుకుని పడుకుందామని బయటికి వచ్చాడు. ఏమిటి మాస్టారు ఏమిటి అలా నుంచున్నారు అన్నారు. అదిగోనండీ పాముందక్కడ అన్నాడు. పామా అని లోపలికెళ్ళి ఒక పెద్ద టార్చిలైటు పట్టుకొచ్చి వేసాడు. వేసేటప్పటికి ఆ టార్చిలైటు కాంతిలో అది ఒక తాడు. ఇప్పుడా వ్యక్తి అది తాడు అని తెలుసుకున్నాడు. తాడు అని తెలుసుకున్న తర్వాత సత్యమెప్పుడైతే తెలిసిందో పాము కాదు అని తెలిసిందనుకోండి. మళ్ళీ ఇంక బుస ఒకసారి పోవడం. ఒక గంట పోయాక పడగలేదని తెలుసుకోవటం ఇన్నుంటాయా? ఎప్పుడైతే

అది పాము కాదు అని తెలిసిపోయిందో అయ్యయ్యో అనవసరంగా భయపడ్డాంరా! అది పాము కాదు దానికి బుసా లేదు. అది పడగాకాదు. అనవసరంగా భయపడ్డాను. అనవసరంగా చెమటలు పట్టాయి. ఇప్పుడు చెమటపోయింది. వణుకు పోయింది పడగ పోయింది. బుస పోయింది కదలిక పోయింది. ఇన్నీ పోయాయి. ఎందుకు పోయాయి. సత్యం తెలిసిపోయింది. ఉన్నది బ్రహ్మమే నువ్వేంచేసావు? జగత్తును ఆరోపించావు దానిమీద. దీన్ని వివర్తనావాదం అంటారు కేవలాద్వైత సిద్ధాంతకర్తలు.

జగత్తును తీసుకుని బ్రహ్మమునందు ఆరోపించిన తర్వాత నీకు జగత్తు కనబడుతోంది. నువ్వు ఆరోపించిన జగత్తుని జ్ఞానం చేత తీసేయి. నీకు బ్రహ్మమొక్కటే కనబడుతుంది. ఉన్నది బ్రహ్మమే. కేవలం బ్రహ్మమొక్కటి మాత్రమే మిగిలిపోతుంది. నానాత్వంలో నుంచి ఏకత్వం వైపుకు వెళ్ళిపోతుంది. నామరూపాలే మాయ. అంటే ఎలా కుదురుతుందండీ. మీకు నేను ఒక తేలిక మాట చెప్తాను. మా ఇంట్లో బంగారపు ముద్ద ఉంది. నేను పట్టుకెళ్ళి కంసాలి ఆయనకిచ్చాను. అయ్యా గాజులు చేయండి అన్నాను. గాజులు చేయండి అంటే ఆయన ఏంచేస్తాడు. మీ చేతి కొలత తీసుకుంటానంటాడు. అంతేకాని దీంతో రెండు గాజులు చేయండి అన్నాననుకోండి. మీ నడుము కొలత తీసుకుంటాను అంటాడా? అనడు. గాజు అనగానే అదిచేతికి వేసుకునే ఆభరణం. కాబట్టి ఒక ప్లాస్టిక్ గాజు ఎక్కిస్తాడు. ఇవిగోనండీ ఇలా పెడతాను. ఇంతపెడతానండి ఇలా తీసుకోవడానికి బాగుంటుంది. వేసుకోవడానికి బాగుంటుంది. ఇక్కడి వరకు కదులుతుంటుంది. ఇప్పుడు లేటెస్టు డిజైను ఈ డిజైను పెడతానండీ. చర్మం కూడా కోసుకోదు అంటాడు. మళ్ళీ తరుగు ఎక్కువపోదండీ కరిగించినాకూడా. ఇవన్నీ ఆయన దేన్ని దృష్టిలో పెట్టుకుని మాట్లాడుతున్నాడు. గాజును దృష్టిలో పెట్టుకుని కాదు బంగారాన్ని దృష్టిలో పెట్టుకుని మాట్లాడుతున్నాడాయన. ఇన్ని తులాల బంగారం ఉంటే ఈ రెండు గాజులవుతాయి అంటాడు. అప్పుడు మీరేమిస్తారు గాజులకోసం

బంగారమిస్తారు. బంగారమేమైంది. గాజులైంది. ఇప్పుడు నేను గాజులు తీసేసాను బంగారంలోంచి అంటే కరిగించేసాను ఏమయింది మళ్ళీ గాజులు బంగారమైపోయింది. గాజులుగా లేకపోయినా బంగారం ఉంది. బంగారం లేకపోతే గాజులు రావు.

బ్రహ్మంలేకుండా మీకు జగత్తులేదు. జగత్తు లేకపోయినా బ్రహ్మ ముంటుంది. అందుకే శంకరాచార్యులవారు చిత్రమైన మార్గం చెప్పారు. ఈశరీరం నువ్వా? ఇదిగో నా ఉత్తరీయం అంటారు. అలాగే నా పంచె అంటారు. నా లాల్చీ అంటాను. నా చెయ్యి అంటాను. నా పంచె అన్నప్పుడు పంచె నేను కాదుగా? పంచె చిరిగిపోతుంది. నేనేం చిరిగిపోనే. ఉత్తరీయం చిరిగిపోతుంది. నేను చిరిగిపోను. నా చెయ్యి కానీ దీనియందు భ్రాంతి కొంచెం పెంచుకుంటారు. ఇదే మెయిన్ అనుకుంటారు. కానీ చెయ్యి నేనుకాదు. చెయ్యి నేనైతే నా చెయ్యి అని ఎందుకంటాను. నేను అని చెప్పబడుతున్న యజమాని లోపల ఉన్నాడు. వాడు జీవుడని నీవు అనుకుంటున్నావు. వాడు జీవుడు కాదు. వాడే బ్రహ్మం మాయ అనబడే నామరూపాలనే పొర తీసేస్తే జీవుడే బ్రహ్మమైపోతాడు. ఇది నువ్వు తెలుసుకుంటే 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి నువ్వు బ్రహ్మంగా నిలబడి పోయావంతే ఇప్పుడే ఇక్కడే ఈ క్షణంలో నువ్వు ముక్తిని పొందేసావు. అంతే నీకు ముక్తిరావాలంటే ఎక్కడో చచ్చిపోవటం ఏదో అయిపోవటం ఏమీ ఉండవు. ఇక్కడే ఇప్పుడే పొందుతావు. ప్రారబ్ధం అయిపోయేంతవరకు నువ్వు కేవలం శరీరంలో ఉంటూ ఆ ప్రారబ్ధం అయిపోయేంత వరకు జీవన్ముక్తుడిగా ఉండి తుట్టతుదకు శరీరాన్ని విడిచిపెట్టేస్తావు. అందుకే మహాత్ముల విషయంలో మరణం లేదు. మరణ మేమిటండీ? మరణం ఎవరికి? శరీరభ్రాంతి ఉన్నవారికి మరణం నే చచ్చిపోతా నే చచ్చిపోతా అని ఎవడు బెంగెట్టుకుంటాడో వాడికి చావు. శరీరం చచ్చిపోతుంది శరీరం చచ్చిపోతుందన్నవాడికి అసలు నాకు చావులేదు మొర్రో అని మహాత్ములు కొట్టుకున్నారు.

రమణమహర్షి ఎప్పుడూ నేను చచ్చిపోతానని అనలేదు. శంకరాచార్యుల వారు ఎప్పుడూ నేను చచ్చిపోతానని అనలేదు. ఎందుకనలేదు. నేను ఆత్మ స్వరూపిని నాకు చావేమిట్రా అన్నాడాయన. ఇది కాల్చబడదు. ఇది తడపబడదు. ఇది ఛేదింపబడదు. ఇది నశింపబడదు. నేను ఎప్పుడూ ఉంటాను. నేనెవరు. 'చిదానందరూపశ్శివోహం శివోహం' నేను ఆనందరూపుణ్ణి, మంగళప్రదుణ్ణి ఎప్పుడూ ఉండేవాడిని. నేను ఒకనాడు ఈ శరీరం వదిలేస్తానంతే. ఇది పోతుందిరా. ఇది ఉండమంటే ఉండేది కాదు. సత్యం చెప్పారాయన. నీకు తెలియక నువ్వు మరణం అంటున్నావు. వారికి మరణం లేదు. శంకరులు ఎప్పుడూ మరణం గురించి మాట్లాడలేదు. శంకరులు అద్వైతసత్యం చెప్పారు. ఉన్నదొక్కటే పదార్థం అదినేను. నాకు మరణంలేదు. ఉన్నది మరణం శరీరానికి. శరీరం మరణించడం చాలా సహజమైన విషయం ఎందుకు బెంగెట్టుకుంటావు. బెంగపెట్టుకున్నా ఇది మరణిస్తుంది. నువ్వు ఏ బెంగా పెట్టుకోకపోయినా ఇది మరణిస్తుంది. మరింకెందుకేడుస్తావు. అదే అడిగారు కృష్ణపరమాత్మ భగవద్గీతలో 'నానుశోచంతి పండితాః' ఇది నేను కాదు అని తెలిసున్నప్పుడు ఇంక దీనిగురించి ఎందుకేడుస్తావు. లోపలున్నది నువ్వు అయినప్పుడు అదిపోదు కాబట్టి ఎందుకేడుస్తావు. అసలు నీకు ఏడుపు లేదు. నువ్వు చిదానంద రూపుడివి. నువ్వు ఆత్మస్వరూపుడివి. నువ్వు ఆనంద రూపుడివి. అందుకే రాచపుండు పుడితే రామకృష్ణ పరమహంస బెంగెట్టుకోలేదు. సర్కోమా వస్తే రమణమహర్షి బెంగెట్టుకోలేదు. పదహారేళ్ళు పూర్తికాగానే వ్యాసుడు కనబడితే శరీరం వదిలేస్తానన్నారు శంకరాచార్యులవారు. ఇంకొక్క పదహారేళ్ళు ఉండన్నారు. అదేదో అద్దెఇంట్లో ఉన్నవాడు పైనుంచి కారిపోతోందండీ ఇల్లు ఖాళీ చేసేస్తాం అన్నారనుకోండి. అయ్యా మీలాంటి వాడు మళ్ళీ దొరుకుతాడా ఇల్లు బాగుచేయిస్తాం. మీరింకా కొన్నాళ్ళు ఉండిపూజలు చేసుకుంటుంటే మీరీ ఇంట్లోకి వచ్చిన తర్వాత మాకు కలిసివచ్చింది. ఏదో ఇంకొక్క నాలుగేళ్ళు మీరున్నారంటే మా అబ్బాయికి

ఉద్యోగం వచ్చేస్తుంది. ఇంజనీరింగు అయిపోగానే అని మా నమ్మకం. ఏదో ఇల్లు బాగు చేయిస్తాను ఇంకొక్క నాలుగేళ్ళు ఉండండని అన్నాడనుకోండి. యజమాని ప్రార్థన మీద ఒక అద్దె ఇంటిలో ఉన్న వ్యక్తికి ఆయింటియందు సంగం లేకుండా నాలుగేళ్ళ తర్వాత ఖాళీ చేసేయడానికి మానసికంగా సిద్ధపడిపోయినవాడికి ఇంటితో తాదాత్మ్యం ఎలా లేదో వ్యాసుడిచ్చిన 16 సంవత్సరాలకోసమని శరీరంలో ఉన్న శంకరుల వారికి శరీరంతో సంగం లేనేలేదు. వారు ఎప్పుడూ ఉన్నాడు. అప్పుడూ ఉన్నారు. ఇప్పుడూ ఉన్నారు. ఎప్పుడూ ఉంటారు. శంకరాచార్యులవారు. ఉండకపోతే నిన్ను ఎలా ఉద్ధరిస్తారు. వారు ఉన్నారు.

కనుక నువ్వు వారి మార్గంలో ప్రయాణించాలి. ప్రయాణించి వారిని చేరుకోవాలి. 'తమసోమా జ్యోతిర్గమయ మృత్యోర్మా అమృతంగమయ' మృత్యువు నుంచి అమృతత్వాన్ని చేరుకో చీకటిలోంచి వెలుతురులోకి చేరుకో. అవిద్యలో నుంచి విద్యలోకి చేరుకో ఇది శంకరులు చెప్పిన భావన. ఇది శంకరులు వ్యాప్తి చేసిన అద్వైత భావన. అందుకని శంకరులు మనకిచ్చిన వరమేమిటి? మనకందరికీ భయం మృత్యుభయం. అజ్ఞానం చేత దాన్ని తీసి అవతలపారేసారు శంకరాచార్యులవారు. దేనికి భయపడతావు. నీ పంచె ఎలా చిరిగిపోతుందో అలా ఇది చిరిగిపోతుంది. ఇది కదులుతోంది. 'బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థా... శ్రీ దక్షిణామూర్తయే.' ఒకనాడు నేను బాల్యంలో ఉన్నాను. నేను ఏలూరులో కెబిడిటి హైస్కూల్లో చదువు కుంటున్నప్పుడు సాయంకాలం క్రికెట్ ఆడుకోవటం పున్నాగ చెట్టుకింద పడినటువంటి పున్నాగపూలు ఏరుకుని వాటి కాడలు తుంచి అందులోంచి శబ్దమొచ్చేటట్టు ఊదుకోవడం. మా తమ్ముడితో కలిసి ఆడుకోవడం నాకు జ్ఞాపకం ఉంది. అప్పుడు నేను పిల్లవాడిని అని లోపల ఒకటి గుర్తించింది. ఆ తర్వాత నాలో యవ్వనం అంకురించింది. ఈ శరీరానికి యవ్వన మొచ్చినప్పుడు ఈ శరీరం వేరొక స్త్రీని వివాహమాడాలి. ఈ శరీరంతో నేను కొంతమంది

సంతానాన్ని కనాలి. ఇప్పుడిది మంచి దారుఢ్యంలో ఉంది. ఇది ఊడిగంచేసి కొంత డబ్బు సంపాదించాలి. ఇది ఉద్యోగం చేసుకోవాలి. అని ఈ శరీరానికి బలమున్నదన్న విషయాన్ని కూడా ఒకనాడు నేను గుర్తించాను.

ఒక్క మూడు సంవత్సరాల క్రితం ఈ కన్ను సరిగ్గా చూడలేకపోతోంది. పూర్వం ఇలా పెట్టుకుంటే పుస్తకం చదివిన వాడిని ఇప్పుడిలా దూరంగా జరగవలసి వస్తోంది. ఇలా పెట్టుకుని నేను చదవలేకపోతున్నాను. ఈ కన్ను పూర్వంలా చూడలేకపోతోందని కూడా ఒకటి లోపల తెలుసుకుంది. అది తెలుసుకొని నేను కంటి డాక్టరు దగ్గరికి వెడితే నాకు కళ్ళజోడు ఇచ్చాడు. అదెట్టుకుంటే ఇలా చూడగలుగుతున్నాను. ఇంకొక పదేళ్ళు పోతాయి. పదేళ్ళు పోతే ఇప్పుడు నేను ఇంత దారుఢ్యంతో అరచి మాట్లాడుతున్నట్టు మాట్లాడలేకపోతే కోటేశ్వరరావు నువ్వు నీరసపడ్డావు. నీ శరీరం జర్జరీభూతమైంది. నవ్వు వృద్ధుడవయి పోయావు. కొన్ని సభలు తగ్గించుకో. అంతెక్కువ మాట్టాడకు. ఇప్పుడు నువ్విహ మాట్లాడలేవు. కొన్నాళ్ళు ధ్యానం చేయడం నేర్చుకో నీ శరీరం నీరసించిందిరా అనికూడా లోపలున్నది తెలుసుకుంటుంది. అది ఈ శరీరం వెళ్ళిపోతున్నప్పుడు తెలుసుకోదా? అప్పుడూ తెలుసుకుంటుంది. ఇది వెళ్ళిపోతోంది అని తెలుసుకుంటుంది. కానీ ప్రమాదమెక్కడొస్తుందంటే ఏది వెళ్ళిపోవడం సత్యమో దాన్ని మనం పట్టుకుంటున్నాం అది అజ్ఞానం.

ఇది వెళ్ళిపోవటం సత్యం సత్యం పునః సత్యం. తాతగారు వెళ్ళిపోయారు తండ్రిగారు వెళ్ళిపోయారు. తల్లిగారు వెళ్ళిపోయారు. పక్కింటాయన వెళ్ళిపోయారు. ప్రధానమంత్రిగారు వెళ్ళిపోయారు. ఇతఃపూర్వ రాష్ట్రపతులు వెళ్ళిపోయారు. ఎందరో వెళ్ళిపోయారు. నువ్వు చరిత్ర చదివావు. నేను ఉండిపోతానన్న భ్రాంతి నీకెందుకు. యస్ నేనుకూడా వెళ్ళిపోతాను. అని నువ్వు అంగీకరించ గలిగితే ఇది వెళ్ళిపోతుంది. మరి ఉండేదెవరు.

తెలుసుకుంటున్నది ఏదుందో లోపల అది ఆత్మ. దానికిచావు లేదు. అదెప్పుడూ ఉంటుంది. అది నువ్వు. నువ్వు కూర్చో ఇది వెళ్ళిపోతుందని అంగీకరించి అన్నిటికీ సాక్షీ శివోఽ హం. నేనన్నిటికీ సాక్షిని నాకు వీటితో ఏమీ ప్రమేయం లేదు. నేను జాగృతికి సాక్షిని. సుషుప్తికి సాక్షిని. స్వప్నానికి సాక్షిని. అన్నింటికీ సాక్షిగా నేను చూస్తూ ఏది తెలుసుకుంటోందో అది నేనుగా గమనిస్తున్నాను. కేవలాద్వైతసిద్ధాంత ప్రచారకులై మహానుభావుడు ఉన్న సత్యమేదో ఇది అని చెప్పారు. దీనిమీద భాష్యాలొచ్చాయి. దీనిమీదే తరువాత ప్రచారం జరిగింది. దీనిమీదే ఇదే పరమోత్కృష్టమైన సిద్ధాంతమని ప్రపంచం అంగీకరించింది. శంకరభగవత్పాదుల లాంటి మహామేధావి వేరొకసారి పుడతాడా అని మనం ఊహించలేమని యావత్ప్రపంచమూ ఎలుగెత్తి ఘోషించింది. తెలివితేటలంటే శంకర భగవత్పాదులవే. అలా చెప్పటం వేరొకరికి సాధ్యంకాదు. ఇదీ వారి కారుణ్యం. ఎందుకు చెప్పాలి శంకరాచార్యులవారు మనందరికీ. చెప్పకపోతే పిల్లలు ఎలా తెలుసుకుంటారు. చెప్పాలి.

శంకరులు కూడా అలా దిగారు క్రిందకి. దేనికోసం లేకపోతే పిల్లలు ఎలా ఉద్ధరింపబడతారు. భక్తి బాగా నేర్పితే ఆ భక్తిలోంచి వీళ్ళు మెల్లిగా జ్ఞానం వైపుకు వెడతారు. ఈశ్వరకృప కలిగిందా? ఆ భక్తిలోంచి జ్ఞానమొస్తుంది. అందుకని చెప్పి ఆ భక్తి బాగా ఏర్పడాలి. భక్తి పరిణమిస్తే భక్తి పరిఢవిల్లితే భక్తి పండితే జ్ఞానం వస్తుంది. ఆ జ్ఞానంచేత మోక్షం వస్తుంది.

జ్ఞానం రావటానికి భక్తి ఉండాలి. కాబట్టి ఎక్కువమంది ఏస్థాయిలో ఉంటారు. అందరూ 'బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి' స్థాయిలోనో 'జగన్మిథ్యా బ్రహ్మసత్యం' స్థాయిలోనో ఉండరు. అటువంటి వారికోసమని శంకరాచార్యుల వారు దిగారు కిందకి. ఇప్పుడు వారు స్తోత్రాలను ఇచ్చారు. శంకరుల గొప్పతనమంతా ఎక్కడుందో తెలుసాండీ. నాకనిపిస్తుంది. శంకరాచార్యుల వారిలాంటి సైకియాట్రిస్టు ప్రపంచంలో లేడు. ఆయనంత మనస్తత్వ శాస్త్రవేత్త ఇంకొకడుండడు. నేనెందుకు ఈమాట అంటున్నానంటే మీకు లోపల నుంచి

కదిలే భావాలన్నీ మనసులో కదులుతాయి. మళ్ళీ అన్నీ ఎక్కడికి వెళ్ళిపోతాయంటే మనసులోకే వెళ్ళిపోతాయి. నేను ఈ మాటను కొంచెం వివరిస్తే మీరు తొందరగా పట్టుకుంటారు. అప్పుడు ఎందుకొస్తుందో మీకు అర్థమయిపోతుంది. ఒక నిర్మలమైన చెఱువు ఉందనుకోండి. మీరో రాయి పట్టుకెళ్ళి చెఱువు మధ్యలో పడేసారనుకోండి. వెంటనే ఏమవుతుంది. నీటిలో తరంగాలు వస్తాయి. అవి కదులుతాయి. కదిలి తరంగం ఏంచేస్తుంది. ఒడ్డు వరకు వస్తుంది. ఒడ్డును కొడుతుంది. వెనక్కి వెళ్లిపోతుంది. కాసేపటికి ప్రశాంతమయిపోతుంది. ప్రశాంతమైపోవటమంటే ఏమిటి? నీటిలో పుట్టిన తరంగ రూపమైన కదలిక ఆగిపోయింది. ఆగిపోయి తరంగం నీటిలోకి వెళ్ళిపోయింది. ఆ నీరు నిర్మలంగా ఉండిపోయింది.

తరంగం అన్న దానికి ప్రారంభం సృష్టి ఎక్క డ జరిగింది? చెఱువులో. దాని కదలిక ఎక్కడ జరిగింది చెఱువులో. అది ఎక్కడ లయమైపోయింది మళ్ళీ చెఱువులో. అలాగే నీ శరీరపు కదలికలు, మీ కోరికలు, మీ తృప్తి, మీ అసంతృప్తి అన్నీ మనసులోంచే వస్తాయి. నాకు ఆకలేసింది అంటుంది మనసు. అనగానే ఈ మాట చెప్పగానే నిర్మలంగా ఉన్న మనసులో కదలికవస్తుంది. వెంటనే మీరేం చేస్తారు. ఈ కాళ్ళు చేతులతో శరీరం కదిలి ఫ్రిజు దగ్గరికి వెళుతుంది. డోరు తీసి చూసుకుంటారు. ఆ ఉందిరా ఓ బంగినపల్లి మామిడిపండని తెచ్చుకుని కడుక్కుని ఓ పళ్ళెం పెట్టి చాకుపెట్టి ముక్కలు చేసుకుని తింటుంది. తిన్న తర్వాత హో కడుపు నిండింది అంటుంది. ఆకలి తీరింది అంటుంది. అప్పుడు మీరు ఏం చేస్తారు. కోరిక తీరుతుంది. ఎక్కడ కదిలింది ఆకలన్నది. బయట మీ ఇంట్లో ఎక్కడన్నా కదులుతున్నాయా? ఏమీ కదలవు. ఈ లోపల కదులుతాయి. ఆకలేసింది అన్న భావన ఏర్పడినప్పుడు మీ గుండెల్లో కొత్తమార్పు రాదు. ఊపిరితిత్తుల్లో కొత్తమార్పు రాదు. మనసులో కదలికలు వస్తాయి. దాన్ని బట్టి మనోవాక్కాయ కర్మలేర్పడతాయి. దాన్ని బట్టి మళ్ళీ తృప్తి అసంతృప్తి అన్న లయం ఇందులోకి

వస్తుంది. అసంతృప్తి వచ్చిందనుకోండి. పునః పునః పునఃపునః కదులుతూనే ఉంటుంది. ఎందుకంటే తృప్తి తీరలేదు. అందుకని ఆ నీళ్ళు కదులుతుంటాయి. అది తృప్తి పడిపోయిందనుకోండి ఆ నీరు మళ్ళీ నిర్మలంగా అయిపోతుంది.

ఇప్పుడు మీరు ప్రశాంతంగా ఉండాలి అంటే మీ ఆరోగ్యం కానీ మీ ఇంట్లో వాతావరణం కానీ అన్నీ దేనిమీద ఆధారపడతాయి. మీ మనసు ప్రశాంతత మీద ఆధారపడతాయి. మీ మనసు ప్రశాంతంగా ఉండాలంటే ప్రశాంతమైనదేదో దాన్ని పట్టుకోవాలి. అది ఏది? ఈశ్వరుడు. ఈశ్వరుడిని పట్టుకోవాలి. కానీ పట్టుకుంటుందా మన మనసు. పట్టుకోదు. ఈశ్వరుడిని వదిలిపెట్టి మిగిలిన వాటిని అన్నింటినీ పట్టుకుంటుంది. ఇప్పుడు ఏం చేయాలి.

గురువు గొప్పతనం ఎక్కడుంటుందంటే మీ మీద పెట్టి మాట్లాడితే మీరు సభలోంచి లేచి వెళ్ళిపోతారు. ఏంటండీ? శంకరాచార్యులవారికి మమ్మల్ని తిట్టడమే పనా అని. తాను అంత స్థితిలో ఉన్నా తనమీద పెట్టుకుంటారు శంకరాచార్యులవారు. మీకు ఒక ఉదాహరణ చెప్తాను. ఎంత గమ్మత్తుగా శంకరులు మాట్లాడతారన్న దానికి ఒక ఉదాహరణ. ఇది ఉదారత్వం అంటారు. ఇది కారుణ్యం అంటారు. తండ్రి కొడుకుని బాగుచేసుకోవటానికి చెప్పినట్టు శంకరులు ఎలా చెప్తారో చూడండి.

**అరహసి రహసి స్వతంత్ర బుద్ధ్యా,**
**వరివసితుం సులభః ప్రసన్న మూర్తిః,**
**అగణిత ఫలదాయకః ప్రభుర్మే,**
**జగదధికో హృది రాజశేఖరోఽస్తి.**

శివానందలహరిలో చెప్పారు శంకరాచార్యులవారీ శ్లోకాన్ని. ఏమిటా శ్లోకం అంటే అరహసి రహస్యంగా కాకుండా ప్రకటంగా పూజ చేసినా, రహసి ఏకాంతంగా ఎవ్వరూ లేకుండా పూజ చేసినా, స్వతంత్రబుద్ధ్యా పోనీ స్వేచ్ఛగా నీ ఇష్టమైన రీతిలో చేసినా అగణిత ఫలదాయకః నువ్వు పూజ

చేసినంత మాత్రం చేత నీ కోరికలన్నింటిని తీర్చగలిగిన ఈశ్వరుడు ప్రభుర్మే ఆయన ప్రభువై ఉన్నాడు. జగదధికో ఆయన జగత్తునంతటనీ అధిగమించినవాడు. పరాత్పరుడు. అటువంటి స్వామి హృదిరాజశేఖరోఽస్తి ఆయన నా హృదయమునందే రాజశేఖరుడై చంద్రశేఖరుడై విరాజిల్లుతున్నాడు. అని వ్రాసారు.

అరహసి- ఒకడు ప్రకటమైన పూజ చేస్తున్నాడు. తెలిసో తెలియకో ఇంట్లోవాళ్ళకి తెలియాలి. వీధిలో వాళ్ళకి తెలియాలి. ఆయన చాలా భక్తుడని అందరూ అనుకోవాలి. అందుకని అంత అల్లరి అంత పూజ మీకు తెలుసాండి. నేను ఇలా అన్నానని అనుకోవద్దు. కొంత కొంతమంది పూజ కేవలం పరువు కోసం చేస్తారు. ఇలా చేయకపోతే ఇంటికొచ్చిన పేపర్‌బాయ్, ఇంటికొచ్చిన పాలవాడు. ఇంటికొచ్చిన పనిమనిషి, బట్టలుతికే చాకలి వాళ్ళావిడ, వాళ్ళ పిల్లలు ఇంట్లో ఈయన రెండు రోజులనుంచి పూజ చేయలేదనుకుంటారని ఓ గంట కూర్చుంటారు. ఇవాళ శనివారమండీ మూడుగంటలు కూర్చోవాలండీ. మూడు గంటలు కూర్చోవాలండీ అని లక్ష్మీవారంనుండి బెంగ వాడికి. ఎందుకా పూజ. దానివల్ల ఏమిటీ ఉపయోగం. ఉపయోగమేమీ ఉండదు దానివల్ల కానీ శంకరులన్నారు దానికీ ఫలితమే. వాడు తెలిసో తెలియకో శివా అంటున్నాడా లేదా కూర్చుని. వాడు తెలిసో తెలియకో కష్టపడి మూడు గంటలు కూర్చున్నాడా లేదా? పెళ్లాం చూడాలనో, పిల్లలు చూడాలనో. చాకలాడు చూడాలనో, ఫోనుబిల్లు వాడు చూడాలనో లేకపోతే పేపర్‌బాయ్ చూడాలనో కూర్చున్నాడా లేదా? ఆ మాత్రమైనా కూర్చున్నాడు ఫలితమే. ఇది గురువుల గొప్పతనం. అందుకని అరహసి.

దీనికన్నా గొప్పది రహసి వాడు ఏకాంతంలో చేస్తున్నాడు. ఎవరికీ తెలియదు చేస్తున్నట్టు. ఒక్కడే చేస్తున్నాడు. ఎవరు చేసారో తెలుసాండి అలా? శంకరాచార్యులవారే చేసారు. అలా ఏకాంతంలో చేస్తున్నప్పుడు మీరు చేసింది మూడో కంటికి తెలియదు. శంకరాచార్యులవారు ఎవరండీ సన్యాసి. కాబట్టి

ఆయనకి పిల్లలుంటారా? పిల్లలుండరు. పిల్లలు లేనివాడు కన్యాదానం ఎలాచేస్తాడండి. మా అమ్మాయి ఉందండి మీరు పెళ్ళి చేసుకోండి. అని ఎవర్నన్నా వెళ్ళి అడగచ్చా శంకరాచార్యులవారు. అడిగారు మరి శంకరాచార్యులవారు. ఎందుకు చేసారు? అంటే ఏకాంతంనందు ఎలా ఉంటుందో చెప్పటానికి. అంటే నిజంగా శంకరాచార్యులవారికి పిల్లలున్నారను కోకండి మహాప్రభో. ఆయన ఎంత అందంగా మాట్లాడారంటే 'శివతవ పరిచర్యా సన్నిధానాయ గౌర్యా భవ'అని శంకరా! నీకు నా కూతుర్నిచ్చి పెళ్ళిచేద్దామనుకుంటున్నాను. ఎందుకు పెళ్ళిచేస్తాను. శివతవ పరిచర్యా అని పిలిచారు. ఎవరికిస్తార్ట పిల్లని శివుడికిస్తార్ట.

ఇవాళ తన కూతురికి పెళ్ళిచేసేటప్పుడు ఎలా మాట్టాడాలో అలా మాట్టాడుతున్నారు. శివా శివా నీకిద్దామనుకుంటున్నానయ్యా మా అమ్మాయిని. శివా అంటే మంగళప్రదమైన స్వరూపమున్నవాడు. పైకి శంకరుడు చూడ్డానికి ఎలా ఉంటాడో తెలుసాండి చాలా అమంగళంగా ఉన్నట్టుంటాడు.

**పునుకలపేరు కంఠమున భూరి భుజంగము భూషణమ్ముగా**
**ననయము భస్మధారణము అద్రి నివాసము మేరువిల్లుగా**
**ననువుగ దంతి చర్మమును హస్తములందు కపాల శూలముల్**
**పనివడి దాల్చు శంకరు కృపావరు రూపము నాశ్రయించెదన్**

అంటారు. మెడలో పునుకల మాల పెద్ద పెద్ద పాములు ఒంటినిండా విభూతి. వీటితో ఉంటాడు. నిజంగా శంకరుడంటే అలా ఉంటాడని మీరు అనుకుంటున్నారా? అలా ఉంటే అంత అందగాడు శ్రీమహావిష్ణువు పరమేశ్వరుడి గురించి తపస్సుచేసి భర్తగా చేసుకుందామని ఎందుకు కోరుకున్నాడు.

**వన్నే యేనుంగు తోలు దుప్పటము బువ్వా కాలకూటంబు చే**
**గిన్నే బ్రహ్మకపాల ముగ్ర మగు భోగే కంఠహారంబు మేల్**

**ని న్నీలాగున నుంటయుం దెలిసియున్ నీ పాదపద్మంబు సే**
**ర్చె న్నారాయణుఁ డెట్లు మానసముఁ దా శ్రీకాళహస్తీశ్వరా.**

అని ధూర్జటి ప్రశ్న వేసాడు శ్రీకాళహస్తీశ్వర శతకంలో.

ఏమయ్యా! శ్రీ మహావిష్ణువు చూస్తే అంత అందంగా ఉంటాడా? నువ్వు చూస్తే వన్నె ఏనుగుతోలు. రక్తమాంసాలోడుతున్న ఏనుగు చర్మం కట్టుకుంటావా? 'వన్నె యేనుగుతోలు దుప్పటము బువ్వా కాలకూటంబు' తినేది చూస్తే హాలాహలం తింటుంటావు. బువ్వా కాలకూటంబు చేగిన్నె బ్రహ్మకపాలము. బ్రహ్మగారి కపాలాన్ని చేతిలో పాత్రకింద పట్టుకుంటావు భిక్షాపాత్రకింద. 'చేగిన్నే బ్రహ్మకపాలముగ్రమగు భోగే కంఠహారంబు' పామును తీసుకొచ్చి మెడలో వేసుకుంటావు. ఇలా ఉన్నవాడివి ఎవడయ్యా అసలు నీ ఇంటికొస్తాడు. మరి అంత అందగాడు నారాయణుడు నిన్నెందుకయ్యా భర్తగా పొందాలని స్త్రీ శరీరాన్ని పొంది నీకు భార్యగా అయ్యాడని అడిగాడు. కాళహస్తీశ్వర శతకంలో అంటే దానర్థం ఏమిటి? శంకరుడి నిజస్వరూపం అదికాదు. ఆయనంత అందగాడు ప్రపంచంలో ఇంకొకడుండడు. సప్తర్షుల భార్యలు మోహించేసారు ఆయన్ని చూస్తే. అంటే మీరు ఆలోచించండి ఎంత అందగాడో. అందుకని శంకరాచార్యులవారు పిల్లనిచ్చేటప్పుడు మొదట ఏంచూస్తారు అందం చూస్తారు. అందుకని శివా! తవపరిచర్యా సన్నిధానాయ గౌర్యా భవా. పైకి చాలా అందంగా ఉన్నాడు. ఉంటే పిల్లనిచ్చేస్తారేంటి? ఏమిటి చూస్తారు ప్రధానంగా ఆడపిల్లనిచ్చేవాడు అవతలవాడు పురుషుడై ఉండాలి. ఆపిల్ల యందు సంతానాన్ని కనగలిగిన దక్షత ఉండాలి వాడికి. అందుకని అలా అయితేనే ఇస్తాడు. అందుకని భవా లోకమునంతటినీ కన్నవాడివి. తండ్రివి. అందుకని నువ్వు పురుషుడివి. అందుకని నీకిస్తా మా అమ్మాయిని.

**శివ! తవ పరిచర్యా సన్నిధానాయ గౌర్యా,**
**భవ మమ గుణ ధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే,**

**సకల భువన బంధో సచ్చిదానంద సింధో,**
**సదయ! హృదయగేహే సర్వదా సంవసత్వమ్.**

పిల్లనిచ్చేసేవాడు ఏదో పురుషుడు అందగాడు అయితే ఇచ్చేస్తారేమిటి? ఇవ్వరు. రేపొద్దున్న ఈ పిల్లాడికి పిల్లకి ఏమన్నా గొడవొస్తే కాస్త నలుగురు పెద్దమనుషులు ఎవరన్నా ఉండాలి. కాస్త తాతగారు, తండ్రిగారు, పెద్దనాన్న గారు పిన్నాన్న గారు వీళ్ళుంటే వెళ్ళి చెప్పచ్చు ఏమిటా పిల్లాడు అలా ప్రవర్తిస్తున్నాడని. వాళ్లు వెళ్ళి దెబ్బలాడతారు. అందుకని ఎవరైనా బంధువులున్నారా? అంటే సకల భువనబంధో అన్ని భువనాలు నీ బంధువులే సచ్చిదానంద సింధో. ఐశ్వర్యముండాలి. అందుకని సత్, చిత్ ఆనంద స్వరూపుడవు. అందుకని నీకిస్తానీ పిల్లని. ఎవరాపిల్ల ఇంతా చేస్తే నిజంగా శంకరాచార్యులవారికి కూతురుందా? అంటే నా బుద్ధి నా బుద్ధి అనబడే నా కూతుర్ని నీకిచ్చి పెళ్ళి చేస్తాను, అంటే శివుడేం అంటాడు? అదేమిటయో తప్పు ఇంతకుముందే నాకు పెళ్ళయిపోయింది గౌరీదేవి ఉందికదా అంటారా? శంకరా మా అమ్మాయిని నీకిస్తున్నది ఏదో తోడికోడళ్ళ గొడవ తేవడానికి కాదు. నీకు రెండో భార్య అక్కరలేదు. ఏం చేస్తుంది మా అమ్మాయి. నీకు నీ భార్యకి కలిపి సేవచేస్తుంది. తవ పరిచర్యా మీ ఇద్దరికి సేవ చేస్తుంది. కానీ నాదొక్క కండిషన్ ఏమిటోతెలుసా? సదయా నువ్వు చాలా దయకలిగిన వాడివి. అందుకని నేనడిగితే ఒప్పేసుకుంటావు. ఇన్ని గొప్పగుణాలున్నవాడు ఎందుకొప్పుకోవాలి? పెళ్ళి కూతురు తండ్రి అడిగితే. ఇన్ని గొప్ప గుణాలున్నా నువ్వు ఎందుకొప్పుకుంటావంటే నువ్వు చాలా దయ ఉన్నవాడివి. ఏమిటీ చేయాలి నువ్వు నా ఇంటికి ఇల్లరికం రావాలి. నాకు ఒక్కతే కూతురు బుద్ధి ఒక్కటేగదా ఉంటుంది. పదిబుద్ధులుండవు. అందుకని నాబుద్ధి అనబడే కూతుర్ని నీకిస్తాను. నువ్వు మాత్రం నా మనసులో స్థిరనివాసం ఉండిపోవాలి. ఇప్పుడు శంకరాచార్యులవారు అడిగింది యథార్థానికి నిజంగా వివాహం గురించి అడుగుతున్నారా? పార్వతీ పరమేశ్వరులిద్దరి పాదసేవ చేయడం కోసమని

తన బుద్ధిఅనే ఆడపిల్లని ఆయనకిచ్చి పెళ్ళిచేసి ఆయనొచ్చి తన మనస్సులో ఉండాలి అంటే దానర్థం ఏమిటి? పార్వతీ పరమేశ్వరులు తన గుండెల్లో కొలువై ఉండాలి. నిజంగా శంకరాచార్యులవారు పార్వతీ పరమేశ్వరుల అవతారం.

అటువంటి వారు మహాజ్ఞానం చేత శివస్వరూపుడు. కదలటంచేత శక్తి స్వరూపుడు. బోధ చేత గురు స్వరూపుడు. ఒక్క శంకరాచార్యులవారి మూర్తి ఇంట్లో ఉంటే శంకరాచార్యులవారి గుడికెళ్ళి నమస్కారంచేస్తే పార్వతీ పరమేశ్వరులకు నమస్కారం చేసినట్టే. అంత గొప్పది శంకరాచార్యుల స్వరూపం. మరి అటువంటప్పుడు ఇంట్లో వచ్చి ఉండటమెందుకు. మళ్ళీ వచ్చి ఉండటమేంటి గుండెల్లోనే ఉన్నారు. ఆయనే పార్వతీ పరమేశ్వర స్వరూపం. మనకోసమనీ కిందకు దిగుతారు గురువులు. ఎంత ఏకాంతంలో చేసిన పూజ చూడండి ఇది దీనికేమన్నా సంకల్పం, వ్రతకల్పం ఇవి ఉంటాయా? ఒక్కరూ కూర్చుని మనసులో భావన చేసారు. శంకరా నువ్వింత గొప్పవాడివి. నువ్వింత ఐశ్వర్యం ఉన్నవాడివి. నీతో మా అమ్మాయిఉంది. మా అమ్మాయంటే నా బుద్ధి. నా బుద్ధిని నీకిచ్చి పెళ్ళి చేస్తాను. అలా అని నీకేం మళ్ళీ ఇద్దరు పెళ్ళాలుండక్కరలేదు. గౌరీదేవితో కలిసి నా హృదయంలో కూర్చో. నా బుద్ధి నీకు సేవ చేస్తూంటుంది. అని అడగటానికి ఏదో తనకి కూతురున్నట్టు తను కన్యాదానం చేస్తున్నట్టు శంకరాచార్యులవారు ఏకాంతంలో అంటే ఎవరికీ వినపడకుండా లోపలే చేసిన పూజ ఈ పూజ. కాబట్టి ఇది ఏకాంత పూజ కాదా? అరహసి రహసి స్వతంత్రబుద్ధ్యాః వేరొకటి ఉంటుంది. అది స్వతంత్ర బుద్ధ్యా అది వాడికి చాలా స్వతంత్రంగా చేసేస్తాడు. చేసినపని ఇలా చేయచ్చా చేయకూడదా? అలోచించడు. యథార్థానికి శాస్త్రప్రకారంగా మీరు ఆలోచిస్తే చేసినవన్నీ తప్పులే. కానీ ఈశ్వరానుగ్రహం కలిగింది. ఎలా కలిగేస్తుంది. అంటే వాడికి అంతకన్నా అలోచించడం తెలియదు. వాడు అజ్ఞాని. దీనికి శంకరులే శివానందలహరిలో ఒక ఉదాహరణ ఇచ్చారు.

వైశాఖ శుక్ల పంచమినాడు నిజంగా ఈ శ్లోకం వింటే వారి జన్మ ధన్యమైపోయినట్లే.

**మార్గావర్తిత పాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే,**
**గండూషాంబు నిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే,**
**కించిత్ భక్షిత మాంసశేష కబళం నవ్యోపహారాయతే,**
**భక్తిః కిం నకరో త్యహో వనచరో భక్తావతంసాయకే.**

అన్నారు. తిన్నడు తిందామని ఒక అడవి పందిని చంపాడు. దాన్ని కాలుస్తున్నాడు. కాస్త వళ్ళు కడుక్కొని వచ్చి తిందాం అని. అలా వెళ్ళేటప్పటికి ఒక శివలింగం కనబడింది. ఒంటి మీద పువ్వులు వేసి ఉన్నాయి. ఆ పువ్వులన్నీ వాడిపోయి ఉన్నాయి. చూసాడు. అమ్మబాబోయ్ ఎన్నాళ్ళనుంచి ఉన్నాడో ఈ గుడిలో మహానుభావుడు. అన్నం తిన్నాడో తినలేదో అనుకున్నాడు. గబగబా పరుగెత్తాడు. స్నానం నేను కాదు ముందు శివలింగానికి అభిషేకం చెయ్యాలి అనుకున్నాడు. పరుగెత్తుకుంటూ వెళ్ళాడు. వెళ్ళి 'మార్గావర్తిత పాదుకా పశు పతే రంగస్య కూర్చాయతే', ఆ కాల్చిన పంది దగ్గరకి వెళ్ళాడు. ఇందులో బాగా కాలి రుచిగా ఉన్న మాంసం ఎక్కడ ఉంది అని, కత్తి పెట్టి నాలుగు చోట్ల నరికాడు. కొరికి చూశాడు. ఆ ఈ ముక్క రుచిగా ఉంది అని. ఆ మాంసం ముక్క ఎడం చేత్తో పట్టుకున్నాడు. ముందు స్నానం చేస్తే కాని తినడు ఆయన. అందునా అభిషేకం చేయాలి. ఒక చేతిలో ధనుస్సు ఉంది. ఓ చేతిలో ఎంగిలి మాంసం ముక్క ఉంది. ఏటి దగ్గిరికి వెళ్ళాడు. నీళ్ళు పట్టుకెళ్ళాలి. ఎలా పట్టుకెళతాడు? తొందరగా పట్టుకెళ్ళాలి అవతల ఆయనకి ఆకలి వేస్తోంది. ఎప్పటి నుంచి ఉండిపోయాడో. ఇది లోపల బాధ, భక్తి. అందుకని ఎలా పట్టుకెళతాడు నీళ్ళు. ఆ ఏటిలో ఉన్న నీళ్ళు పుక్కిట పట్టుకున్నాడు. పట్టుకుని గబగబగబగబా శివాలయంలోకి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయి ఆ ధనుస్సు పక్కన పారేశాడు. శివలింగం వంక చూశాడు. అయ్యో స్వామీ నీ మీద ఎప్పుడు చేశారో పూజ. ఇంత ఎండిపోయిన పూలు ఉన్నాయా?

మెత్తటి బ్రష్‌తో తీస్తారు శివలింగం మీంచి పువ్వుల్ని. అందుకని ఇప్పుడు బ్రష్ ఎక్కడ కనపడుతుంది? అందుకని ఏం చేశాడు? కూర్చ అంటే బ్రష్. అరణ్యంలో మలమూత్రాలన్నీ తొక్కుతూ వచ్చిన తన కాలి చెప్పు తీశాడు. ఆ చెప్పుతో శివలింగం మీద ఆ పువ్వులన్నీ తుడిచేశాడు. మరది అలా పూజ చెయ్యచ్చా? 'గండూషాంబునిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే' ఆ ఎంగిలి నీళ్ళు నోట్లో ఉన్నాయి. అవి తీసుకెళ్ళి శివలింగం మీద ఉమిశాడు. స్వామీ ఇది అభిషేకం అన్నాడు. ఉమిస్తే అది అభిషేకం అయింది. 'కించిత్‌భక్షిత మాంసశేష కబళం నవ్యోపహారాయతే', తను సగం నమిలి తీసుకొచ్చిన మాంసం ముక్క పట్టుకొచ్చాడు. శంకరా ఇది తిను అన్నాడు. అక్కడ పెట్టాడు. పెడితే శంకరుడు తీసుకుని తినేసాడు ఆ ఎంగిలి మాంసంముక్క 'నవ్యోపహారాయతే భక్తిః కిం నకరోత్య హెూ వనచరో భక్తావతంసాయకే' ఏమాశ్చర్యం స్వామీ భక్తికి ఇంత లొంగిపోయావా? ఎక్కడ శంకరుడండి.

మహా మహా ఆలయాల్లో కూర్చలు పెట్టి పువ్వులు తీసి పొద్దున చూస్తారుగదా ఏకవారాభిషేకం. అభిషేకం చేసేటప్పుడు స్వరం తప్పకుండా ఎంతో జాగ్రత్తగా నమస్తేఅస్తు భగవన్ విశ్వే శ్వరాయ మహాదేవాయ త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాలాగ్నికాలాయ కాలాగ్ని రుద్రాయ నీలకంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీమన్మహాదేవాయ నమః అంటూ అభిషేకం చేస్తారు. అటువంటి అభిషేకానికి బదులు ఎంగిలి నీళ్ళు పోసేసాడు శివలింగం మీద. మరి ఈశ్వరుడు శపించాడా? స్వతంత్రంగా ప్రవర్తించాడు. అయినా స్వీకరించలా? తండ్రి. స్వీకరించాడు. తిన్నడా ఎంత గొప్ప పూజచేసావురా? అన్నాడు. ఎందువల్ల. తిన్నడి స్థాయి అంతే ఆయన అజ్ఞానంలో ఉన్నాడు. మీరు కూడా అయ్యా తిన్నడిలాగే చేసాడు కదండి. చాలా బాగా అంగీకరించాడు కదా. మేము ఇలాగే అభిషేకం చేసుకుంటాం అన్నారనుకోండి లేనిపోని ప్రమాదాలు వస్తాయి. మీకు తెలుసు బుద్ధి. మీరంతకన్నా పైస్థాయిలో ఉన్నారు. ఏ స్థాయిలో ఉన్నవాడు ఆ స్థాయిలో

వైదిక కర్మాచరణం చేయాలి. తిన్నడికేమీ తెలియదు. తెలియని వాడు భక్తితో చేస్తే అంగీకరించాడు. తిన్నడికి భక్తి ఉందని శివుడికి ఎలా తెలుసండీ? అని మీరనచ్చు. అందుకే శంకరులు నిరూపించారు.

ఒక రోజున తిన్నడెళ్ళాడు. ఒక కంటి వెంట రక్తధార కారుతోంది. శంకరా నాకొక్కటే తెలుసు. కంటికి కన్ను పంటికి పన్ను నీకంట్లోంచి రక్తం వస్తోంది నే చూడలేను అని ఒక కన్ను బాణం పెట్టి పెకలించేసి శంకరుడి కన్ను కూడా పెకలించేసి ఈ కన్ను తీసుకెళ్ళి శంకరుడికి పెట్టేశాడు. పెట్టేస్తే శంకరుడు నవ్వుకున్నాడు. నవ్వుకుని ఇప్పుడేం చేస్తాడో చూస్తాను. అనుకుని రెండో కంటి వెంట నెత్తురు కారుతోంది. అయ్యా తండ్రీ ఓ కన్ను రక్తం తగ్గిపోయిందని సంతోషించాను, రెండో కంట్లోకి వచ్చిందా వ్యాధి. రెండో కంట్లోంచి నెత్తురు వస్తోందా? ఆ! నాకు వైద్యం తెలుసు. ఏం తెలుసు కంటికి కన్ను. ఇంకో కన్ను నాకుందిగా తీసి పెట్టేస్తాను అన్నాడు. ఆలోచన వచ్చింది. కన్ను తీసేస్తే మరి శంకరుడి కన్ను నాకు ఎలా కనబడుతుంది. అందుకని కాలి బొటనవేలు తీసి గుర్తుకి శంకరుడి కన్ను దగ్గర పెట్టాడు. తన బాణంతో రెండో కన్ను పెకలించేసాడు. పెకలించేస్తే కనుగుడ్డు ఊడిపోతోంది. నెత్తురు కారిపోతోంది. కారిపోతూంటే చూడలేకపోయాడు సదాశివుడు. ప్రత్యక్షమైపోయాడు. 'చంద్రోద్భాసిత శేఖరే స్మరహరే గంగాధరే శంకరే సర్పైర్భూషిత కంఠకర్ణ వివరే నేత్రోత్థవైశ్వానరే దంతత్వక్కృత సుందరాంబర ధరే త్రైలోక్యసారే హరే' అని కనబడి దర్శనమిచ్చి 'తిన్నడా నీ భక్తికి పొంగిపోయానయా కాళహస్తిలో నేను క్రింద కూర్చుంటాను. నువ్వు కొండమీద కూర్చో. నాకన్నా పైన నువ్వు కూర్చో'మని కొండమీద తిన్నడ్ని కూర్చోపెట్టి తాను కింద కూర్చున్నాడు. లొంగాడా లొంగలేదా? పరమాత్మ. స్వతంత్ర బుద్ధ్యా ఒకనాడు ఏమీ తెలియకుండా తనకున్న స్థాయిలో భక్తితో ప్రవర్తించినా ఈశ్వరుడు లొంగాడు. నువ్వు ఎంతకాలం భయపెడతావు జనాల్ని. అలా చేయకండి కొంపలారిపోతాయి. ఇలాచేయకండి కొంపలారిపోతాయి. అలా మాట్లాడకూడదు గురువులు.

గురువులు మాట్లాడేటప్పుడు చాలా సౌమ్యంగా, శాంతంగా మీరు చేస్తున్నది చాలా మంచిదే కానీయండి ఇలా మార్చండి. ఇంకొక మెట్టు పైకెక్కండి. ఇంకొక మెట్టెక్కండి అని ఎక్కించాలి. తండ్రి బుడిబుడి అడుగులు వేసే పిల్లవాడికి వేళ్ళిచ్చి అడుగులు వేయించినట్టు వేయించగలిగిన సమర్థుడు గురువు. శిష్యుల్ని భయపెట్టేసేవాడు గురువెందుకవుతాడు. అందుచేత ఇది శంకరుల ప్రజ్ఞంటే. అందుకని

**'స్వతంత్ర బుద్ధ్యా వరివసితుం' తండ్రీ! బహిరంగంగా పూజ చేసినవాడికి ఫలితం ఇస్తున్నావు. ఏకాంతపూజ చేసినవాడికి ఫలితమిస్తున్నావు.** స్వతంత్రంగా పూజ చేస్తున్నవాడికీ ఫలితమిస్తున్నావు. ఎంత ఔదార్యమూర్తివయ్యా శివా నువ్వు. ఇప్పుడెవరికోసం మాట్లాడాడిది. భక్తి స్థాయిలో ఉన్నవారిని ఉద్ధరిస్తున్నారు. ఇప్పుడు మీకేం అనిపిస్తుంది ఈ శ్లోకం వింటే. ఏమండి అంత మహానుభావుడండీ శంకరుడు. మేం కూడా ప్రతిరోజూ ఒక్క రెండు పువ్వులు తీసుకెళ్ళి స్వామి పటం దగ్గర వేసి నమస్కారం చేసి ఓ అగరొత్తి చూపిస్తాం అంటారు. ఓ నాల్రోజులు పోతుంది మీ ఇంటికి ఎవరో వచ్చారనుకోండి. ఏమండీ మా పూజామందిరంలో ఇది శివుడి ఫొటో అని అనరు. ఏమంటారు. మా కాళహస్తీశ్వరుడండీ. మా స్వామి మమ్మల్ని కాపాడుతున్నవాడు ఇదిగో ఇక్కడున్నాడంటారు. ఇప్పుడు మీకు ఫొటో కాదది. ఎవరది? మీ స్వామి. ఏమంటారు పూజా మందిరంలో మా స్వామిని దర్శనం చేయండి అంటారు. మీరు కూడా వంగి వంగి నమస్కారం చేస్తూ వెళతారు. వెళ్ళి అయ్యా మా స్వామి ఉన్నాడండీ. ఆయనే మమ్మల్ని రక్షిస్తున్నాడంటారు.

ఇప్పుడు మీ పూజా మందిరంలోవి విగ్రహాలా స్వామా? స్వామే ఎదుగుతారా స్థాయికి. ఎత్తుతాడు. ఎత్తి ఎత్తి ఎత్తి ఎత్తి జ్ఞానం వైపుకు తీసుకెడతాడు. అందుకే శంకరాచార్యులవారు మనసు మార్చడం మీదే ప్రధానమైన ధ్యేయం పెట్టుకున్నారు. అందుకే ఏకాంత పూజలో ఎక్కడివరకు తీసుకెళ్లి పోయారో తెలుసాండి శంకరులు. పూజా మందిరంలో కూర్చుని

మీరు పూజ చేయటమే పూజ అనుకుంటే మీరుబాగా జ్ఞాపకం పెట్టుకోండి. మీరు చేస్తున్నంత తప్పు పూజ ప్రపంచంలో ఎవరూ చేయరు. మీకు రోజుకి 24 గంటల సమయం. 24 గంటల సమయంలో మీరు పూజా మందిరంలో ఎంతసేపు కూర్చుంటారు. ఒక అరగంట కూర్చుంటారు. గంట కూర్చుంటారు. అయిపోయింది పూజ అనుకున్నారనుకోండి. మిగిలిన 23 గంటల 30 నిమిషాలు అన్యప్రయోజనమే అరగంటే భగవంతునికి కేటాయించినట్టు. మీ మనసుని భగవంతుని దగ్గర పెట్టడం మీరు నేర్చుకున్నారనుకోండి. మీరు ఎప్పుడు కావాలంటే ఎక్కడ కావాలంటే అక్కడ పూజ చేసుకోవచ్చు. శంకరాచార్యులవారు ఇదే మనకు నేర్పారు. శంకరులు చేసిన ఈ ప్రయోగం ఇంక ప్రపంచంలో ఎవరూ చేయలేరు. వారంటారు మానస పూజలో

**రత్నైః కల్పిత మాసనం, హిమజలైః స్నానం చ దివ్యాంబరం**
**నానారత్న విభూషితం, మృగమదామోదాంకితం, చందనమ్,**
**జాజీచంపక బిల్వపత్ర రచితం, పుష్పం చ ధూపం తథా**
**దీపం దేవ! దయానిధే! పశుపతే ! హృత్కల్పితం గృహ్యతామ్.**
**సౌవర్ణే మణిఖండ రత్నరచితే పాత్రే ఘృతం పాయసం**
**భక్ష్యంపంచవిధం పయోదధియుతం రంభాఫలంస్వాదుదమ్,**
**శాకానామయుతం, జలం, రుచికరం, కర్పూరఖండోజ్జ్వలం**
**తాంబూలం, మనసా మయా విరచితం, భక్త్యా ప్రభో స్వీకురు.**

**ఛత్రం చామరయోర్యుగం, వ్యజనకం, చాదర్శకం నిర్మలం**
**వీణాభేరి మృదంగ కాహళకలాగీతం చ నృత్యం తథా,**
**సాష్టాంగం ప్రణతిః స్తుతిర్బహువిధా హ్యేతత్ సమస్తంమయా**
**సంకల్పేన సమర్పితం, తవ విభో! పూజాం గృహాణ ప్రభో!**

**ఆత్మాత్వం గిరిజా మతిః సహచరాః ప్రాణాః శరీరం గృహం**
**పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధి స్థితిః,**

**సంచారః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వా గిరో**
**యద్యత్ కర్మ కరోమి తత్తదఖిలం, శంభో! తవారాధనమ్.**

ఇప్పుడేమయిపోయింది.

మీరెక్కడికెళ్ళాలి. పూజచేయటానికి. మీరు ఆఫీసులో కూర్చున్నారు. మీకో పావుగంట ఖాళీ వచ్చింది. మీరేం చేస్తున్నారో ప్రపంచంలో ఎవరికీ తెలియదు. మీరు చెప్పులు విప్పేసి అలా కూర్చుని కళ్ళు మూసుకుని మీరు నిశ్శబ్దంగా వారణాసి పట్టణానికి వెళ్లిపోయి వారణాసిలో గంగ ఉత్తుంగ తరంగాలతో ప్రవహిస్తుంటే మీరా గంగ ఒడ్డుకెళ్ళి అమ్మా గంగమ్మా అని ఒక నమస్కారం చేసి, ఆ గంగమ్మలో కాస్త పసుపు వేసి, కుంకుమ వేసి ఇన్ని పువ్వులు వేసి మీరా గంగలోకి దిగి మొలలోతు నీళ్ళు వెళ్ళిపోతుంటే ఎంతో సంతోషంగా ముక్కిలా మూసుకుని రెండు చెవులూ మూసుకుని గంగలో మూడు మార్లు మునకవేసి పైకితేలితే ఆ ఎదురుగుండా పడవలన్నీ నిలబడుంటే, నీ చుట్టుపక్కలందరూ పీఠాధిపతులు స్నానాలు చేస్తుంటే మీకు ఆవలివైపున చంద్రశేఖర పరమానంద స్వామి సత్యదండం పట్టుకుని మునిగి స్నానం చేస్తుంటే ఆ పక్కన ఆదిశంకర భగవత్పాదులు స్నానం చేస్తుంటే వారితో మీరు కూడా స్నానంచేసి ఒడ్డుకొచ్చి తడిబట్ట విప్పి ఓ పొడిపంచె కట్టుకుని మీద ఓ ఉత్తరీయం వేసుకుని ఆ వారణాసి దేవాలయంలోకి వెళ్ళి మానసపూజ చేసేటప్పుడు మీరు ఎలా కోరుకుంటే అలా? ఎవరూ లేరు విశ్వేశ్వర లింగం దగ్గర.

హాయిగా మీరు వెళ్ళి కూర్చుని మీ భార్యని ఎడంచేతి ప్రక్కన కూర్చోపెట్టుకుని 'రత్నైః కల్పితమాసనం హిమజలైః స్నానంచ దివ్యాంబరం.' చల్లటినీళ్ళు గంగలోనుంచి తెచ్చాను శంకరా ఇదిగో బంగారు పాత్రలో పట్టుకొచ్చాను. కమండలం ముంచి అలా నీళ్ళు శివలింగంమీద ధారగా పోస్తుంటే ఆపైన ఉపరితలంమీద నీరంతా చింది అన్ని వైపులనుంచి ఆ నీరు

జారిపోతుంటే మీరు మనసులో దర్శనం చేస్తూ ఆ గంగాజలాన్ని చల్లటి గంగని పోసేస్తే శివలింగం అంతా చల్లగా అయిపోతే మీరా విశ్వేశ్వర లింగాన్ని చేత్తో పట్టుకుని చల్లదనాన్ని అనుభవించి నీ నుదిటిని తీసుకెళ్ళి శివలింగానికి తాకిస్తే దాని కున్న విభూతి మీ నుదిటికి అంటుకుంటే తర్వాత శివలింగాన్నంతటినీ చక్కగా పొడిబట్టతో తుడిచేసి కాస్త విభూతి తీసి దానికి విభూతి పెట్టి చక్కటి కుంకుమ బొట్టు పెట్టి పైన ఉపరితలానికి చందనం రాసి ఏదీ ఆపళ్ళెం ఇలా ఇయ్యి అని మీరు మీ భార్యతో అంటే 'జాజీ చంపక బిల్వపత్రరచిహితం పుష్పంచ ధూపం తథా'.

ఆవిడో బంగారు పాత్రలో అప్పుడే విచ్చుకున్న సన్నజాజిపూలు, మల్లెపూలు, లేత మారేడు దళాలు తెచ్చి మీ పక్కన పెడితే మీరు ఒక్కొక్క పువ్వు తీసి 'ఓం నిధనపతయే నమః, ఓం నిధనపతాంతికాయ నమః, ఓం ఊర్ధాయ నమః, ఓం ఊర్ధ్వ లింగాయ నమః, ఓం హిరణ్యాయ నమః, ఓం హిరణ్యలింగాయ నమః'. అని మీరు వేస్తూంటే ఆ సన్నజాజిపూలు, మల్లెపూలు, కనకాంబరాలు, మారేడు దళాలు, ఇవన్నీ శివలింగంమీద పడి కిందపడుతుంటే ఆకుపచ్చ, ఎఱుపు, పసుపు పూలతో శివలింగం నిండి పోతే మీరు కొద్దిగా పూలు పక్కకి తప్పించి ఎఱ్ఱటి కుంకుమ బొట్టు కనబడేటట్టు శివలింగం దగ్గర కూర్చుని ఏదీ ధూపమియ్యి అంటే ఆవిడ దీపంలో వెలిగించి ధూపమిస్తే గంట గణగణగణ వాయిస్తూ ఆ ధూపాన్ని శివలింగానికి దగ్గరగా చూపించి 'జాజీ చంపక బిల్వ పత్ర రచితం పుష్పంచ ధూపం తథా దీపం దేవ! దయానిధే! పశుపతే! హృత్కల్పితం గృహ్యతామ్ ఏదా దీపం ఇలా పట్రా. అంటే అక్కడ బంగారు ప్రమిదలో వేసిన దీపాన్ని తీసుకొస్తే స్వామీ దీపం దర్శయామి అని చూపిస్తే ఆ దీపపు కాంతులలో శివలింగాన్ని దర్శనం చేసి ఆ దీపం మీద నాలుగు అక్షతలు వేసి స్వామీ ఇదిగో చూసావా నీకోసమని అయిదు రకాల పిండి వంటలు తయారుచేసాను. ఇదిగో కజ్జికాయలు ఇదిగో పాయసం, జీడిపప్పు, ఏలకులు, కిస్‌మిస్‌లు పైకి తేలిపోయి ఉన్నాయి. మాంచి సువాసన

కొట్టేస్తోంది. బంగారు పళ్ళేలు మూతలు తీయవే అనేటప్పటికి భార్య అన్నీ మూతలు తీసి నైవేద్యానికి పాయసాన్ని, పానకాన్ని, తొక్క తీసేసిన పెద్ద పెద్ద చక్కరకేళి అరటిపళ్ళు, అమృతపాణి అరటిపళ్ళు, మగ్గిపోయిన అంతంత జామపళ్ళు, ఇంతంత చెఱకు రసాలు, పెద్ద పెద్ద బంగినపల్లి మామిడిపళ్ళు అన్నీ పళ్ళాల్లో పట్టి ఉదకం తీసి తమలపాకుతో 'ఓం భూర్భువస్వః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహిః ధియో యోనః ప్రచోదయాత్ సత్యం తత్త్వేన పర్యంచామి. అమృతమస్తు అమృతోపస్తరణమసి శ్రీ ఉమామహేశ్వర పరబ్రహ్మార్పణమస్తు. అవసర నైవేద్యం సమర్పయామి. ఓం ప్రాణాయ స్వాహా' అని మీరు ఇస్తూ ఉంటే సుబ్రహ్మణ్యేశ్వరుడు వినాయకుడు నందీశ్వరుడు, భృంగి వీళ్ళందరూ కలిసి ఆ మామిడిపండు ముక్కలు, జామపండుముక్కలు అన్నీ తినేస్తే స్వామీ మెల్లిగా తిను అని ఉత్తరాపోశనం సమర్పయామి.

కొంచెంనీళ్ళు తాగమంటే మీ ఆవిడ బంగారు పళ్ళెంలో గ్లాసులు పెట్టి పట్టుకొస్తే, మీరు ఇలా కూర్చుని ఇస్తే ఎట్టిటి చేతులతో అమ్మవారు. తెల్లటి చేతులతో స్వామి పట్టుకుని ఇలా తాగుతూంటే ఆ బంగారు పాత్ర అంచుకింద ఎఱ్ఱటి పెదవులు కనబడుతుంటే తాగేసిన నీటిపాత్ర అక్కడ పెడితే అమ్మా తాంబూలం వేసుకోమని తాంబూలం ఇస్తే 'తాంబూలం మనసామయా విరచితం భక్త్యాప్రభోస్వీ కురు.' ఆ తాంబూలం వేసుకుని ఎఱ్ఱటి నోటితో అమ్మవారు. ఎఱ్ఱటి నోటితో అయ్యవారు సరస్వతీ వీణ వాయిస్తుంటే అమ్మవారు సంతోషంగా ఇలా అంటుంటే ఆ వినేటప్పటికి ఆ తాటంకాలు అటూ ఇటూ కదిలితే అమ్మవారి బుగ్గలనే అద్దాలలో ఆ తాటంకాలు ప్రతిఫలిస్తుంటే మీరు చూసి అమ్మా ఎంత అందంగా ఉన్నారమ్మా? నా కనురావు తగులుతుందేమోనమ్మా అని ఇంత నీరాజనం పాత్రలో వేసి అదికూడ మానసికంగా చేయటానికి దరిద్రమా?

బంగారు పాత్ర హారతిపాత్ర పట్టుకుని అందులో కర్పూరం వెలిగించి గణ గణ గణ గంట కొడుతూ దానిని తిప్పుతూ శివలింగం చుట్టూ తిప్పుతూ

**'ఉమా కాంతాయ కాంతాయ కామితార్థ ప్రదాయినే,**
**శ్రీ గిరీశాయ దేవాయ మల్లినాథాయ మంగళం'**

అని మీరా నీరాజనం చూపిస్తుంటే  అందులో మెరిసిపోతున్న ఆ శివలింగాన్ని దర్శనం చేసి నీరాజన పాత్ర అక్కడ పెట్టి దానిమీద నీళ్ళచుక్క వేసి మీరూ మీ భార్య లేచి నిలబడి 'రాజాధి రాజాయ ప్రసహ్యసాహినే నమో వయం వైశ్రవణాయ కుర్మహే' అని మంత్రపుష్పం చెప్పి ఆ పువ్వులు తీసుకెళ్ళి శివలింగం మీద వేసి ఈ పూజ మీకు ధారపోస్తున్నానని ధారపోసి అక్కడ కూర్చుని స్వామీ ఒక పాటపాడతాను వినండి అని మీరు అక్కడ కూర్చుని సాంబ శివాయనరే శంకరుడేం తప్పు పట్టడు.

మీరు కూర్చుని ఆయనముందు ఒక పాట పాడేసి చూడండి కాసేపు వీణ వాయిస్తాను అని వీణ పట్టుకుని మీరే అద్భుతంగా

**జటాకటాహసంభ్రమ భ్రమన్నిలింప నిర్ఝరీ,**
**విలోల వీచి వల్లరీ విరాజమాన మూర్ధని,**
**ధగద్ధగద్ధగ జ్జ్వలల్లలాట పట్టపావకే,**
**కిశోర చంద్రశేఖరే రతిఃప్రతిక్షణం మమ.**

**అఖర్వ సర్వ మంగళా కళాకదంబ మంజరీ,**
**రసప్రవాహ మాధురీ విజృంభణామధువ్రతం,**
**స్మరాంతకం, పురాంతకం, భవాంతకం, మఖాంతకం,**
**గజాంతకాంధ కాంతకం తమంతకాంతకం భజే.**

అని వీణ వాయించి. అమ్మా ప్రసాదం ఇస్తావా అంటే అమ్మవారు భౌతర్వీ కుంభౌ మణికనక సంభావిత గుణౌ తదానా పాండిభ్యాం అమృతరసతాన్న కళితై కలాద్యా కళ్యాణి కలిత సదనా శ్రీగిరి శరసస్యసౌ భ్రామరి అంబా రచయిత.......... ఏదినాన్నా చేయిపట్టు  అంటే ఇలా చేయి చాపితే అమ్మవారు మణిగణ ఖచితమైనటువంటి బంగారు తెడ్డుతో పాయసాన్ని

తీసి నీచేతిలో వేస్తే ఆ పచ్చటి పాయసం అందుకని ఘుమఘుమలాడిపోతుంటే కళ్ళకద్దుకుని ఒక్కసారి తినేసి ఆ చెయ్యి కడిగేసుకుని తెల్లటి శంకరుడి పాదాలు, ఎఱ్ఱటి అమ్మవారి పాదాలమీద మీ శిరస్సు తాటించి అలా నమస్కారంచేస్తుంటే రెండు ప్రక్కల ఏనుగులు నిలబడి పద్మకింజల్కాలతో అభిషేకం చేస్తే అవి మీ తలమీద మెడమీద పడితే మీ మెడ తడిసిపోతే ఆ మంచు బిందువులతో అప్పుడు మీరు లేచి అమ్మకో నమస్కారంచేసి అమ్మా ఎంత వైభవమ్మా అని మీరు పొంగిపోతుంటే పక్కనున్నవాడు ఎవడో వచ్చి కోటేశ్వరరావుగారు మీకీ ఫైలు ఇమ్మన్నారండీ అన్నాడనుకోండి. అలాగేనండీ అని మీరు పుచ్చుకుని చెప్పులు వేసుకున్నారనుకోండి. ఇప్పుడు మీరు ఎక్కడిదాకా వెళ్ళినట్టు ఇంతసేపు. మీరు వారణాసి వెళ్ళిపోయినట్టా? వెళ్ళిపోనట్టా? వెళ్ళిపోయినట్టే. ఇలా అయితే ఏమయింది. ఇలా వెళ్ళగా ఆత్మాత్వం అలవాటు పడిపోతే ఇందులో ఉన్న ఆత్మ సదాశివుడిది. 'ఆత్మాత్వం గిరిజా మతిః' మా అమ్మ పార్వతీ దేవి నా మనస్సు. 'సహచరాః ప్రాణాః' నా పంచప్రాణములున్నాయే ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానాలు స్వామీ ఇవి నీ సహచరులు. 'సహచరాః ప్రాణాః శరీరం గృహం.' నాశరీరం దేవాలయం. ఇందులో నాస్వామి కొలువై ఉన్నాడు. ఇందులోనే ఉంటారు పార్వతీ పరమేశ్వరులు. ఇక్కడున్నారు నాకేంలోటు. నేను నడుస్తున్న దేవాలయాన్ని అని మీరు అనుకుంటే సహచరాః ప్రాణాః శరీరం గృహం. పూజాతే విషయోపభోగ రచనా- తప్పక నేనెప్పుడైనా ఓ ఫైలు వ్రాయడం, ఎవరితోనైనా మాట్లాడితే స్వామీ ఇదంతా నీ పూజనుకో, నిద్రా సమాధిస్థితిః నేను పడుకోబోయే ముందు ఒక్కసారి స్వామి దర్శనంచేసుకుని పులకరింతలతో హాయిగా పడుకుని నిద్రపోతుంటే అది 'సమాధిస్థితిః సంచారః పదయోః ప్రదక్షిణవిధిః' నేను తిరిగిన తిరుగుడంతా ఎప్పుడూ వాళ్ళని తలుచుకుంటాను కాబట్టి ప్రదక్షిణమైపోవుగాక. 'సంచార పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాగిరః' ఎప్పుడూ వాళ్ళ గురించే ఆలోచిస్తాను కాబట్టి నేను మాట్లాడిన మాటలు స్వామికి స్తోత్రాలు.

'సర్వాగిరాఃయద్యత్ కర్మ కరోమి తత్త దఖిలం తత్తదఖిలం శంభో తవారాధనం' నేను ఊహించిన ఊహలు ఆలోచనలు అంతా శంకరా నీ ఆరాధన మగుచున్నది. జగద్గురువులు మనకిది నేర్పారు. ఇది శంకరులకి ఇది చేతకాకా అయ్యో పిల్లాడికి ఎలా తెలుస్తుంది పూజా మందిరంలో చేసిన పూజ పూజ అనుకుంటున్నాడు.

మానస పూజ ఎలా చేయాలో మనం నేర్పాలి పిల్లాడికి. ఒక్కొక్కడికి సరస్వతీ కటాక్షం కావాలి. పిల్లవాడు వృద్ధిలోకి రావాలనుకున్నాడనుకోండి. రేపొద్దున్న పిల్లాడికి అక్షరాభ్యాసం చేస్తారు. నేనొక్కమాట పరమసత్యం చెప్తున్నాను.

**శరజ్జ్యోత్స్నాశుద్ధాం శశియుత జటాజూటమకుటాం,**
**వరత్రాసత్రాణ స్ఫటికఘుటికా పుస్తకకరామ్,**
**సకృన్నత్వా నత్వా కథమివ సతాం సన్నిధథతే,**
**మధుక్షీర ద్రాక్షా మధురిమ ధురీణాః ఫణితయః॥**

**కదా కాలే మాతః కథయ కలితాలక్తక రసం**
**పిబేయం విదార్థీ తవచరణ నిర్ణేజన జలమ్,**
**ప్రకృత్యా మూకానా మపి చ కవితా కారణతయా,**
**కదా ధత్తే వాణీ ముఖకమల తాంబూల రసతామ్॥**

అని శంకరభగవత్పాదులు సౌందర్యలహరిలో చేసిన రెండు శ్లోకాలు మీ పిల్లలకి నేర్పి ప్రతిరోజు సాయంకాలం త్రిపురసుందరమ్మవారి గుళ్ళో ఒరేయ్ నువ్వు ప్రదక్షిణం చేసి శంకరాచార్యుల వారి దగ్గర నిలబడి ఈ రెండు శ్లోకాలు చెప్పి వస్తూఉండు అని చెప్పండి.

మీ పిల్లవాడు ఒకనాడు ఈ భారతదేశంలో వారి దర్శనం చేయడమే అదృష్టమనుకునే ఒక మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు అవ్వచ్చు. లేదా ఒక

జగదీశ్ చంద్రబోస్ అవ్వచ్చు లేదా ఒక గొప్ప వేద పండితుడు అవ్వచ్చు. లేదా ఒక ఆది శంకరులే అవ్వచ్చు. లేదా పొద్దున్న వచ్చిన ఒక్క కృష్ణావధాన్లుగారవచ్చు. ఏదైనా అవ్వచ్చు. ఆ శక్తి శంకరాచార్యులవారి కృప వల్ల వస్తుంది. అందుకని జగద్గురువుల ముందు నిలబడి చెయ్యవలసిన స్తోత్రం. ఆ సరస్వతీ కటాక్షానికి ఎంత గొప్ప శ్లోకం ఇచ్చారండి. బంగారు పాత్ర పట్టుకెళ్లి అమ్మవారి పాదాల క్రింద పెట్టి నీళ్ళు పోసి తన కుడిచేత్తో పాదాలు కడిగితే అమ్మ పాదాలకు ఉన్న లత్తుక నీటిలో కరిగితే పాత్ర తీసి పక్కన పెట్టి ఎడంచేతి ఉద్ధరిణితో ఆ నీళ్ళు కుడిచేతిలో పోసుకుని ఇలా నోట్లో పోసుకుంటే 'పిబేయం విద్యార్థి తవ చరణ నిర్ణేజన జలం' మానసికంగా ఎలా కడగాలో నేర్పారు శంకరాచార్యులవారు. 'ప్రకృత్యా మూకానా మపి చ కవితా కారణతయా' సహజంగా మూగవాడు మహాకవి అయిపోతాడు ఈ రెండు శ్లోకాలు శంకరులముందు చదివించండి మీ పిల్లలతోటి. శంకరుల దేవాలయం ఈశ్వరానుగ్రహంగా రెడ్డిగారి అదృష్ట విశేషంచేత వారి పూర్వ పుణ్య విశేషం చేత ఈశ్వరుడు వారిని ఎంచుకున్నాడు. వారు నిర్మించారు. దాన్ని మనం ఉపయోగించుకోకపోతే అది నిరుపయోగం అయిపోతుంది.

మందక్కడ ఉంది. జబ్బిక్కడ ఉంది. ఆమందు పుచ్చుకోవడంలేదు. జబ్బు ఎందుకు తగ్గుతుంది. మీ పిల్లలను ప్రతిరోజూ పంపించి సౌందర్య లహరిలో తప్పుల్లేకుండా ఆ రెండు శ్లోకాలు చదవటం నేర్పించండి. అమ్మలు చక్కగా వచ్చి కూర్చుని అన్నపూర్ణాష్టకం చేసుకోండి. మగవాళ్ళు వచ్చి కూర్చుని కనకధారా స్తోత్రం చేసుకోండి. మీ ఇళ్ళు ఎంత వైభవంగా ఉంటాయో ఎన్ని కోరికలు తీరుతాయో జగద్గురువులు ఇక్కడకొచ్చి కూర్చున్నందుకు ఎంత ఫలితమొస్తుందో అక్కడ కూర్చుని రోజూ 'రత్నైఃకల్పిత మానసం హిమజలైః స్నానంచ దివ్యాంబరం.' ఒక ఎక్సరసైజు చేస్తుండండి. శంకరా మీరే మాకు నేర్పాలి. అని కూర్చుని మానసపూజ చేయడం నేర్చుకోండి.

అలా మీరుతిరుపతి వెళ్ళచ్చు. శ్రీశైలం వెళ్ళిపోవచ్చు. వారణాసి వెళ్లిపోవచ్చు. ఎక్కడికైనా వెళ్ళిపోవచ్చు. శంకరాచార్యులవారు తీసుకెళ్ళిపోతారు. అలా మీకు అలవాటైపోతే మీ జన్మ ధన్యమైపోతుంది. ఇన్నిస్తోత్రాలు మనకిచ్చి మనల్ని ఉద్ధరించిన మహానుభావుడు శంకర భగవత్పాదులు.

